Venkataraya Shastri, Vedam, ?d

1853-1929

స్త్రీపునర్వివాహ దుర్వాద నిర్వాపణము

Madras, 1924

Record no. 635

Venkataraya Shastri, Vedam, ?d

1853-1929

Strīpunarvivāha durvāda

nirvāpaṇamu

Madras, 1924

# SUNDARAYYA VIGNANA KENDRAM

1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

Venkataraya Shastri, Vedam, ?d 1853-1929

స్త్రీపునర్వివాహ దుర్వాద నిర్వాపణము / వేదము వేంకటరాయశాస్త్రిచే విరచితము.- 2. ముద్రణము.- Madras : K.V. Krishna Press, 1924.

(2), 122 p. ; 21 cm.

Record no. 635

Venkataraya Shastri, Vedam, ?d 1853-1929

Strīpunarvivāha durvāda nirvāpaṇamu / Vēdamu Vēṅkaṭarāyaśāstricē viracitamu.- 2. mudraṇamu.- Madras : K.V. Krishna Press, 1924.

(2), 122 p. ; 21 cm.

Record no. 635

35 mm microfilm

Image placement: IA IIA IB IIB Date filming began: 22 January, 2006




శ్రీ

# స్త్రీ పునర్వివాహ దుర్వాద నిర్వాపణము

శ్రీమచ్ఛారదా పీఠాధిష్ఠాతృ శ్రీమజ్జగద్గురు
భారతీకృష్ణతీర్థ
శంకరాచార్యస్వామి ప్రసాదిత మహామహోపాధ్యాయాద్యనేక
బిరుదాంకితుఁడయిన
వేదము వేంకటరాయశాస్త్రిచే
విరచితము





[వే]దము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్
[...]శ్వరస్వామి గుడియందు, లింగిసెట్టి వీధి, మదరాసు - 1

శ్రీ

# శ్రీపునర్వివాహదుర్వాద నిర్వాపణము.

శ్రీమచ్ఛారదా పీఠాధిష్ఠాతృ శ్రీమజ్జగద్గురు

భారతీ కృష్ణ తీర్థ

శంకరాచార్యస్వామి ప్రసాదిత మహామహోపాధ్యాయాద్యనేక

బిరుదాంకితుఁడైన

వేదము-వేంకటరాయశాస్త్రిచే

విరచితము.



ద్వితీయ ముద్రణము.

MADRAS,

K. V. KRISHNA PRESS.

1924



వెల రు. 10-00

# విజ్ఞప్తి

ఈ గ్రంథమును 1884 సంవత్సరమున రచించి హిందూ సభవారి ప్రాపున ముద్రింపించితిని. పెక్కు వేల ప్రతులు వెల లేకయే పండితులకుం బంచిపెట్టంబడినవి.

చిరకాలమునుండియు నిది దొరకమిం బరికించి శ్రీమత్పరమహంస పరివ్రాజకేత్యాది పావన బిరుదాంకితులు శ్రీమత్పుష్పగిరి శంకరపీఠాధిష్ఠాతలు జగద్గురువులు శ్రీమదభినవోద్దండ నృసింహభారతీ స్వాములవారు వర్ణాశ్రమధర్మసంరక్షణపరాయణులు ఏతత్పునర్ముద్రణమునకై నన్నుం బ్రోత్సహించి వలయుధనమును నాకు దయచేసినారు. వారి యాశీఃప్రభావమునను ఆ యీవివలనను దీనిని ఈ ద్వితీయముద్రణముం బొందించినాఁడను.

ధర్మదేవతకు ఉత్కృష్టమయిన యీయూఁడిగమును నాచేత నిట్లు చేయించి నన్నుఁ గృతకృత్యుం గావించిన శ్రీజగద్గురువువారియెడల నాకుం గల కృతజ్ఞతను ఇందువలన లోకమున కెల్ల విశదపఱుచుకొనుచున్నాను.

[ముద్రణము త్వరగా ముగియుటకై ఇందు సంస్కృతవాక్యములందు సయితము ఆంధ్రవర్ణక్రమమర్యాద నవలంబించినాఁడను.]

నెల్లూరు—
1924, ఆగష్టు

వేదము వేంకటరాయశాస్త్రి.

# విషయసూచిక



శ్రీ

# స్త్రీపునర్వివాహ దుర్వాద నిర్వాపణము.

---

సత్యం బ్రూయాన్మయా ద్వారా శంకరః శంకరః సతామ్ ।
సతీ రక్ష్యా త్సతీనాం చ శీలం స్వఃఫలకల్పకమ్ ॥

స్త్రీకి వివాహమే ఉపనయనము, కావున ఆవృత్తిసహము గాదు.

"స్త్రీణా ముపనయస్థానే వివాహం మను రబ్రవీత్" వ్యాఘ్రపాదః.

"స్త్రీలకు ఉపనయనమునుగా మనువు వివాహమును చెప్పెను." కనుక స్త్రీకి వివాహము ఉపనయనమగుటచే మరల సంభవింపదు. స్త్రీకి సంస్కారమును భర్తచేయును. వటువునకు తండ్రి చేయును. సంస్కర్త నశించినను సంస్కారము నశింపదు. తండ్రి పోయినను ఉపనయనఫలము పోదు. భర్త పోయినను వివాహసంస్కార ఫలముపోదు. కనుక నది మరల సంభవింపదు. ఉపనయనత్వాతిదేశము విశేషవిధులచే నబాధితమయినచోట నెల్ల ప్రవర్తించును. సంస్కారము లేకయు నుంచుకొన గూడదు.

పూ॥ సంస్కారము నశింపదు గాన అది మరల సంభవింపదు. భర్త నశించెను గాన నింకొకని నుంచుకొనగూడదా యనిన.

ఉ॥ కూడ దని మనువు చెప్పుచున్నాడు. మనుస్మృతి పంచమాధ్యాయమందు

"సర్వవర్ణానాం స్త్రీణాం ధర్మాన్నిబోధత॥" ౧౫౬.

అని సకలవర్ణములయొక్కయు స్త్రీధర్మముల నారంభించి, అందు "పత్యౌ ప్రేతే" ౧౫౭ అని విధవల నుద్దేశించి,

"ఆసీతామరణాత్క్షాంతా నియతా బ్రహ్మచారిణీ ।
యో ధర్మ ఏకపత్నీనాం కాంక్షంతీ త మనుత్తమమ్ ॥" ౧౫౮.

"మరణమువఱకును ఓర్పుగలదై నియమముకలదై బ్రహ్మచర్యము చరించుచు అనగా "మైథునస్య పరిత్యాగో బ్రహ్మచర్యం విధీయతే" అను నగ్నిపురాణప్రమాణము ప్రకారము మైథునమును మాని, ఏకపత్నులు అనగా రెండవభర్తనెఱుగనివారు, వారియొక్క సర్వోత్కృష్టమయిన ధర్మమును కోరుచు, ఉండవలసినది." అని స్పష్టముగా వ్యభిచారమును, విధవావివాహమును, నిషేధించెను. ఈ నిషేధమునకు మనువే హేతువును చెప్పుచున్నాడు.

"నద్వితీయ శ్చ సాధ్వీనాం క్వచిద్భ ర్తో పదిశ్యతే ।" ౧౬౨.

"స్త్రీల కెక్కడను శాస్త్రమందు రెండవ భర్త విధింపబడలేదు" అని. ఈవచనమునకు ప్రతిపక్షులు ఒక్కొక్కరు ఒక్కొక్క యపార్థమును కల్పించినారు.

౧. 'సాధ్వులనగా పతిలోకమును గోరెడు ఒక తెగ స్త్రీలు, వారి కీ నిషేధము గాని అందఱకును గాదు.' అని యొకరు వివరించినారు. ఇది మిగుల పొరబాటు. శాస్త్రదృష్టిచేతను పతిలోకము కోరని భార్యయే లేదు. ఏ స్త్రీయును చాతుర్వర్ణ్యమందు సంస్కారములేక యొకని భార్య కానేరదు. గాంధర్వాది వివాహములయందును సంస్కారము గలదు.

"గాంధర్వాదివివాహేషు పున ర్వైవాహికో విధిః ।
కర్తవ్య శ్చ త్రిభి ర్వర్ణై స్సమయే నాగ్నిసాక్షికః ॥"

"గాంధర్వాది వివాహములయందు మరల వివాహవిధిని అగ్నిసాక్షికముగా ద్విజులు ఆచరింపవలయును" అని దేవలస్మృతియందును,

"శూద్రో ప్యేవంవిధః కార్యో వినా మంత్రైశ్చ సంస్కృతః ।"

"మంత్రహీనముగా ఈ ప్రకారమే శూద్రుడును సంస్కరింపబడవలయును" అని మనుస్మృతియందును, చెప్పబడియున్నది. కనుక సంస్కారములేక యే స్త్రీయును భార్య గానేరదు. సంస్కార మేల యనిన, పతిలోకముకొఱకు.

"ప్రథమం సంస్థితా భార్యా పతిం ప్రేత్య ప్రతీక్షతే ।
పూర్వం మృతం చ భర్తారం పశ్చా త్సా ప్యనుగచ్ఛతి ॥
ఏతస్మా త్కారణా ద్రాజన్ పాణిగ్రహణ మిష్యతే ।
య దాప్నోతి పతి ర్భార్యా మిహలోకే పరత్ర చ ॥" భారతము.

"భార్య ముందు తాను గతించినయెడల, పతి మృతిబొందివచ్చువఱకు ఎదురు చూచుచుండును. పతి ముందుగతించిన తాను వెంటనే యేగును. ఈకారణముచేత పాణిగ్రహణము కోరబడుచున్నది. ఎందుచేతననగా ఆపాణిగ్రహణముచేత భార్యను భర్త ఇహలోకమునందును పరలోకమునందును పొందును." కనుక సకల భార్యలను పతిలోకమును కోరువారినిగానే శాస్త్రము తలచియున్నది. కనుక సాధ్వీశబ్దము సంస్కారముగల స్త్రీల నెల్ల వచించుచున్నది. దానికి సాధువయిన స్త్రీయని యర్థము. అందఱు స్త్రీలును సాధువులుగా నుండవలయునని భావముగాన ఆశబ్దము ప్రయోగింపబడినది. కనుక ఆవాక్యమునకు ద్వితీయభర్తను వరించునది యోగ్యురాలు గాదని భావము.



"నదత్త్వా కస్యచి త్కన్యాం పున ర్దద్యా ద్విచక్షణః ।
దత్త్వా పునః ప్రయచ్ఛన్హి ప్రాప్నోతి పురుషానృతమ్ ॥" మనుః.

విచక్షణునికే పురుషానృతముగాని యన్యునికి లేదనియు, విచక్షణుడు మాత్రమే కన్యను రెండుమాఱ్లీయగూడదు గాని యన్యుడీయవచ్చు ననియు, తాత్పర్యమా? ఇది బలవత్తరములయిన నిషేధ వచనములయొక్క శైలి.

"ఏత త్తు న పరే చక్రు ర్నాపరే జాతు సాధవః ।
య దన్యస్మై ప్రతిజ్ఞాయ పున రన్యస్య దీయతే ॥" మనుః.

సాధువులు రెండుమాఱ్లీయరనుటచే నన్యు లియ్యవచ్చు నని యభిప్రాయమా?

"దేవదత్తాం పతి ర్భార్యాం విదంతే నేచ్ఛయాత్మనః ।
తాం సాధ్వీం బి భృయా న్నిత్యం దేవానాంప్రియ మాచరన్ ॥" మనుః.

"దేవత లిచ్చిన భార్యను అనగా సంస్కార పూర్వకముగా భార్యను వివాహము చేసికొనవలయును. ఆసాధ్విని అనగా ఆ స్త్రీని దేవతలకు ప్రియము చేయుచు భరింపవలయును." ఇచ్చట తెగ లేమియును చెప్పబడలేదు.

"పురంధ్రీ సుచరిత్రా తు సతీ సాధ్వీ పతివ్రతా ॥" అమరః.

యోగ్యురా లయినభార్యకు సతి, సాధ్వి, పతివ్రత, అని సంజ్ఞలు. కనుక స్త్రీ విశేషమునకు మాత్ర మీ నిషేధ మను వివరణము కుత్సితము.

౨. ద్వితీయశబ్దమునకు అన్యుడు అనగా భర్తకంటె నన్యుడు అర్థమనియు, నోపదిశ్యతే అనగా పిలువబడడు అని యర్థమనియు, ఈవచనమునకు భర్తకే భర్తయని పేరుగాని భర్తగానివానికి భర్తయని పేరులేదని యర్థమనియు, మఱియొకరు వివరించినారు.

ఈ యర్థముయొక్క స్వరూపమే యిది యపార్థ మని, స్పష్ట పఱుచుచున్నది. ద్వితీయ శబ్దమునకు రెండవవా డర్థ మనియు, రెండవవాడు అనునాకాంక్షయందు రెండవభర్త యని భర్తృశబ్దము తెలుపుచున్నదనియును, స్పష్టము, ఉపదేశమనగా పేరుపెట్టుట గా దనియు నోపదిశ్యతే అనగా విధింపబడలేదు అని యర్థమనియు, సంస్కృతభాష యెఱిగిన వారికి స్పష్టము.

"న బ్రాహ్మణక్షత్రియయో రా ప ద్యపి హి తిష్ఠతోః ।
కస్మింశ్చి దపి వృత్తాంతే శూద్రా భా ర్యోపదిశ్యతే ॥" మనుః.

"బ్రాహ్మణ క్షత్త్రియులకు ఆపదయందైనను శూద్రస్త్రీ భార్యగా విధింపబడలేదు" శూద్రస్త్రీకి భార్య యని పేరు లేదు అని యర్థము కాదు.

"శూద్రస్య తు సవర్ణైవ నాన్యాభార్యోపదిశ్యతే ॥" మనుః.

"శూద్రునికి శూద్రస్త్రీయే గాని అన్యభార్య విధింపబడలేదు."

"పాణిగ్రహణసంస్కారః సవర్ణాసూపదిశ్యతే ॥" మనువు.

"పాణిగ్రహణ సంస్కారము సజాతిస్త్రీలకు విధింపబడుచున్నది."

"తత్రేష్టప్రాపకో ధర్మః ఆచార్యైరుపదిశ్యతే ।
అధర్మశ్చానిష్టఫలః ఆచార్యైర్నోపదిశ్యతే ॥" మత్స్యపురాణము.

"ఇష్టఫలమయిన ధర్మము ఆచార్యులచేత విధింపబడునుగాని అనిష్టఫలమయిన యాధర్మము ఆచార్యులచేత విధింపబడదు."

ఇందువల్లన "నోపదిశ్యతే" అనగా విధింపబడలేదు అనియర్థమనియు, నద్వితీయశ్చయను వచనమునకు స్త్రీలకు శాస్త్రమందెచ్చటను ద్వితీయభర్త విధింపబడలేదని యర్థమనియు, స్పష్టము. మనుస్మృతికి పైది వేదమే గావున వేదమున ఎక్కడను సాధ్వులకు ద్వితీయభర్త విధింపబడలేదనియు, కనుక ఏకపత్నీత్వమే కూడునుగాని అనేకపత్నీత్వము స్త్రీలకు కూడదనియు, స్పష్టము.

పునర్వివాహ నిషేధములు సామాన్యములు, అవి విధవలకు చెల్లవు అనుట పొరబాటు. ఏలన ఈ నిషేధములు విధవల నుద్దేశించియే పుట్టినవి గదా.

ఆపద్ధర్మముగా నయితము ఈవివాహము నిషిద్ధము. ఎట్లన, మనుస్మృతి నవమాధ్యాయములో "యోషితాంధర్మమాపది" ౫౬ మొదలుకొని "ఆపద్యపత్యప్రాప్తిశ్చ" ౧౦౩ వఱకును చెప్పబడిన స్త్రీలయొక్క యాపద్ధర్మములలో నియోగము విధింపబడి వివాహము నిషేధింపబడినది. మనువు ఆపద్ధర్మములను, "అతఃపరం ప్రవక్ష్యామి యోషితాం ధర్మమాపది" "ఇకను ఆపదయందు స్త్రీలయొక్క ధర్మములను చెప్పుచున్నాను" అని యారంభించి,

"జ్యేష్ఠో యవీయసో భార్యాం యవీయా న్వాగ్రజస్త్రియం ।
పతితౌ భవతో గత్వా నియుక్తావప్యనాపది ॥" ౫౮.

"తమ్మునిభార్యను అన్నయు అన్నభార్యను తమ్ముడును ఆపదలేని యప్పుడు నియుక్తులయినను, సంగమించిన, పతితులగుదురు" అని యనాపదయందు నియోగమును నిషేధించెను. అపత్యార్థాపమెట్టిదోయను నాకాంక్షయందు,



"దేవరాద్వా సపిండాద్వా స్త్రియా సమ్యఙ్నియుక్తయా ।
ప్రజేప్సితాధిగంతవ్యా సంతానస్య పరిక్షయే ॥" ౫౯.

"దేవరునివలనగాని, సపిండునివలనగాని, యథావిధిగా నియోగింపబడినస్త్రీ, సంతాన పరిక్షయకాలమందు, ఇష్టమయిన సంతానమును పొందవచ్చును." అని ఆపద సంతానపరిక్షయమనియు, ఆపద్ధర్మము నియోగమనియు తెలియజేసెను. అటుపయిన,

"విధవాయాం నియుక్తస్తు ఘృతాక్తో వాగ్యతో నిశి ।
ఏకముత్పాదయేత్పుత్త్రం నద్వితీయం కథంచన ॥" ౬౦.

"నియుక్తౌ యౌ విధిం హిత్వా వర్తేయాతాం తు కామతః ।
తావుభౌ పతితౌ స్యాతాం స్నుషాగగురుతల్పగౌ ॥" ౬౩.

"విధవయందు నియోగింపబడినవాడు, నేయి (దేహమంతటను) పూసికొని, రాత్రియందు ఒక పుత్త్రుని పుట్టింపవలయును; రెండవవానిని కూడదు. నియుక్తులైన యన్నదమ్ములు విధి నతిక్రమించి, కామముతో ప్రవర్తించిన, పతితులగుదురు. వారికి స్నుషాగమన గురుభార్యాగమనపాతకములు కలుగును" అని నియోగవిధానమును చెప్పెను. అటుపైని,

"నాన్యస్మిన్ విధవానారీ నియోక్తవ్యా ద్విజాతిభిః ।
అన్యస్మిన్ హి నియుంజానా ధర్మం హన్యుస్సనాతనం ॥" ౬౪.

"విధవను అన్యునియందు నియోగించుట ద్విజులకు ధర్మముగాదు" అని నియోగమును నిషేధించి, "అన్యునియందు నియోగించువారు శాశ్వతమయిన ధర్మమును నాశముచేయుదురు," అని నియోగమువలన నశించునదియు, తదభావమున నుండునదియు అగు, ఏకపత్నీత్వమును నాశము చేయగూడదని చెప్పెను. ఆ యేకపత్నీత్వము నియోగవివాహములు రెండింటిచేతను నశించును గావున—

"నోద్వాహికేషు మంత్రేషు నియోగః కీర్త్యతే క్వచిత్ ।
న వివాహవిధావుక్తం విధవావేదనం పునః ॥" ౬౫.

"వివాహమంత్రములయందెచ్చటను నియోగము చెప్పబడలేదు." అని నియోగమును, "వివాహవిధియందు విధవకు పునర్వివాహము చెప్పబడలేదు" అని వివాహమును నిషేధించెను.

ఈ వచనమునకు ప్రతిపక్షులు అపార్థములు కల్పించినారు.

౧. నియోగమున వివాహము ప్రకరణవిరుద్ధ మట.

విధవలనుగూర్చి రెండును చెప్పదగినవిగాన, నియోగప్రస్తావమందు వివాహమును, వివాహప్రస్తావమందు నియోగమును, మిగుల ప్రసక్తములని యెఱుగవలయును. వివాహోత్కంఠ చూపబడియే యున్నది. మనువే, వివాహమంత్రములలో నియోగము చెప్పబడలేదనుటచే, నియోగవివాహములు అన్యోన్య నుప్రసక్తము లని స్పష్టపఱచియున్నాడు.

## వేదనశబ్దమున కర్థము.

౨. వేదన శబ్దమునకు నియోగ మర్థ మటు.

ఇది తప్పు; ఈ శబ్దమునకుగాని దీని ధాతువునకుగాని నియోగపరమయిన ప్రయోగ మెచ్చటను లేదు.

మఱియు, పూర్వార్థమున నియోగములేదని చెప్పి ఉత్తరార్థమున మరల చెప్పవలయునా ?

మఱియు పునశ్శబ్ద మున్నది. ఒక నియోగముమాత్రము మంత్రములయందు చెప్పబడియున్నదా?

3. వేదనశబ్దమునకు 'విద్ లాభే' ధాతు వనియు, లాభ మర్థమనియు, నియోగమును వివాహమునుగాని గ్రహణము భావమనియు, మఱికొందఱు వచించుచున్నారు. నియోగమును వివాహమునుగాని గ్రహణము విధవముండనుంచుకొనుటగాక మఱియే మున్నది. పూర్వపక్షులకు నియోగమున, వివాహ మప్రసక్తమును, ఉంచుకొనుట సుప్రసక్తమును ఐయున్నది. విద్ ధాతువునకు లాభమర్థము. లభధాతువు స్వామ్యమునకు అర్హమగు దానియందు స్వామ్యమును తెలియజేయును. ఎట్లనిన, రామయ్యకు నిన్న వస్త్రలాభము, ఈదినమున గోలాభము అను వాక్యమునకు రామయ్యయింట ఎవడో నిన్న రవంతసేపు దోవతి యారవైచికొని పోయెననియు, ఈ దినమున ఎవడో ఆవును రవంతసేపు కట్టివైచి కొనెననియు, అర్థముగాదు. మఱి యేమనిన వస్త్రస్వామ్యమును గోస్వామ్యమును రామయ్యకు కలిగెనని యర్థము. స్త్రీయందు పురుషునికి వివాహముచే స్వామ్యము కలుగును. కనుక విద్ ధాతువు వివాహమును తెలియజేయును. నియోగమున స్వామ్యములేదు. కనుక విద్ ధాతువు నియోగమును తెలియజేయదు. కనుక వేదనశబ్దమునకు వివాహమర్థముగాక తప్పదు. ఆశబ్దమునకు వివాహమనియే వైద్యనాథ దీక్షితులవారును, కుల్లూకభట్టాచార్యులవారును అర్థము వ్రాసియున్నారు.

మఱియు ఈధాతువు వివాహమందు రూఢము.

"విన్నా స్వేవవిధిః స్మృతః" "ఊఢలకిదివిధి" అని యాజ్ఞవల్క్యులవారును,



"వ్యభిచారా త్తు వర్ణానా మవేద్యావేదనేన చ ।
స్వకర్మణాంచ త్యాగేన జాయంతే వర్ణసంకరాః ॥"

"వర్ణములయొక్క వ్యభిచారముచేతను, అవివాహ్యలను వివాహము చేసికొనుటచేతను, తమతమ కర్మలను త్యజించుటచేతను, వర్ణసంకరులు పుట్టుచున్నారు." అని మనువును, ప్రయోగించి యుండుటచే, ఈ ధాతువు వివాహవాచకమని స్పష్టము. దీనిని ఉపసర్గల మహిమచే నానావిధ వివాహములకు మహర్షులు ప్రయోగించియున్నారు.

మను నవమాధ్యాయముననే,

"వ్యాధితా వాధివేత్తవ్యా హింస్రార్థఘ్నీ చ సర్వదా" ॥ ౮౦.

" భార్య సర్వదా, వ్యాధిగలదియు, హింసించునదియు, అర్థనాశినియు, అయిన, (భర్త) పైగా నింకొకదానిని పెండ్లిచేసికొనవలయును."

" వంధ్యాష్టమేధి వేద్యాబ్దే ॥" ౮౧.

"(భార్య) గొడ్రాలైన, (భర్త) ఎనిమిదవయేట పైగా నింకొక దానిని పెండ్లిచేసికొనవలయును."

" సానుజ్ఞా ప్యాధివేత్తవ్యా ॥" ౮౨.

" ఆమెయొక్క సెలవును పొంది పైగా నింకొకదానిని వివాహము చేసికొనవలయును."

" అధివిన్నా తు యా నారీ ॥" ౮౩.

" ఎవతెకంటె పైగా నింకొకదానిని (భర్త) వివాహము చేసికొనునో" అనియు, మనువుయొక్క ప్రయోగములు.

" కృతసాపత్నికాధ్యూఢాధివిన్నా" అమరము. "కృతసాపత్నికా" అనగా గ్రహింపబడిన సవతిగలది. అనగా ఎవతెయుండగా దానిభర్త ఇంకొకదానిని వివాహమాడునో అది, "అధ్యూఢా," అధ్యూఢ యనియు, "అధివిన్నా," అధివిన్న యనియు చెప్పబడును.

అధ్యూఢ, అధివిన్న అనునవి పర్యాయపదములు, అధి అనునుపసర్గ రెండింటియందును కలదు. కనుక మిగిలిన ఊఢ మిగిలిన విన్నకు సమానమని చెప్పవలయునా. ఊఢయనగా వివాహితయని ఎల్లవారికిని విశదము. కనుక విన్నయనగా వివాహితయనియు విద్ ధాతువు వివాహవాచకమనియు ఇంతకన్న నెట్లు విశదపఱుపవచ్చును.

"పరివేత్తానుజోऽనూఢే జ్యేష్ఠే దారపరిగ్రహీ ।
పరివిత్తిస్తు తజ్జ్యాయాన్ ॥" అమరః.

"అన్నకంటె ముందువివాహ మయినతమ్ముడు పరివేత్త, ఆయన్న పరివిత్తి."

"పరివిత్తిః పరివేత్తా చ యయా చ పరివిద్యతే ।
సర్వే తే నరకం యాంతి దాతృయాజకపంచమాః ॥" పరాశరః.

"పరివివిదానః కృచ్ఛ్రాతికృచ్ఛ్రౌ చరిత్వా ।" వసిష్ఠః.

"పరివేత్తకు కృచ్ఛ్రాతికృచ్ఛ్రములు ప్రాయశ్చిత్తము." ఈవివాహము పరివేదనము. ఇట్లే పరివేదిని. ఇట్లు నిరుపపదమయినను ఈధాతువు వివాహమును చెప్పుచుండగా పురుషకర్తృకమును స్త్రీకర్మకమును స్త్రీకర్తృకమును పురుషకర్మకమును అయినప్పుడు వివాహమే యర్థమగుటకు ఏమి యాక్షేపము ?"

"శరః క్షత్రియయా గ్రాహ్యః ప్రతోదో వైశ్యకన్యయా ।
వసనస్య దశా గ్రాహ్యా శూద్రయోత్కృష్టవేదనే ॥" మనువు.

"అధికవర్ణుని వివాహమాడునపుడు క్షత్రియస్త్రీ బాణమును, వైశ్యస్త్రీ అంకుశమును, శూద్రస్త్రీ వస్త్రముయొక్క చేరును, పట్టుకొనవలయును."

"యది స్వాశ్చ పరాశ్చైవ విందేరన్ యోషితో ద్విజాః ।
తాసాం వర్ణక్రమేణ స్యాజ్జ్యైష్ఠ్యం పూజా చ వేశ్మ చ ॥" మనుః.

"స్వజాతి స్త్రీలను అన్యజాతి స్త్రీలను ద్విజులు వివాహము చేసికొనిన, వారి వర్ణక్రమమున వారికి మర్యాదయు సత్కారమును గృహకార్యమును జరుగవలయును." భార్యాపతిశబ్దములతో ఈధాతువుయొక్క ప్రయోగము లనేకములు.

౧. యా వా క్లీబం పతితమున్మత్తం వా పతిముత్సృజ్య ।
అన్యం పతిం విందతే మృతే వా సా పునర్భూర్భవతి॥ వసిష్ఠః.

౨. రక్షేత్కన్యాం పితా విన్నాం పతిః పుత్రాస్తు వార్ధకే । ల్క్యః.
అభావే జ్ఞాతయస్తేషాం నస్వాతంత్ర్యం క్వచిత్స్త్రియాః॥ యాజ్ఞవ

౩. తత్ర ద్రౌపదీం భార్యాం అవిన్దన్॥ భారతః.

౪. తస్మాదేకో ద్వే జాయే విందతే ।
తస్మాన్నైకా ద్వౌ పతీ విందతే॥ వేదః.



౫. "యజ్జాయాయాం న విందతే నైతావత్ప్రజాయతే । అథ యదైవ జాయాం విందతేథ ప్రజాయతే ॥" వాజసనేయబ్రాహ్మణమ్.

ఇట్లు శాస్త్రములెల్ల వివాహపరముగానే, ఈ ధాతువునే, విశేషించి వేదనశబ్దమునే ప్రయోగించుచుండగా దీనికి వివాహ మర్థము కాదనుటకన్న దుర్వాదమేమున్నది! ఇందువలన "న వివాహవిధా వుక్తం విధవావేదనం పునః" అను వచనముచేత మనువు విధవావివాహమును నిషేధించె ననుట స్పష్టము. ఇట్లే కుల్లూకభట్టాచార్యులవారును వివరించి యున్నారు. అటుపైని—

విధవావివాహము పశుధర్మ మని మనువు.

"అయం ద్విజైర్హి విద్వద్భిః పశుధర్మో విగర్హితః ।
మనుష్యాణామపి ప్రోక్తో వేనే రాజ్యం ప్రశాసతి ॥" ౬౬.

"విద్వాంసులైన ద్విజులచేతను, ఈ పశుధర్మము నిందింపబడినది, వేనుని ప్రభుత్వములో మనుష్యులకు కూడ విధింపబడినది."

"స మహీమఖిలాం భుంజన్ రాజర్షిప్రవరః పురా ।
వర్ణానాం సంకరం చక్రే కామోపహతచేతనః॥" ౬౭.

"ఆతడు సకలభూమండలమును ఏలుచు, రాజర్షిశ్రేష్ఠుడై, కామ పరతంత్రుడై పూర్వము వర్ణసంకరము చేసెను."

"తతః ప్రభృతి యో మోహాత్ప్రమీతపతికాం స్త్రియం ।
నియోజయత్యపత్యార్థం తం విగర్హంతి సాధవః ॥" ౬౮.

"అది మొదలుకొని విధవను సంతానముకొఱకు, అజ్ఞానముచే, నియోగించువానిని పెద్దలు నిందింతురు."

ఇచ్చట 'అది మొదలుకొని నిందింతు' రనుటచే, అంతవఱకు నియోగముండెనని స్పష్టము. ఈ ధర్మము వేనుని రాజ్యమందు మనుష్యులకుగూడ చెప్పబడెననుటచే, అంతవఱకు లేనిధర్మము చెప్పబడె నని స్పష్టము. అంతవఱకు నియోగముండెనుగాన, వేనుడు కల్పించినధర్మము విధవావివాహ మని స్పష్టము. దానినే గదా పెద్దలు పశుధర్మ మనిరి. అదియే గదా వర్ణసంకరము.

ప్రక్షిప్తవాదము.

ఈ శ్లోకములపై పూర్వపక్షుల కల్పనలు.—

౧. మనువును వేనుడును భిన్నకాలికులు, మనువు వేనుని ప్రస్తావించుట సంభవింపదు. కనుక నివి భృగువచనములు.

౨. భృగువును మనువును సమకాలికులు. భృగువచనము లగుటయును సంభవింపదు. కనుక నివి ప్రక్షిప్తములు.

3. నియోగ విధినిషేధము లిచ్చట నున్నవి. స్వవచన వ్యాఘాతము కలుగును గాన ఇవి మనువచనములే గావు. కనుక విధులు మనువువి. నిషేధములు భృగువువి.

ప్రతిపక్షు లిట్లు కల్పించినను భృగువే వేనుని రాజ్యాభిషిక్తుని చేసె నని భాగవతము చెప్పుచున్నది.

" భృగ్వాదయస్తు మునయో లోకానాం క్షేమదర్శినః ।
గోప్తర్యసతి వై నౄణాం పశ్యంతః పశుసామ్యతాం ॥
వీరమాతరమాహూయ సునీథాం బ్రహ్మవాదినః ।
ప్రకృత్యసమ్మతం వేన మభ్యషించన్ పతిం భువః ॥"

కనుక ఈ కుకల్పనలు ఇక్కడ పనికిరావు. ఇందువలన వేనుని యితిహాసము ప్రక్షిప్తము గాదని విశదము. మఱియు,

" ఏతస్మిన్నంతరే విప్రా భృగ్వాద్యాః కృష్ణ మీశ్వరం ।
ఆజగ్ము ర్ద్వారకాం ద్రష్టుం కృతకార్యం సనాతనమ్ ॥" కౌర్మము.

"ఇంతలో భృగ్వాది మహర్షులు భగవంతుడైన కృష్ణుని దర్శనము చేయుటకు ద్వారకాపురమునకు వచ్చిరి."

కృతయుగాదిని భృగువు. ద్వాపరాంతమున శ్రీకృష్ణులవారు. ఇచ్చట కాలభేదమువలని విరోధము పనికి వచ్చునా? మఱియు,

" శిషేర్ధాతోశ్చ నిష్ఠాంతాత్ శిష్టశబ్దః ప్రచక్ష్యతే ।
మన్వంతరేషు యే శిష్టా ఇహ తిష్ఠంతి ధార్మికాః ॥
మనుః సప్తర్షయ శ్చైవ లోకసన్తానకారిణః ।
తిష్ఠన్తీహ చ ధర్మార్థం తాన్ శిష్టాన్ సంప్రచక్షతే ॥" మాత్స్యము.

" 'శిషి' యను ధాతువునకు 'క్త' ప్రత్యయమును చేర్పగా శిష్టశబ్దము పుట్టినది. మన్వంతరమునుండి శేషించి యీ మన్వంతరమున ధర్మార్థము ఎవరున్నారో ఆ మనువును సప్తర్షులును 'శిష్టు' లనబడుదురు." కనుక వారికి కాలక్రమము చెప్పగూడదు. మఱియు గురుపరంపరయందు —

"నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తిం చ తత్పుత్ర పరాశరం చ",

అని యుండుటచే వసిష్ఠులవారు కృతయుగమున బుట్టిరి, వారి మనుమలైన పరాశరులవారు కలియుగమున నుండిరి. అట్టివారికి కాలభేదములు తెల్ప సాహసింపగూడదు. మఱియు,



## నియోగానుజ్ఞ.

" ఉక్తో నియోగో మనునా నిషిద్ధ స్స్వయమేవ తు ॥"

అని, మనువు స్వయముగానే నియోగమును విధించి స్వయముగానే నిషేధించెనని బృహస్పతి చెప్పుచున్నాడు. కనుక నిచ్చటి శ్లోకములు ప్రక్షిప్తములు కావు. అటుపైని,—

" యస్యా మ్రియేత కన్యాయాః వాచా సత్యే కృతే పతిః ।
తా మనేన విధానేన నిజో విందేత దేవరః ॥" ౬౯.

"వాగ్దానముమాత్ర మయినపిమ్మట పతిమృతిబొందిన, దేవరుడు దానిని వివాహము చేసికొనవలయును." 'విందేత' యనుటచే వివాహసంస్కారము చేయవలయు నని స్పష్టము. అసంస్కృతా పుత్త్రుడు సంకరుడుగాన, కన్యానియోగము కూడదుగాన, వివాహసంస్కారము విధింపబడినది. అటుపైన,

" యథావిధ్యధిగమ్యైనాం శుక్లవస్త్రాం శుచివ్రతాం ।
మిథో భజే తాప్రసవా త్సకృత్సకృ దృతావృతౌ ॥" ౭౦.

"ఆదేవరుడామెను యథావిధిగా వివాహము చేసికొని ప్రతిఋతువున కొకమారు, శుక్లవస్త్రయు, శుచివ్రతయు నగుదానిని, సంతానము కలుగువఱకును రహస్యముగా సంగమింపవలయును" అని నియోగము చెప్పబడినది. ఇట్లే ఇది నియోగాంగమగు వివాహ మని కుల్లూకభట్టాచార్యులవారును, విజ్ఞానేశ్వర యతీశ్వరులవారును, వివరించియున్నారు. నియోగమే గాని పునర్వివాహము కూడదా యను నాకాంక్షయందు,—

" న దత్త్వా కస్యచి త్కన్యాం పున ర్దద్యా ద్విచక్షణః ।
దత్త్వా పునః ప్రయచ్ఛ న్హి ప్రాప్నోతి పురుషానృతమ్ ॥" ౭౧.

"విచక్షణుడగువాడు కన్య నొకని కిచ్చి మరల నింకొకని కీయడు. అట్లు మరల నిచ్చినవాడు పురుషానృతమను పాతకమును బొందును." పుచ్చుకొనినవాడు,

" విధివత్ప్రతి గృహ్యాపి త్యజే త్కన్యాం విగర్హితాం ।
వ్యాధితాం విప్రదుష్టాం వా ఛద్మనా చోపపాదితామ్ ॥ ౭౨.
యస్తు దోషవతీం కన్యా మనాఖ్యాయ ప్రయచ్ఛతి ।
తస్య త ద్వితథం కుర్యా త్కన్యాదాతు ర్దురాత్మనః ॥" ౭౩.

"యథావిధిగా గ్రహించినను దోషవతియైన కన్యను విడిచిపెట్టవచ్చును". ప్రకరణముచే విధవాత్వము దోష మని స్పష్టపడి యున్నది.

"కన్యైవాక్షతయోని ర్యా పాణిగ్రహణదూషితా ।
పునర్భూః ప్రథమా ప్రోక్తా పునస్సంస్కార కర్మణా॥"

అని పాణిగ్రహణ దూషితా యను పదముచేత ప్రథమ వివాహము ద్వితీయవివాహమునకు దోష మని నారదులవారు తెలియజేసియున్నారు.

"అజ్ఞానేన ద్విజో యస్తు విధవా ముద్వహే ద్యది ।
పరిత్యజ్య చ తాం కన్యాం ప్రాయశ్చిత్తం సమాచరేత్॥"

"ఎఱుగక ద్విజుడు విధవను వివాహము చేసికొనిన, ఆ కన్యను పరిత్యాగముచేసి ప్రాయశ్చిత్తము చేసికొనవలయును." అని యాశ్వలాయనులవారు విధించినారు. ఇంతకన్న నెట్లు విధవావివాహమును నిషేధింపవచ్చును.

ప్రతిపక్షుల కల్పన.

పునర్దాననిషేధము అనాపద్విషయ మట. ఇది "అతఃపరం ప్రవక్ష్యామి యోషితాం ధర్మ మాపది" అను ప్రతిజ్ఞకును, "ఆప ద్యపత్యప్రాప్తి శ్చ" అనునుపసంహారమునకును విరుద్ధము. ఇట్లే,

"కన్యాయాం దత్తశుల్కాయాం మ్రియేత యది శుల్కదః ।
దేవరాయ ప్రదాతవ్యా యది కన్యానుమన్యతే॥" ౯౭.

"శుల్క మిచ్చినవరుడు చచ్చినయెడల కన్య సమ్మతించెనేని దేవరునికీయవలయును," అంతియకాని,

"ఏతత్తు న పరే చక్రు ర్నాపరే జాతు సాధవః ।
య దన్యస్మై ప్రతిజ్ఞాయ పున రన్యస్య దీయతే॥" ౯౯.

"ఈ కార్యము నింతకుపూర్వ మెవ్వరును చేయలేదు. ఇకమీద నెవ్వరును చేయగూడదు, ఏదనగా ఒకనికి వాగ్దానముచేసి మరల నింకొకని కిచ్చుట." అని శుల్కవివాహమందును దేవరునికన్న నన్యుని కీయగూడ దని నిషేధించెను.

"విధాయ వృత్తిం భార్యాయాః ప్రవసే త్కార్యవా న్నరః ।...
ప్రోషితే త్వవిధాయైవ జీవేచ్ఛిల్పై ర్గర్హితైః॥" ౭౪, ౭౫.

"దేశాంతరము పోవువాడు భార్యకు జీవన మేర్పఱచి పోవలయును. అట్లు ఏర్పఱుపక పోయిన, ఆ భార్య అనింద్యములయిన శిల్పములచేత జీవింపవలయును."



"ప్రోషితో ధర్మకార్యార్థం ప్రతీక్ష్యోష్టౌ నర స్సమాః ।
విద్యార్థం షడ్యశోర్థం వా కామార్థం త్రీంస్తు వత్సరాన్॥"

"దేశాంతరము ధర్మకార్యముకొఱకు పోయినవానిని ఎనిమిదేండ్లును, విద్యకొఱకయినను యశస్సుకొఱకయినను ఆఱేండ్లును, కామముకొఱకు మూడేండ్లును ఎదురుచూడవలయును." తరువాత ఏమి చేయవలయునో మనువు చెప్పలేదు.

పునర్వివాహము చేసికొనవలయునని మనువుయొక్క భావమట. ఇంతవఱకు నిషేధించినదెల్ల పునర్వివాహమేకదా. విధవలకు నిషేధమును, ప్రోషితభర్తృకలకు పునర్వివాహమును అనుటకు ప్రోషితభర్తృకల మహిమయేమో తెలియదు. మరణ ముపలక్షణముగా సకలాపదలయందును వివాహము నిషేధింపబడినది. అట్లే మరణ ముపలక్షణముగా సకలాపదలయందును నియోగము విధింపబడినది. కనుకనే క్షేత్రజలక్షణమునందు మనువు,

"య స్తల్పజః ప్రమీతస్య క్లీబస్య వ్యాధితస్య వా ।
స్వధర్మేణ నియుక్తాయాం స పుత్రః క్షేత్రజః స్మృతః॥"

"మృతుడు, నపుంసకుడు, రోగి మొదలగు వారిభార్యలయందు స్వధర్మము ప్రకారము నియోగమువలన బుట్టినవాడు క్షేత్రజుడు అనబడును." అని యితరాపదలనుకూడ చెప్పెను. మరణము ఉపలక్షణముగావుననే క్లీబత్వాద్యాపదలయందు నియోగమునకు అనుజ్ఞ యీ యాపద్ధర్మ ప్రకరణమందు ప్రత్యేకముగా చెప్పబడలేదు. మరణ ముపలక్షణ మగుటచే, మరణమందలి నియోగవిధియే దేశాంతరగమనమందును విధి గావున, నిరీక్షణకాలముమాత్ర మిచ్చట విధింపబడినది. సకల స్త్రీలకును నిషిద్ధమును, వాగ్దత్తకుగూడ నిషిద్ధమును, శుల్కదత్తకుకూడ నిషిద్ధమును, అగువివాహము ప్రోషితభర్తృకకుమాత్రము ధర్మమని యెట్లు చెప్పవచ్చును. ఇతర మహర్షులును నష్టునిభార్యకు నియోగమును నిరీక్షణకాలమును చెప్పియున్నారు. వసిష్ఠులవారు "ప్రోషితపత్నీ పంచవర్షా ణ్యుపాసీత", "ప్రోషితభర్తృక అయిదు సంవత్సరములు నిరీక్షింపవలయును." అనియు, అటుపిమ్మట ఏమిచేయవలయుననగా "ఊర్ధ్వం పతి సకాశం గచ్ఛేత్", "పిమ్మట భర్తయొద్దకు పోవలయును" అనియు చెప్పియున్నారు. "భర్తయొద్దకు పొమ్మని చెప్పవలయునా?" అని కొందఱు బుద్ధిమంతులు ఆక్షేపించుచున్నారు. "న స్వాతంత్ర్యం క్వచిత్స్త్రియాః," "స్త్రీకి ఎన్నడును స్వాతంత్ర్యము లేదు," అనుటచే చెప్పక తప్పదని యెఱుగవలయును. అటుపైన,

"యద్యకామా యథా ప్రేతస్య చైవం వర్తితవ్యం స్యాత్ ।
ఏవం పంచ బ్రాహ్మణీ ప్రజాతా, చత్వారి రాజన్యా ప్రజాతా,
త్రీణి వైశ్యా ప్రజాతా, ద్వే శూద్రా ప్రజాతా, అతఊర్ధ్వం సమానో
దక పిండజన్మ ఋషిగోత్రాణాం పూర్వః పూర్వో౽గరీయాన్॥" వసిష్ఠః.

"నిష్కామురాలైన భర్తచచ్చిన నెట్లుండునో అట్లు ఈప్రకార ముండవలయును. ఈప్రకారము ప్రసూతయగు బ్రాహ్మణస్త్రీ అయిదేండ్లు, ప్రసూతియగు క్షత్త్రియస్త్రీ నాలుగేండ్లు, ప్రసూతయగు వైశ్యస్త్రీ మూడేండ్లు, ప్రసూతయగు శూద్రస్త్రీ రెండుసంవత్సరములు, నిరీక్షింపవలయును. అటుపిమ్మట సమానోదక, సపిండ, సమానజన్మ, సమానర్షి, సమాన గోత్రులలో పూర్వపూర్వులు మేలు" అని చెప్పియున్నారు. "అకామ విధవవలె నుండవలయు"ననుటచే, విధవకు పునర్వివాహము లేదనియు, సకామసధవవలె నుండవలయుననియును స్పష్టము. విధవకు పునర్వివాహ నిషేధమును సధవకు తద్విధానమును అసంగతము. పునర్వివాహ మున్నయెడల అకామ సధవవలెను, సకామ విధవవలెను ఉండవలయుననియే వసిష్ఠులవారు చెప్పుదురు. 'అకామ విధవవలె ఈచెప్పబోవు ప్రకారము ఉండవలయును' అని, 'ఏవం'శబ్దమును ప్రయోగించుటచే తరువాత చెప్పబడిన సమానోదకాదికము నియోగముకొఱకే యని స్పష్టముగా తెలియుచున్నది. విధవకు నియోగమును వసిష్ఠులవారే విధించియున్నారు. ఎట్లన—

"క్లీబోన్మత్తానాం ప్రేతపత్నీ షణ్మాసం వ్రతచారిణీ అక్షారలవణం భుంజానా శయీత; ఊర్ధ్వం షడ్భ్యో మాసేభ్యః స్నాత్వా శ్రాద్ధం చ పత్యేదత్త్వా, విద్యాకర్మగురుయోని సంబంధాన్ సన్నిపాత్య పితా భ్రాతా వా నియోగం కారయేత్; తపసే వోన్మత్తా మవశాం వ్యాధితాం వా నియుంజ్యాత్; జ్యాయసీమపి షోడశవర్షాం నచే దామయావినీ స్యాత్, ప్రాజాపత్యే ముహూర్తే పాణిగ్రహణవ దుపచారః, అన్యత్ర సంస్థాప్య వాక్పారుష్యాత్ దండపారుష్యాత్ చ గ్రాసాచ్ఛాదనస్నానలేపనేషు ప్రాగ్గామినీ స్యాత్, అనియుక్తాయా ముత్పన్నః ఉత్పాదయితుః పుత్త్రో భవతీ త్యాహుః, స్యాచ్చేన్నియోగినః; దృష్టో లోభా న్నాస్తి నియోగః; ప్రాయశ్చిత్తం వాప్యుపనియుంజ్యాదిత్యేకే॥" వసిష్ఠః.

"క్లీబుడు, ఉన్మత్తుడు, మృతుడు, వీరలభార్య ఆఱుమాసములు వ్రతము చరించుచు, ఉప్పుకారములేకుండ భుజించుచు ఉండవలయును. ఆఱుమాసములపైని స్నానముచేసి, భర్తకు శ్రాద్ధముపెట్టి, విద్యాకర్మ గురుయోనిసంబంధులను పిలిపించి, తండ్రిగాని భ్రాతగాని నియోగము చేయింపవలయును.



తపస్సుచేత నెట్లో అట్లే, ఉన్మత్తను, అవశను, వ్యాధిగలదానిని నియోగింపవచ్చునొండె, దీర్ఘరోగము కలదికానియెడల వయస్సున పదియాఱేండ్లు పెద్దదియైనను, ప్రాజాపత్య ముహూర్తమున భర్తయందుంబోలె నుపచారము; అన్యథా, వాక్పారుష్య దండపారుష్యములవలన నిలిపి భోజనవస్త్రధారణస్నానచందన చర్చలయందు ముందుపోవునది కావలయును. నియోగము లేని దానియందు పుట్టినవాడు ఉత్పాదకునికి జెందును అని చెప్పుదురు. ఉండిన నియోగికి చెప్పబడినాడు. లోభమువలన నియోగములేదు. ప్రాయశ్చిత్తమైనను చేయవలయు నని కొందఱు చెప్పుదురు." ఇచ్చట ప్రతివాక్యమునను, నియోగము, నియోగము, నియోగ మని శ్రవణతాడన మగుచున్నను ఇది పునర్వివాహవిధియని ప్రతిపక్షులు వ్రాసినారు. ఇట్లు విధవకుంబోలె అకామయగు నష్టపత్నికి నియోగమును విధించినా రని స్పష్టముగా తెలియుచున్నది. కనుక సమానోదకపిండాదికము నియోగముకొఱకని స్పష్టము. "యద్యకామా" యనుటచే అకామకే నియోగముగాన, సకామకు నియోగ వివాహములు లేవు. కనుక భర్తయొద్దకు పోవలయునని విధి; "ఊర్ధ్వం పతిసకాశం గచ్ఛేత్" ను మాట లేకపోయినను, అర్థలబ్ధమగుచున్నది. కనుకనే "ఊర్ధ్వం భర్త్రంతర గమనే నదోషః" అను స్వమనీషాకల్పిత శ్రీనందనకు వ్యాఖ్యానమును నిరసించి, అనంతరము భర్తయొద్దకు పోవలయునని కుల్లూకభట్టాచార్యులవారు వివరించినారు. అథవా,

"భర్తుః పుత్త్రం విజానంతి శ్రుతిద్వైధం తు భర్తరి ।
ఆహు రుత్పాదకం కేచి దపరే క్షేత్రిణం విదుః॥" మనుః.

"పుత్త్రుడు భర్తకు జెందు నని చెప్పుదురు, భర్తనుగూర్చి వేదము రెండు విధములుగా నున్నది. కొందఱు ఉత్పాదకుడు భర్త యందురు. ఇతరులు క్షేత్రవంతుడు అనగా వివాహము చేసికొనిన వాడు భర్త యందురు." అను మనువచనమును బట్టియు,

"ధర్మ్య ఏకః పతిః స్త్రీణాం కౌమార ఇతి కౌశికః ।
ఆపత్సు చ నియోగేన సంతానార్థే౽పరః స్మృతః॥"

"ప్రథమభర్త స్త్రీలకు ధర్మ్యుడు. ఆపదయందు నియోగముచే సంతానముకొఱకు రెండవవాడు ధర్మ్యుడు." అను భారత ప్రమాణమును బట్టియు, నియుక్తునియందు, భర్త, పతి యను వ్యవహారము ధర్మశాస్త్రమున కలదు గావున భర్త్రంతరశబ్దముచేత నియోగభర్తనే శ్రీనందనుడును తెలియజేసి యుండవచ్చును. లేదా, లేఖకాదిప్రమాదముచేత, 'అంతిక' శబ్దము 'అంతర' రూపమునేని దాల్చియుండవచ్చును. మనువును, ఈ యాపద్ధర్మములయొక్కయుపసంహారమందు,

"ఏషస్త్రీ పుంసయో రుక్తో ధర్మో వో రతిసంహితః ।
ఆప ద్యపత్య ప్రాప్తిశ్చ దాయభాగం నిబోధత ॥"

"ఇదిగో ప్రీతిపూర్వకమయిన స్త్రీపురుషధర్మమును మీకు చెప్పినాడను" అని యాపద్ధర్మములకు ముందు చెప్పబడిన ధర్మములను ఉపసంహరించి, "ఆపదయందు సంతానముపొందు విధానమును చెప్పినాడను" అని యాపద్ధర్మములను ముగించెను. ఇందువలన పునర్వివాహ మనుమాటను నష్టపత్ని విషయమై మనువు తలపకయుండగా నియోగమర్థము కాదని చెప్పవచ్చునా? కనుక నాశ, మరణ, క్లీబతాద్యాపదలయందు, మనువును వసిష్ఠులవారును వివాహమును నిషేధించి, నియోగమును విధించినారని సిద్ధాంతము. ఈ యాపదలయందే నిరీక్షణకాలమును, నియోగమును, నారదులవారును విధించియున్నారు.

**'నష్టేమృతే' శ్లోకార్థము.**

౧. "అజ్ఞాతదోషే ణోఢా యా నిర్దోషా నాన్య మాశ్రితా ।
బంధుభి స్సా నియోక్తవ్యా నిర్బంధు స్స్వయ మాశ్రయేత్ ॥
౨. నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ ।
పంచ స్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే ॥
౩. అష్టౌ వర్షా ణ్యుదీక్షేత బ్రాహ్మణీ ప్రోషితం పతిం ।
అప్రసూతా తు చత్వారి పరతోఽ న్యం సమాశ్రయేత్ ॥
౪. క్షత్త్రియా షట్సమా స్తిష్ఠే దప్రసూతా సమాత్రయం ।
వైశ్యా ప్రసూతా చత్వారి ద్వేవర్షే త్వితరా వసేత్ ॥
౫. న శూద్రాయాః స్మృతః కాలః ఏష ప్రోషిత యోషితాం ।
జీవతీ శ్రూయమాణే తు స్యా దేష ద్విగుణో విధిః ॥
౬. అప్రవృత్తౌ తు భూతానాం దృష్టి రేషా ప్రజాపతేః ।
అతోఽన్య గమనే స్త్రీణాం ఏష దోషో న విద్యతే॥"

౧. "ఎఱుకపడని దోషములు గలవానిచే వివాహము చేసికొనబడిన నిర్దోషయగుస్త్రీ, అన్యుని ఆశ్రయింపకయుండిన, బంధువులచే నియోగింపబడతగినది. బంధురహితయయినచో, స్వయముగానే ఆశ్రయింపవచ్చును. ౨. పతి నష్టుడును అనగా దేశాంతరగతుడును, మృతుడును, సన్న్యాసియు, నపుంసకుడును, పతితుడును, అయినచో, ఈ అయిదాపదలయందును, అన్యుడు పతిగా ఏర్పఱుపబడుచున్నాడు. ౩. నష్టభర్తృకయగు బ్రాహ్మణస్త్రీ పతిని ఎనిమిదేండ్లు ఎదురుచూడవలయును, అప్రసూత నాలుగేండ్లు; వెనుక నింకొకని



నాశ్రయింపవచ్చును. ౪. క్షత్త్రియస్త్రీ ఆఱేండ్లుండవలయును. అప్రసూత మూడేండ్లు, ప్రసూత వైశ్య నాలుగేండ్లు, అప్రసూత రెండేండ్లు, ౫. నష్టభర్తృకలకు చెప్పబడిన యీ కాలము శూద్రస్త్రీకి చెప్పబడలేదు. బ్రతికి యుండిన సమాచారము తెలియుచుండెనా, ఈ విధి ద్విగుణమగును. ౬. భూతప్రవృత్తి నిలిచిపోయినయెడల ఇది మనువు చెప్పినధర్మము. అటు వెనుక నన్యునితో సంగమించిన, స్త్రీలకు దోషము లేదు." ఇచ్చట 'ప్రసూత' అనుటవలన 'పతౌ' గౌణముగాదు. కనుక ఫలితార్థము ఇట్లు,

"జారేణ జనయే ద్గర్భం మృతే త్యక్తే గతే పతౌ ।
తాం త్యజేత పరే రాష్ట్రే పతితాం పాపకారిణీమ్॥" పరాశరః.

"న ధర్మబుద్ధ్యా పతిరేవ సేవితో నహ్నిప్రవేశో న కృతో మృతే పతౌ।
వైధవ్య మాసాద్య తపో న సేవితం దేహీ న్యవచ్ఛిన్ని స్తరయ త్వయా
[కృతమ్॥" గారుడపురాణము.

నిరీక్షణమున రెండేండ్లును, మూడేండ్లును, అత్యల్పకాలము గావున ఈవిధి పునర్వివాహ విధి కాకపోవుట స్పష్టము. మఱియు నిది పునర్వివాహ విధియయిన, శాస్త్రాంతర విరోధమును స్వవచన విరోధమును గలుగును. ఈవిధి ప్రసూతాప్రసూతలను గూర్చినది. క్షతాక్షతలను గూర్చి చెప్పబడినది కాదు. మఱి పునస్సంస్కారము,

"సా చే దక్షతయోనిః స్యా ద్గతప్రత్యాగతాపివా।
పౌనర్భవేన భర్త్రా సా పున స్సంస్కార మర్హతి॥".

అను మనువచనమువలన అక్షతోఢలకేగాని, క్షతోఢలకు సంభవింపదు. "అక్షతా చ క్షతా చైవ పునర్భూః సంస్కృతా పునః।" "క్షతయయినను, అక్షతయైనను, మరల సంస్కరింపబడినది పునర్భువు" అను యాజ్ఞవల్క్య వచనమువలన క్షతోఢకును సంభవించు నన గూడదు. అగు నెడల—

"వేదార్థోపని బంధృత్వా త్ప్రాధాన్యం తు మనోః స్మృతం।
మన్వర్థ విపరీతా యా సా స్మృతిర్న ప్రశస్యతే॥"ఆపస్తంబబృహస్పతీ.

అని మనువిరోధముగల స్మృతి పనికిరాదు—అను స్మృత్యసంప్రదాయము విరోధించును. కనుక యాజ్ఞవల్క్యులవారిక్షత అనూఢక్షత. అట్లే నారదులవారును తెలియజేసినారు.

"౧. పరపూర్వాస్త్రియ స్త్వన్యా స్సప్త ప్రోక్తా యథాక్రమం ।
పునర్భూ స్త్రీ విధా తాసాం స్వైరిణీ తు చతుర్విధా ॥"

"౨. కన్యైవాక్షత యోని ర్యా పాణిగ్రహణ దూషితా ।
పునర్భూః ప్రథమా ప్రోక్తా పున స్సంస్కార కర్మణా ॥
౩. దేశధర్మా నవేక్ష్య స్త్రీ గురుభి ర్యా ప్రదీయతే ।
ఉత్పన్న సాహసాన్యస్మై సా ద్వితీయా ప్రకీర్తితా ॥
౪. అసత్సు దేవరేషు స్త్రీ బాంధవై ర్యా ప్రదీయతే ।
సవర్ణాయ సపిండాయ సాతృతీయా ప్రకీర్తితా॥" నారద.

౧ పరపూర్వస్త్రీలు వరుసగా ఏడుగురు. అందుపునర్భువులు ముగ్గురు— స్వైరిణులు నలుగురు. ౨. పునస్సంస్కారము పొందిన యక్షతయోని ప్రథమ పునర్భువు. ౩. వ్యభిచరించి, దేశధర్మము ప్రకారము అన్యుని కీయబడినది ద్వితీయ పునర్భువు. ౪. దేవరులులేనియెడల సవర్ణ సపిండుల కీయబడినది తృతీయపునర్భువు. "వాగ్దత్తా శుల్కదత్తలనే దేవరునికే యిమ్మని మనువు చెప్పెను గాన అన్యుని కిచ్చినది మూడవ పునర్భువు అనియు, అది యక్షత యోని యనియు, విశదము. కనుక ద్వితీయ పునర్భువు మాత్రమే క్షతయోని. అది యనూఢ యని తల్లక్షణముచేతనే స్పష్టము. కనుక ఊఢక్షతను యాజ్ఞవల్క్యులవారు చెప్పలేదు. అనూఢక్షతయందు పునస్సంస్కృతా శబ్ద మన్వయింప దని యాక్షేపింప గూడదు. ఊఢాక్షతలకొఱకై ప్రవర్తించిన పునశ్శబ్దము అనూఢక్షత విషయమై మందోపయోగ మని తెలియవలయును. ఇట్టిశైలి,

" సర్వవర్ణేషు తుల్యాసు పత్నీ ష్వక్షతయోనిషు ।
ఆనులోమ్యేన సంభూతా జాత్యా జ్ఞేయా స్తయైవ తే॥ "

ఇత్యాది మనువచనములయందును గనుపట్టుచున్నది. ఇచ్చట ఆనులోమ్యేన యను పదము ఈశ్లోకవాక్యముతో వ్యాకరణ సంబంధము గలిగి యున్నను అర్థసంబంధములేక దాని తరువాతి శ్లోకముతో నన్వయించుచున్నది. అక్షతా క్షతా యను విభాగముచేతనే ఇరువురును ఊఢలు గారని స్పష్టపడియున్నది. అయినయెడల ఊఢాశబ్దమే చాలునుగదా. విజ్ఞాన యతీంద్రులును ఇట్లే వివరించినారు.

కనుక క్షతోఢకు పునర్వివాహము లేనందువలన 'నష్టేమృతే' వివాహపరము అను వ్యాఖ్యానమునకు శాస్త్రాంతర విరోధము స్పష్టముగా నేర్పడియున్నది.



మరల నారదస్మృతి.

౫. "స్త్రీ ప్రసూ తాప్రసూతా వా పత్యా వేవతు జీవతి ।
కామాత్సమాశ్ర యే దన్యం ప్రథమా స్వైరిణీతు సా ॥
౬. కౌమారం పతి ముత్సృజ్య యా త్వన్యం పురుషం శ్రితా ।
పునః పత్యు ర్గృహం యాయా త్సా ద్వితీయా ప్రకీర్తితా॥
౭. మృతే భర్తరి తు ప్రాప్తాన్ దేవరాదీ నపాస్య యా ।
కామాత్స మాశ్రయే దన్యం సా తృతీయా ప్రకీర్తితా ॥
౮. ప్రాప్తాదేశా ద్ధనక్రీతా క్షుత్పిపాసాతురా తు యా ।
త వాహ మి త్యుపగతా సా చతుర్థీ ప్రకీర్తితా॥" నారదః.

౫. "ప్రసూతయయినను, అప్రసూతయయినను, భర్త జీవించి యుండగా కామముచే నన్యుని ఆశ్రయించినది ప్రథమస్వైరిణి.

౬. ప్రథమభర్తను వదలి యన్యునాశ్రయించి మరల ప్రథమభర్తగృహమునకు వచ్చినది రెండవస్వైరిణి. ౭. దేవరాదులనుమాని యన్యునాశ్రయించిన విధవ మూడవస్వైరిణి. ౮. క్షుత్పీడిత యయివచ్చి యాశ్రయించినది నాలుగవ స్వైరిణి" స్వైరిణులకు సంస్కారములేదు.

"అక్షతా చ క్షతాచైవ పునర్భూ స్సంస్కృతా పునః ।
స్వైరిణీ యాపతిం హిత్వా సవర్ణంకామతః శ్రితా॥" యాజ్ఞవల్క్యః.

అని యాజ్ఞవల్క్యులవారు పునస్సంస్కృతనుండి స్వైరిణిని వ్యావర్తించినారు. "అజ్ఞాతదోషేణ" యను శ్లోకముచేత వివాహమే విధింపబడినయెడల అట్లు వివాహమాడిన స్త్రీలలో అక్షతలు పునర్భువులును, పరపూర్వలెల్ల ఏడుగురేగావున, క్షతలు స్వైరిణులును అగుదురు. స్వైరిణులకు వివాహము లేదని చూపబడెనుగదా. అప్పటికి క్షతలకు 'నష్టే'యను వచనముచే వివాహమును, తక్కిన వచనములచే తన్నిషేధమును అని ప్రబల విరోధము సంభవించును. ఇదిరయే వివాహపరమయిన యర్థమునకు స్వవచన విరోధము. మఱియు, "అతో౽న్యగమనే స్త్రీణా మేష దోషో న విద్యతే" యనుటచే, ఈ పరపూర్వలందఱును నిర్దోషలు అనవలయును. కనుక ఇదియే వివాహ విధియయిన పునస్సంస్కృత అనగా అక్షతయోని మాత్రము నిర్దోషయను ప్రతిపక్షుల స్వమనీషా క్రాంతమగు సిద్ధాంతము నిర్మూలము.

(1) ఇచట పునర్భూసంజ్ఞయే కలుగ దని ప్రతిపక్షు లనవచ్చును.

"మృతే భర్తరి యా నారీ త్యక్తవ త్యథ తం స్వయం।
సవర్ణా జ్జన యేద్గర్భం భర్తుః పౌనర్భవం సుతమ్॥" బ్రహ్మపురాణమ్.
యా పత్యా వా పరిత్యక్తా విధవా వా స్వ యేచ్ఛయా।
ఉత్పాదయే త్పునర్భూత్వా స పౌనర్భవ ఉచ్యతే॥" మనుః.

"స్వేచ్ఛచే విధవయు, త్యక్తయు, త్యజించినదియు, సవర్ణుని చేరి కనిన, ఆ సుతుడు పౌనర్భవు డనబడును."

"యా వా క్లీబం పతిత మున్మత్తం వా పతి ముత్సృజ్య।
అన్యంపతిం విందతే మృతే వా సా పునర్భూ ర్భవతి॥" వసిష్ఠః.
క్లీబం విహాయ పతితం యా పున ర్లభతే పతిం।
తస్యాం పౌనర్భవో జాతో వ్యక్త ముత్పాద కస్య సః॥" కాత్యాయనః.

మృతక్లీబ పతితులభార్యలు, అన్యపతిని గ్రహించిన పునర్భువు లగుదురు.

"అక్షతా భూయ స్సంస్కృతా పునర్భూః।
భూయ స్త్వసంస్కృతాపి పరపూర్వా॥" విష్ణుః.

నారద స్మృతియందే అక్షతకు పునర్భూసంజ్ఞ చెప్పబడెను గదా. "పునస్సంస్కారమును పొందిన యక్షత పునర్భ వనబడును. పునస్సంస్కారము లేని పరపూర్వయు పునర్భువు" అని విష్ణుస్మృతి చెప్పుచున్నది. కనుక పునర్భూ శబ్దమునకు రెండర్థములు. ఏడుగురు పరపూర్వలు ఒకయర్థము. ముగ్గురుమాత్రము ఒకయర్థము. అట్లే పౌనర్భవశబ్దమునకును రెండర్థములు తెలియవలయు. కనుక నిచ్చట ఆసంజ్ఞలు తప్పవు. ఈపునర్భువు లందఱకును పౌనర్భవు లందఱకును ఆశౌచము సమానము.

"అనౌరసేషు పుత్రేషు జాతేషు చ మృతేషుచ।
పరపూర్వాసు భార్యాసు పుత్రేషు కృతకేషుచ।
భర్తృపిత్రో స్త్రిరాత్రం స్యా దేకాహ స్తు సపిండతః॥" హారీతః.
"సూతకే మృతకే చైవ త్రిరాత్రం పరపూర్వయోః।
ఏకాహ స్తు సపిండానాం త్రిరాత్రం యత్ర వై పునః॥" మరీచిః.

"పరపూర్వలు ఇరువురును కనినను చచ్చినను తత్పుత్రులు చచ్చినను భర్తకును తండ్రికిని త్రిరాత్రము ఆశౌచము. సపిండుల కేకరాత్రము."

సకల మహర్షులును ద్వాదశపుత్రులలో ఒకపౌనర్భవునే చెప్పియున్నారు.



"ఔరసః క్షేత్రజ శ్చైవ పుత్రికాపుత్ర ఏవచ।
కానీన శ్చ సహోఢ శ్చ గూఢోత్పన్న స్తథైవచ।
పౌనర్భవో పవిద్ధశ్చ లబ్ధః క్రీతః కృత స్తథా।
స్వయం చోపగతః పుత్రా ద్వాదశైత ఉదాహృతాః।
ఏషాం ష డ్బంధుదాయాదాః ష డదాయాదబాంధవాః।
పూర్వః పూర్వః స్మృతః శ్రేయాన్ జఘన్యో యో య ఉత్తరః।
జ్యాయసో జ్యాయసో లాభే కనీయాన్ రిక్థ మర్హతి॥" నారదః.

ఇందువలన పౌనర్భవుడు అదాయాదుడు అధముడు నని నారదులవారే చెప్పినారుగదా. అక్షత పునస్సంస్కృతయే పునర్భువని నారదులవారే నిర్వచించినారు. కనుక అదాయాదుడును అధముడును అగునీతడు అక్షతపునర్భూపుత్రుడుగాక యెట్లుతప్పును. ఇతడే స్వైరిణీ పుత్రుడైన, పునస్సంస్కృతా సుతుడు బంధువైనను గాడు గదా. కనుక క్షత నింద్య అక్షత యనింద్య అనువ్యవస్థ నిర్మూలము. పునర్భువెల్ల నింద్య యని సిద్ధాంతము.

విధవయయిన నదుష్ట అన్య దుష్ట యని యొక వ్యవస్థ కల్పింతురు. అదియు శాస్త్రవిరుద్ధము.

"ఉత్సృజ్యాపి హిమా మార్య ప్రాప్స్యస్య న్యా మపి స్త్రియం।
తతః ప్రతిష్ఠితో ధర్మో భవిష్యతి పున స్తవ॥
న చా ప్యధర్మః కల్యాణ బహుపత్నీకతా నృణాం।
స్త్రీణా మధర్మః సుమహాన్ భర్తుః పూర్వస్య లంఘనమ్॥" భారతః.

బకాసురుని కాహారముగా పోదలచిన బ్రాహ్మణునిగూర్చి అతనిభార్య చెప్పువచన మిది. "నేను పోయిన నీకు మఱియొకభార్య వచ్చును. అంతట నీకు మరల ధర్మము ఏర్పఱుపబడును. బహుభార్యలను గైకొనుట పురుషులకధర్మముగాదు, స్త్రీలకయిననో ప్రథమభర్తను దాటుట మహాత్తరమయిన పాతకము." శాస్త్రమిట్లు చెప్పుచుండగా విధవపునర్భువు అదుష్టయనుట కన్న అజ్ఞాన మేమున్నది. కనుక పునస్సంస్కృత యెల్ల పునర్భువే యనియు, పునర్భువెల్ల దుష్టయనియు, పౌనర్భవుడెల్ల అదాయాదుడును, అధముడును, అనియు నారదస్మృతిచేతనే సిద్ధాంతీకరింపబడినది. కనుక 'నష్టేమృతే' పునర్వివాహ విధాయకమయిన, "అతోన్య గమనే స్త్రీణా, మేష దోషో న విద్యతే" యనువచనమునకు ప్రబలవిరోధములు స్పష్టములు.

## ఆంగిరసస్మృతి.

### పునర్భూపత్యాదుల ప్రాయశ్చిత్తము.

"వివాహితాం చ విధవాం మహామోహేన వంచకైః।
దత్తాం వివాహ్య త జ్ఞాత్వా సద్య శ్చండాలతాం వ్రజేత్ ॥"

"వివాహమైన విధవను మహామూఢ్యముచేత వంచకులచేత మరల దానము చేయబడిన దానిని, మరల వివాహము చేసికొనినవాడు తత్క్షణమే చండాలుడగును." ఇచ్చట "మహామోహేన" యనుటచే పునర్వివాహము స్త్రీకిచేయుట మహామూఢ్య మనియు, "వంచకైః" అనుటచే పునర్వివాహము శాస్త్రీయ మనుట వంచనయనియు, విధవావివాహము నిషిద్ధతమమని సకలజనవిదితముగావున వంచనచేయనియెడల అనగా వితంతువును కన్యనుగా తెలియజేయనియెడల ఎవడును వివాహ మాడడనియు, స్పష్టపడుచున్నది. "తజ్జ్ఞాత్వా" "దానిని తెలిసికొని" అనునది పైకి అన్వయించుచున్నది.

"తద్దోషశమనార్థై వం పూర్వవత్తు సమాచరేత్ ।"

"అది యెఱిగి ఆదోషము శమించుటకు అనగా ఆ చండాలత్వము పోవుటకు విధవను వివాహమాడి నందులకు చెప్పబడినప్రాయశ్చిత్తమును చేసికొనవలయును.

"ద్విగుణం నిఖిలం కృత్యం సముస్నేయం విచక్షణైః ॥"

"ఆప్రాయశ్చిత్తమును సమస్తమును విధవను వివాహముచేసికొనినవాడు ద్విగుణముగా చేసికొనవలయును" ఇట్లు ఆంగిరసస్మృతి చెప్పుచున్నది. ఆప్రాయశ్చిత్తము లెట్టివో మఱియొక్కచోట ఈగ్రంథమందు ఉదాహరింపబడినవి. ఇచ్చట "దత్తామ్" అనుటచే, స్వేచ్ఛచే మరల వివాహమాడిన విధవ దుష్టయనియు, పెద్దలచే ఈయబడి వివాహమాడినవిధవ యదుష్టయనియు, పూర్వపక్షులు చేసినకల్పన కేవలము కుయుక్తి యని స్పష్టపడుచున్నది. ఇందువలన సధవను వివాహమాడుటకన్న విధవను వివాహమాడుట రెండింతలు పాతకమనియు అందువలన చండాలత్వము గలుగుననియు స్పష్టపడినది. కనుక 'నష్టే మృతే'యను శ్లోకము విధవావివాహవిధాయకము గాదు. కనుక సధవా పునర్వివాహ విధాయకమునుంగాదు. కనుక సధవా పునర్వివాహ నిషేధములకును అపవాదము లేదు. సధవా పునర్వివాహమును ఆంగిరసస్మృతి నిషేధించుచున్నది. ఎట్లనిన,

"పునర్వివాహితా మూఢైః పితృభ్రాతృ ముఖైః ఖలైః।
యది సా తే ఖలాః సర్వే న్యూ లైవ నిరయగామినః ॥"



"పున ర్వివాహితా సాతు మహారౌరవభాగినీ।
తత్పతిః పితృభి స్సార్థం కాలసూత్ర గతో భవేత్ ॥
దాతాచాంగారశయన నామకం ప్రతిపద్యతే।
తద్దోష శమనా యాథ ప్రాయశ్చిత్త మిదం పరమ్ ॥"

స్త్రీకి పునర్వివాహము చేసిన తండ్రి, అన్న, మొదలగు పాపులు నరకమున గూలుదురు. ఆస్త్రీమహారౌరవ మను నరకమున బడును. దానిభర్త వాని పితృదేవతలతోకూడ నరకమున గూలును. దాత అంగారశయనము అనగా నిప్పుశయ్యా అనునరకమున గూలును. అటుపైన,

"సాచే ద్భర్తృద్వ యం త్యక్త్వా సేతుస్నాన సహస్రకం।
కృత్వాచ యావకాహారా వర్షమాత్రేణ శుధ్యతి ॥
య ద్యపుత్రా, పుత్రిణీ చే త్పతే దే వాశు తై స్సహ।
సా వై పుత్రై స్త మద్భూతై శ్చండాలత్వం భజేత వై ॥"

"ఆమె యిద్దఱుభర్తలను విడిచి ప్రాయశ్చిత్తము చేసికొనిన, అపుత్రయైన, శుద్ధురాలగును. వానివలన పుత్రులుగలిగిన, వారితోగూడ చండాలియై యుండవలసినది." ఇందువలన, పునర్వివాహము చేసికొనిన విధవయు, విధవాపతియు, తత్పుత్రులును, అట్టిసధవయు, ద్వితీయపతియు, తత్పుత్రులును అందఱును చండాలు రని నిశ్చయముగదా. ఇచ్చట విధింపబడిన ప్రాయశ్చిత్తములయందు గాయత్ర్యాది మంత్రజపము విధింపబడి యుండుటచే, ఈనిషేధము ఉత్తమజాతుల వారికిచెప్పబడినది. అందువలన, 'నష్టేమృతే' అనువిధి బ్రాహ్మణక్షత్రియాది జాతులకు విధింపబడియుండుటచే అది పునర్వివాహ విధి కాదని సిద్ధాంతము. ఇందువలన,

"మాతు రైక్యాద్వి పితృకా భ్రాతరా వన్యగోత్రజౌ।
ఏకాహం సూతకే తత్ర త్రిరాత్రం మృతకే తయోః॥" మరీచిః.

ఇట్టు, ఒక్కతల్లికే యిద్దఱు తండ్రులవలన పుట్టిన అన్నదమ్ముల యాశౌచము మొదలగునవి ఏజాతులకు ఈనిషేధములు పట్టవో వారికే చెప్పబడినవని యెఱుగవలయును. పౌనర్భవునికి అదాయాదతను అధమతను విధించుటచే నారదస్మృతియే పునర్భవమును నిషేధించుచుండగా ఆస్మృతిలోనుండి యని—

"ఉద్వాహితాపి యా కన్యా న స్యా త్సంప్రాప్తమైథునా।
పున స్సంస్కార మర్హేత యథా కన్యాత థైవ సా॥"

"వివాహితయైనను పురుష సంగమము పొందని స్త్రీ కన్య యెట్లో అట్లే పునస్సంస్కారము పొందవచ్చును" అను శ్లోకము నుదాహరించి దానివలన పునర్వివాహమును ప్రతిపక్షులు సాధింప జూచుచున్నారు. ఈశ్లోకము నారదస్మృతియొక్క ప్రతులలోలేదు. కనుక దీనిప్రకరణము తెలియరాదు. ప్రతిపక్షులును ఈవిషయమందు మౌన మవలంబించియున్నారు. కనుక ఏసమయములయందు ఈపునస్సంస్కారమో తెలియదు. కనుక వివాహమైనది మొదలుకొని భర్తమీద భర్తగా, దోర్లదోపుడుగా, నిత్యకల్యాణము పచ్చతోరణముగా, అక్షతయోనియైన భాగ్యశాలినికి ఇంటినిండ గోల్లు గోకళ్లుంబోలె భర్తలుపడి దొరలుచుండవలయునా ? లేక నష్టతాది పంచాపదలయందా యీపునర్వివాహము ? ఆపంచాపదలయందు కాదు. ఎందుచేతననగా ఆయాపదలు ప్రసూతలకును అప్రసూతలకును చెప్పబడినవి. 'నష్టేమృతే'యను శ్లోకము నుదాహరించి నారదస్మృతి ప్రసూతలకు అప్రసూతలకు పునర్వివాహమును విధించిన దని వాదించుచున్నవారే ఉద్వాహితాపియను శ్లోకము నుదాహరించి నారదస్మృతి యక్షతయోనులకు మాత్రమే పునర్వివాహమును విధించుచున్న దని వాదించుట మిక్కిలి యాశ్చర్యకర మయియున్నది. అక్షతయోనులకే మరణాద్యాపదలయందు ఈవివాహము చెప్పబడిన దనుటకు ఏయాపద యందైనను పునర్భవము పాపిష్ఠ మని నారదస్మృతిచేతనే గదా సిద్ధాంతింపబడినది. ఈశ్లోకమందు యథాకన్యా తథైవ యనుటచే నిర్దుష్టమయిన వివాహము చెప్పబడినది. కనుక ఈశ్లోకమందలి పునస్సంస్కారము యథావిధిగా జరిగిన ప్రథమ వివాహము కలదానిది గాదు.

ఈశ్లోకము శాతాతపస్మృతియందు.—

"వరశ్చేత్కులశీలాభ్యాం న యుజ్యేత కథంచన।
న మంత్రాః కారణం తత్ర న చ కన్యానృతం భవేత్ ॥
సముచ్ఛిద్యతు తాంకన్యాం బలాదక్షతయోనికాం।
పునర్గుణవతే దద్యా దితి శాతాతపోఽబ్రవీత్॥"

"తక్కువ జాతివాడు ఎక్కువజాతికన్యను వివాహము చేసికొనినయెడల నప్పుడు మంత్రప్రవృత్తిలేదుగాన సంగమము జరుగకముందు ఆకన్య నన్యునికీయవలయును" అను నీశ్లోకములకు తెంబడిదిగానున్నది. కనుక నీశ్లోకము హీనోఢా విషయము. కనుక నిది ప్రతిపక్షులు కోరుచున్న విధవా వివాహమును సాధింపనేరదు.—అగ్ని పురాణమున,

"నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ।
పంచ స్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే॥
మృతే తు దేవరే దేయా తదభావే యథేచ్ఛయా



"విధవను దేవరునికీయవలయును. దేవరుడు లేకపోయిన యథేచ్ఛగాను" అని వివాహ ప్రకరణమున చెప్పబడియున్నది. అగ్నిపురాణమునందే దాయవిభాగమందు,

"ఔరసో ధర్మపత్నీజః, తత్సమః పుత్రికాసుతః।
క్షేత్రజః క్షేత్రజాతస్తు, సగోత్రే ణేతరేణవా।
గృహే ప్రచ్ఛన్న ఉత్పన్నో గూఢజ స్తు సుతః స్మృతః।
కానీనః కన్యకాజాతో మాతామహసుత శ్చ సః।
క్షతాయా మక్షతాయాం వా జాతః పౌనర్భవః సుతః।
దద్యా న్మాతా పితా వాయం స పుత్రో దత్తకో భవేత్।
క్రీత శ్చ తాభ్యాం విక్రీతః, కృత్రిమః స్యా దతో న్యథా।
దత్తాత్మాతు స్వయందత్తో, గర్భవిన్న స్సహోఢజః।
ఉత్సృష్టో గృహ్యతే యస్తు సోపవిద్ధో భవే త్సుతః।
పిండ దోంశహర శ్చైషాం పూర్వాభావే పరః పరః।
సజాతీయే ష్వయం ప్రోక్త స్తనయేషు మయా విధిః॥" అగ్ని పు.

అని పునర్భూసుతుడు అదాయాదుడు అపిండదుడు అని చెప్పబడియున్నది.

ఆశౌచమున,

"అనౌరసేషు పుత్రేషు భార్యా స్వన్యగతాసు చ।
పరపూర్వాసు భార్యాసు త్రిరాత్రా చ్ఛుద్ధి రిష్యతే।
వృథాసంకర జాతానాం ప్రవ్రజ్యాసు చ తిష్ఠతామ్।
ఆత్మన స్త్యాగినాం చైవ నివర్తే తోదకక్రియాః॥" అగ్ని పు.

"అనౌరసపుత్రులకొఱకయినయాశౌచమును చెప్పుచున్నాను. అనౌరసపుత్రులకొఱకును, అన్యుల నాశ్రయించిన భార్యలకొఱకును పరపూర్వభార్యలకొఱకును, త్రిరాత్ర మాశౌచము. వృథా సంకరమువలన బుట్టినవారికిని, సన్న్యాసులకును, ఆత్మహంతలకును, ఉదకక్రియలు మానవలయును." పౌనర్భవాదులు సంకరు లని "అవేద్యావేదనేన చ" యను వచనముచే స్పష్టము. విధవ లవేద్య లని "అజ్ఞానేనద్విజో య స్తు" అనుటచే స్పష్టము. వీరలకు ఉదకక్రియలు లే వని యగ్నిపురాణము చెప్పుచున్నది. కనుక 'నష్టేమృతే' యను వచనము వివాహ విధాయకము గాదు. "దేవరే దేయా తదభావే యథేచ్ఛయా" అనుటచే దేవరుని కిచ్చినను దేవరుడు లేనియెడల నన్యుని కిచ్చినను ధర్మభేదము లేదు. ఇది వివాహమయిన "యస్యామ్రియేత" యనుటచే దేవరుని కిచ్చిన నియోగమును, "అసత్సు దేవరేషు" అనుటచే అన్యుని

కిచ్చిన పునర్భూవమను అగును. నియోగ పునర్భూవములు వేఱువేఱు ధర్మములు. కనుక 'నష్టే' వివాహాధిగాదు. యిది నియోగమయిన దేవరునికిచ్చినను దేవరుడు లేనియెడల అన్యుని కిచ్చినను "దేవరా ద్వా సపిండా ద్వా" "సమానోదకజన్మ" అను ప్రమాణములచే ధర్మభేదము లేదు. ఇచ్చుట నభేదము చెప్పబడినది. కనుక నిది నియోగవిధి యని యెఱుగవలయును.

" క్షేత్రజః క్షేత్రజాతస్తు సగోత్రే ణేతరేణవా ।
పతిత స్తత్సుతః క్లీబః పంగు రున్మత్తకో జడః ।
అంధోఽచికిత్స్య రోగార్తా భర్తవ్యా స్తు నిరంశకాః ।
ఔరసాః క్షేత్రజా స్త్వేషాం నిర్దోషా భాగహారిణః॥" అగ్ని పురాణము.

సగోత్రుని వలననైనను ఇతరుని వలననైనను పుట్టినవాడు అను నర్థము 'దేవరే' 'తదభావే యథేచ్ఛయా' అను పదములచేత చెప్పబడినది. పతితాదులు క్లీబాది శబ్దములచేత చెప్పబడిరి. పతితక్లీబాదుల భార్యలకు నియోగ మని 'ఏషాం క్షేత్రజాః' అనుపదములు చెప్పుచున్నవి. కనుక 'నష్టేమృతే' 'దేవరే దేయా' అనువచనములు నియోగ విధాయకములని సులభముగా తెలియుచున్నది. దేయాశబ్దము నియోగమును బాధింపదు. నియోగమున నీ ధాతువు కలదు. బలిరాజుభార్య దీర్ఘతమునియొద్దకు నియోగము ప్రకారము తాను పోక దాసిని పంపెను. ఆవిషయమును దీర్ఘతముడు బలితో,

" అంధం వృద్ధం చ మాం జ్ఞాత్వా సుదేష్ణా మహిషీ తవ ।
అవమేనే దదౌ మూఢా శూద్రాం ధాత్రేయికాం మమ॥ "

నాకు దాసిని 'దదౌ' అని భారతమునను,

" అంధం వృద్ధం చ మాం దృష్ట్వా సుదేష్ణా మహిషీ తవ ।
ప్రాహిణో దేవ మానస్మై శూద్రాం ధాత్రేయికాం నృప ॥ "

నాకు దాసిని 'ప్రాహిణోత్' 'పంపెను' అని మత్స్యపురాణమునను చెప్పెను.

ఇటు 'దా'ధాతువునకు నియోగమందు వ్యవహారము కలదు. మఱియు,

" స్వకీయా పరకీయా చ పునర్భూ రితి కాశికాః ।" అగ్ని పు.

"కాశికుల మతమున స్వస్త్రీ పరస్త్రీ పునర్భువు అని నాయికలు ముగ్గురు" అని అగ్నిపురాణముననే యుండుటచేత పునర్భువు స్వస్త్రీ కాదనియు, ఉంచుకొనబడిన పరస్త్రీయనియు నిశ్చయము. కనుక విధవావివాహ స్వరూపము విధవముండ నుంచుకొనుటకన్న నన్యముగాదు. విధవావివాహము



పరభార్యాపహారణముకన్న వేఱుగాదు. వివాహము స్త్రీకి ఉపనయన మగుటచే దానికి ఆవృత్తి నిష్ఫలము గాన, చేసినను అకృతము గాన, పునర్భవము పరభార్యాపహారణమునకన్న అన్యము గాదు. కనుకనే వేనుడు కల్పించిన యీధర్మమును పరభార్యాపహారణ మని మహర్షులు చెప్పియున్నారు.

" సునీథా నామ తస్యాసీత్ వేనో నామ సుతః పురా ।
అధర్మనిరతః కామీ బలవాన్ వసుధాధిపః ।
లోకేఽప్యధర్మకృ జ్జాతః పరభార్యాపహారకః ।
మమంథు ర్బ్రాహ్మణా స్తస్య బలా ద్దేహ మకల్మషాః॥" కూర్మపురాణము.

"వేనుడను రాజు సునీథకుమారుడు అధార్మికుడు కాముకుడు బలవంతుడు లోకమున నధర్మమును కల్పించినాడు పరభార్యాపహారకుడు. పావనులైన బ్రాహ్మణులు ఆతనిశరీరమును బలత్కారమున మథించినారు." వ్యభిచార మపహారణము గాదు గావున పునర్వివాహము అపహారణమునకన్న నన్యము గాదని యిందువలన స్పష్టము.

పూ॥ పూర్వభర్తకు స్వామ్యము లేదు గనుక పునర్వివాహము అపహారణము గాదు.

ఉ॥ "మంగళార్థం స్వస్త్యయనం యజ్ఞ శ్చాసాం ప్రజాపతేః ।
ప్రయుజ్యతే వివాహేషు ప్రదానం స్వామ్య కారణమ్॥" మనుః.

ప్రదానమువలన భర్తకు స్వామ్యము కలుగును.

పూ॥ ఆస్వామ్యము పరిత్యాగముచే నశించును.

ఉ॥ " న నిష్క్రయవిసర్గాభ్యాం భర్తు ర్భార్యా విముచ్యతే ।
ఏవం ధర్మం విజానీమః ప్రాక్ప్రజాపతినిర్మితమ్ ॥" మనుః.

"విక్రయముచేతను, పరిత్యాగముచేతను భార్యా భర్తృసంబంధము వదలదు. ఇది పూర్వము ప్రజాపతి నిర్మించిన ధర్మము." వదలినదానిని మరల యీయకూడ దని దీనితరువాతి శ్లోకము.

"సకృదంశో నిపతతి సకృత్కన్యా ప్రదీయతే ।
సకృ దాహ దదానీతి త్రీణ్యేతాని సతాం సకృత్ ॥"

పూ॥ భర్తయే యిచ్చిన స్వామ్యము నశించును.

ఉ॥ తన్నిషేధమే "సకృత్కన్యాప్రదీయతే." విక్రయత్యాగదానములచే స్వామ్యము నశింపదని మనుహృదయము మఱియు,

“స్వకుటుంబావిరోధేన దేయం దారసుతాదృతే।” యాజ్ఞవల్క్యః.

“అన్వాహితం యాచితకం అధి స్సాధారణం చ యత్ ।

నిక్షేపః పుత్రదారా శ్చ సర్వస్వం చాన్వయే సతి ।

ఆప త్స్వపిహి కష్టాసు వర్తమానేన దేహినా ।

అదేయా న్యాహు రాచార్యాః యచ్చాన్యస్మై ప్రతిశ్రుతమ్॥” నారదః.

“పుత్రులను భార్యను కష్టము లైన యాపదల యందున్నవా డైనను ఇయ్యగూడదు.”

పూ॥ స్వామ్యము మరణముచే నశించును.

ఉ॥ “శ్రుతి ర్హి శ్రూయతే పుణ్యా బ్రాహ్మణానాం యశస్వినామ్ ।

ఇహలోకే చ పితృభి ర్యా స్త్రీ యస్య మహామతే ॥

అద్భి ర్దత్తా స్వధర్మేణ ప్రేత్యభావేపి తస్య సా ।

ప్రేత్యభావేపి కల్యాణః సంగమో మే సహ త్వయా॥” రామాయణము.

“యశస్వులైన బ్రాహ్మణులవలన ఇట్లని వేదము వినబడుచున్నది. ఈలోకమున తల్లిదండ్రులచే ఏస్త్రీ ఎవనికి స్వధర్మముప్రకారము ఉదకపూర్వకముగా దానము చేయబడుచున్నదో, ఆస్త్రీ మరణము పొందినను అతనిదే కనుక ఓమహానుభావుడా మరణము పొందినను నీతోడ నాకు శుభమయిన సంగమము కలుగును” అని శ్రీరాములవారితో సీత చెప్పుచున్నది.

పూ॥ అన్యులకు దానాధికారము కలదు.

“పితా దద్యా త్స్వయం కన్యాం భ్రాతా వానుమతే పితుః ।

మాతామహో మాతుల శ్చ సకుల్యో బాంధవ స్తదా ॥

మాతా త్వభావే సర్వేషాం ప్రకృతౌ యది వర్తతే ।

తస్యా మప్రకృతిస్థాయాం కన్యాం దద్యు స్స్వజాతయః ॥” నారదః.

ఉ॥ ఇది ప్రథమవివాహపర మని కన్యాశబ్దము ప్రమాణము.

పూ॥ అక్షతయోనియొక్క దానమునకు విశేషవిధులు గలవు.

“స తు య ద్యన్యజాతీయః పతితః క్లీబ ఏవ వా ।

వికర్మస్థ స్సగోత్రో వా దాసో దీర్ఘామయోఽపి వా ॥

ఊఢాపి దేయా సాన్యస్మై సప్రావరణ భూషణా॥” కాత్యాయనః.

“వరుడు, అన్యజాతీయుడు, క్లీబుడు, సగోత్రుడు, అయినయెడల ఊఢ యయినను దానిని అన్యుని కీయవలయును.”



ఉ॥ అట్టివాని కీయగూడ దనియు, మంత్రసంస్కార రహిత యయిన అన్యుని కీయవలయు ననియు దీని యభిప్రాయము. మంత్రసంస్కార రహిత యందును ఊఢాశబ్దవ్యవహారము కలదు.

“ కులశీలవిహీనస్య పండాదిపతితస్య చ ।

అపస్మారివికర్మస్థ రోగిణాం వేషధారిణాం ।

దత్తా మపి హరే త్కన్యాం సగోత్రోఢాం తథైవ చ ।

మంత్రసంస్కారరహితా దేయాఽన్యస్మై వరాయతు ॥” కాశ్యపః.

ఇంతయే కాక ఆకాశ్యపవచనము ఆకాత్యాయనవచనమును సమర్థకములు. ఇందువలన మంత్రసంస్కారరహితకే గాని పునర్దానము లేదు. మఱియు,

“ క్లీబం విహాయ పతితం యా పున ర్లభతే పతిం ।

తస్యాం పౌనర్భవో జాతో వ్యక్త ముత్పాదకస్య సః॥” కాత్యాయనః.

“క్లీబుని పతితుని వదలి యన్యుని గ్రహించినదానిసుతుడు పౌనర్భవుడు, వాడు పుట్టించినవానికి చెందును” అని పునర్భూత్వమును కాత్యాయనుల వారే చెప్పినారు. చెప్పి,

“ ఉత్పన్నే త్వౌరసే పుత్రే చతుర్థాంశహరాః సుతాః ।

సవర్ణా అసవర్ణా స్తు గ్రాసాచ్ఛాదనభాజనాః ॥” కాత్యాయనః.

అని దాయమందలి హైన్యమునుకూడ చెప్పినారు. కనుక “ఊఢాపిదేయా” యనువిధి మంత్రసంస్కార రహితకే యని స్పష్టము. హీనోఢకు శాతాతప వచనము కలదు. మంత్రసంస్కార రహితయైన బలాత్ క్షతయయినను దానమున కర్హ యగును.

“ బలాచ్చే త్ప్రహృతా కన్యా మంత్రై ర్యది న సంస్కృతా ।

అన్యస్మై విధివ ద్దేయా యథాకన్యా తథైవసా॥” వసిష్ఠః.

బలాత్కారమున దోషము లేదని యగ్నిపురాణము చెప్పుచున్నది.

“ న స్త్రీ దుష్యతి జారేణ న విప్రో వేదకర్మణా ।

బలాత్కారోప భుక్తా చే ద్వైరిహ స్తగతాపివా ॥” అగ్నిపు.

కనుక ఎవరికిని పునర్దానాధికారము లేదు. కనుక వదలినను, అమ్మినను, ఇచ్చినను, చచ్చినను, స్వామ్యము నశింపదు. కనుకనే పూర్వాభర్తృకుం గూడ త్రిరాత్రమాశౌచము. కనుకనే స్వీయ గాదని యగ్నిపురాణము. కనుకనే యప

హరణ మని కార్యము. వివాహముకొఱకు తపస్సు చేయుచున్న యీ ప్రతిపక్షులకు వివాహస్వరూపమే తెలియలేదు. స్వామ్యము లేదట, సంస్కారము ఇహలోకముకొఱకట. సంస్కారము పతిలోకము కొఱకు అని వారు ఎఱుగరు. వారికి అన్యభర్త కావలయును గాని పతిలోకము వలదు. కనుక వివాహ సంస్కారముయొక్క ప్రయోజనము నెఱిగినవారు దానిని మరల కోరరు. దాని కావృత్తి చేసినను అకృతముగాన పునర్భవము పరభార్యాపహరణమున కన్న వేఱుగాదు. అట్లే నారదులవారు వ్యవహారపటలము తృతీయాధ్యాయములో తెలియజేసినారు.

"౧ దారమూలాః క్రియాః సర్వాః వర్ణానా మానుపూర్వశః ।
యో యస్య హరతే దారాన్ స తస్య హరతే ధనమ్ ॥
౨. అధనస్య హ్యపుత్రస్య మృతస్యోపైతి యః స్త్రియమ్ ।
ఋణం వోఢుః స భజతే సైవ తస్యధనం స్మృతమ్ ॥
౩. ధని స్త్రీ హారి పుత్రాణాం ఋణభాగ్యో ధనం హరేత్ ।
పుత్రోఽసతోః స్త్రీ ధనినోః స్త్రీహారీ ధనిపుత్రయోః ॥
౪. అంతిమా స్వైరిణీనాంయా ఉత్తమా చ పునర్భవామ్ ।
తయోః ఋణం పతికృతం దద్యాద్యస్తు తదాశ్రితః ॥" నారదః.

"౧. సకలక్రియలకును భార్యామూలము కనుక భార్యను హరించుట ధనము హరించుటయే. ౨. ధనహీనుడు పుత్రహీనుడు అగుమృతునిభార్యను హరించినవాడు వివాహమాడినవానియొక్క ఋణమును తీర్చవలయును. ఏల యనగా భార్యయే యతని ధనమని శాస్త్రము చెప్పుచున్నది. ౩. ధనహారి, స్త్రీహారి, పుత్రుడు, వీరలలో ధనహారి ఋణబాధ్యుడు, స్త్రీహారియు ధనహారియు లేనియెడల పుత్రుడు ఋణబాధ్యుడు, ధని పుత్రులు లేనియెడల స్త్రీహారి ఋణబాధ్యుడు. ౪. స్వైరిణులయందంతిమను పునర్భవులందుత్తమను గైకొనినవాడు వారి భర్తచేసిన ఋణమును తీర్చవలయును. ఈయర్థమును సంగ్రహముగా,

"రిక్థగ్రాహీ ఋణం దాప్యో యోషిద్గ్రాహస్తథైవ చ ।
పుత్రోఽనన్యాశ్రితద్రవ్యః పుత్రహీనస్య రిక్థినః ॥"

అని అగ్నిపురాణము చెప్పుచున్నది. ఇచ్చట—

"౧. అధనస్య హ్యపుత్రస్య మృతస్య" అనుటచే, పతియున్నను ధనహారియున్నను, పుత్రుడున్నను, ద్వితీయుడు పతి ఋణమునకు బాధ్యుడు కాడు. కనుక చివరశ్లోకముకొఱకే తక్కినవి చెప్పబడినవని తెలియుచున్నది. ౨. 'సైవ తస్య ధన' మ్మనుటచే ఎవ్విధమునను ప్రథమభర్తృస్వామ్యము నశింపమి స్పష్టము.



౩. "స్త్రీహారీ హరతే దారాన్" అనుటచే పునర్భవము పరభార్యాపహరణ మనియు, ౪. "ఋణం వోఢుః" అనుటచే రెండవది వివాహము కాదనియు, ౫. "ఋణం పతికృత"మ్మనుటచే రెండవవాడు పతికాడనియు, ౬. కనుక పునర్భవు భార్యకాదనియు, ౭. కనుక (పునర్) వివాహాదిసంజ్ఞలు ఔపచారికము లనియు, సిద్ధముకదా. ఈయపహరణమే కదా వేనుడు కల్పించిన ధర్మము, ఇదియేకదా పశుధర్మము, ఇదియే వర్ణసంకరము. ఈసంకరులకే గదా ఉదకక్రియలను అగ్నిపురాణము నిషేధించుచున్నది. కనుక అగ్నిపురాణమే పునర్వివాహమును విధించుచున్నదనుట మిగుల పొరబాటు. కనుక 'నష్టే మృతే' వివాహవిధి యనుట మిగుల నసంగతము. మఱియు ఇది వివాహ విధియగునేని, "పతితస్తత్సుతః క్లీబః" అను నగ్నిపురాణ వచనమునుబట్టి నియోగమునకు చెప్పబడిన యాపదలును ఇవేగాన నియోగజుడు క్షేత్రికిని, పౌనర్భవుడు బీజికిని చెందునుగాన నియోగముకొఱకు వీడుతన్నులాడను, వివాహముకొఱకు అది లాగులాడను, ఇందుల కేమి గతి? కనుక వివాహవిధి యని చెప్పగూడదు. నియోగవిధియనియే చెప్పవలయును. "నోద్వాహికేషుమంత్రేషు" అనుటచే నియోగవిధానము వివాహప్రకరణమున నుండవలసినది గావున అగ్నిపురాణమున వివాహ ప్రకరణమందే చెప్పబడినది.

## నిస్త్రాణమగునొక పూర్వపక్షము.

'అజ్ఞాతదోషేణ' యనుదోషములు, 'నష్టేమృతే'యనుదోషములు కావు. అజ్ఞాతదోషేణ యనుటచేత, వివాహమునకుముందు దోషసద్భావమును, తదజ్ఞానమును, చెప్పబడినవి. నష్టత్వమృతత్వములు వివాహమునకు ముందుండు దోషములు కావు. కనుక నియోక్తవ్యా అనునియోగము 'నష్టేమృతే' యను శ్లోకమున కనువర్తింపదు. కనుక 'నష్టేమృతే' నియోగపరమని చెప్పగూడదు.

ఉ॥ నారదమహర్షియే.

"ఏకో దోషోఽస్తి నాన్యోఽస్య సోఽద్య ప్రభృతి సత్యవాన్ ।
సంవత్సరేణ క్షీణాయుర్దేహన్యాసం కరిష్యతి॥" భారతము.

"సత్యవంతునియం దొకదోషము కలదు. ఇక సంవత్సరమునకు అతడు మరణము నొందును." అని భావిమరణమును ప్రకృతదోషమునుగా వ్యవహరించియున్నారు. కనుక నియోక్తవ్యాయను నియోగము 'నష్టేమృతే'యను దానికి సంబంధింపకపోదు. 'నియోక్తవ్యా' అని నియోగమును, నష్టేమృతే'యని తత్కారణములగు నాపదలును, 'అష్టౌ' అని నష్టునికొఱకు నిరీక్షణకాలమును చెప్పబడినవి. 'స్వయమాశ్రయేత్,' 'నాన్యమాశ్రితా', 'సమాశ్రయేత్,' అని ఆశ్ర

యణము చెప్పబడినది. ఆశ్రయణము వివాహవ్యావర్తక మని యింతకుముందే చెప్పబడినది. సంస్కారహీనురాలైన స్వైరిణియొక్క నిర్వచనములలో, 'కామా త్సమాశ్రయేత్,' 'పురుషం శ్రితా' 'సమాశ్రయేత్' అనుపదములు ప్రయోగింపబడి యున్నవి. యాజ్ఞవల్క్యులవారును "స్వైరిణీ యా పతిం హిత్వా సవర్ణం కామతః శ్రితా" అని చెప్పియున్నారు. ఇచ్చట ఆశ్రయణము సంస్కారవ్యావర్తకము - కానియెడల నాన్యమాశ్రితా యనుట అప్రసక్త ప్రతిషేధ మగును. మఱియు స్వయంశబ్దస్వారస్యముచేత ఆశ్రయణము నియోగాంగమగు గమనమును అనువదించును. అట్లే 'గమనే'యని యుపసంహారము కనుక నిది నియోగము. మఱియు, పునర్భవమున దోషములు ప్రదర్శింపబడినవి, నియోగమున దోషము లేదు.

"ఉత్తమా ద్దేవరా త్పుంసః కాంక్షంతే పుత్ర మాపది ।
అపత్యం ధర్మఫలదం శ్రేష్ఠం విందంతి మానవాః ।
ఆత్మశుక్రాదపి పృథే మనుః స్వాయంభువో౽బ్రవీత్ ॥" భారతము.

"ఉత్తమునివలన దేవరునివలన, ఆపదయందు పుత్రుని గోరుదురు. ఆసంతానము ధర్మఫలము నిచ్చును; శ్రేష్ఠము అని మనుష్యు లెంతురు, క్షేత్రియొక్క శుక్రమునకన్న శ్రేష్ఠమని స్వాయంభువ మనువు చెప్పెను." కనుక నియోగమున దోషము లేదు. "ఏష దోషో న విద్యతే" యని చెప్పబడియున్నది. కనుక 'నష్టే' నియోగవిధానమే కాని, వివాహవిధానము కాదు. ఇట్లు దోషాభావమును గమనాశ్రయణ శబ్దములును, నియోక్తవ్యా శబ్దమును. 'నష్టే మృతే' నియోగపరమని స్పష్టపఱుచుచున్నవి.

ప్ర॥ ప్రసూతలకు ఎక్కువ కాలమును, అప్రసూతలకు తక్కువ కాలమును, ఏల చెప్పబడినవి ?

"ఉ॥ జ్యేష్ఠేన జాతమాత్రేణ పుత్రీ భవతి మానవః ।
పితౄణా మనృణ శ్చైవ స తస్మా త్సర్వ మర్హతి ॥
యథైవాత్మా తథాపుత్రః పుత్రేణ దుహితా సమా।" మనుః.
"అపుత్రో మృతపుత్రో వా పుత్రార్థం సముపోష్య చ॥"—

అనువచనమువలన పుత్రుడుగాని పుత్రికగాని పుట్టినమాత్రముననే "పున్నామనరక పితౄణాదికములు తొలగును, కనుక ప్రసూతాభర్తకన్న పుత్రావసరము అప్రసూతాభర్తకు ఎక్కువ గనుక అప్రసూతకు తక్కువకాలము



చెప్పబడినది. ప్రసూతాశబ్దమునకు 'పుత్రిణీ' యనిగాని 'సుపుత్రా' యనిగాని యర్థము కాదు. కనుక పుత్రులు మృతిబొందినను బ్రతికియుండి స్వధాకారులు కాకపోయినను నియోగము చెప్పబడినది.

'నష్టే మృతే' నియోగవిధి గాని వివాహవిధి కా దని పరాశరులవారు స్పష్టపఱిచినారు. ఎట్లనిన 'నష్టే మృతే'యను వచనము నుదాహరించి,

"ఔరసః క్షేత్రజ శ్చైవ దత్తః కృత్రిమక స్సుతః।"

అని క్షేత్రజునికి పుత్రత్వమును ఈయుగమున విధించి పౌనర్భవునికి నిషేధించినారు. ఇచ్చట ప్రతిపక్షులు పెక్కుకుకల్పనలు చేసినారు.

౧. 'నష్టేమృతే' వివాహవిధి యనియు,
౨. ప్రత్యేకము చెప్పినందున చెప్పిన నలువురలో నంతర్భావమనియు,
౩. అందు ఔరసునియం దంతర్భావ మనియు, కొందఱును;
౪. 'నష్టే' ధర్మ్య వివాహ మనియు,
౫. కనుక ఔరససంజ్ఞ యనియు, మఱి కొందఱును;

౬. 'నష్టే'చేత ఈయుగమున వివాహవిధి, అన్యవచనములచేత అన్యయుగముల వివాహవిధి, ఈ వచనముచేత ఔరసత్వము, అన్యవచనములచేత పౌనర్భవత్వము, అని మఱికొందఱును వాదించుచున్నారు.

ఉ॥ పరాశరులవారు కలియుగధర్మములను స్మరించిరిగాని కలియుగాతురములను స్మరింపలేదు. అసాధారణ ధర్మములను మాత్రము చెప్పెను, ఈధర్మమీ యుగమునకు మాత్ర మని యభిప్రాయ మగునుగాని ఈయక్షరములు ఈ యుగమునకు మాత్ర మని యభిప్రాయము కానేరదు.

ఈధర్మ మీ యుగమునకు మాత్రమ యనుటయును భ్రమయే. కానియెడల సహగమన బ్రహ్మచర్యములును పరాశరులవారు చెప్పుటచే, ఈయుగమునకు మాత్రమే యగును. గతయుగముల విధవలు చావనుంగూడదు బ్రతుకనుంగూడదు అని ధర్మ మగును. కనుక పరాశరులవారు చెప్పినవెల్ల అసాధారణ ధర్మములన గూడదు. కనుక ఈయక్షరములవలన గాని, ఈధర్మమువలన గాని, పౌనర్భవునికి అన్యసంజ్ఞ గలుగదు.

౨. ఆకథనముచే అపుత్రత్వము గలుగును. అపుత్రత్వముచే 'నష్టే' వివాహవిధిగాదు. 'నష్టే' వివాహవిధాన మయినను అపుత్రత్వము తప్పదు. అంతియకాని యంతర్భావమెట్లు సంభవించును ? అంతర్భావము కలిగిన, ఎవని

యందు ? ఉ॥ ఔరసునియందు. ప్ర॥ క్షేత్రజునియం దేలగారాదు ? కృత్రిమునియం దేలగారాదు ? ఇం దెవనితోగాని పౌనర్భవుని మిళాయించి క్రొత్త లక్షణములను పరాశరులవారు రచింపలేదు. 'శేషం ముని విభాషిత'మ్మని పౌనర్భవుని కేటాయించుచున్న ప్రాచీన లక్షణములనే చెప్పినారు. అవి 'నష్టే మృతే' యను శ్లోకము కలిగిన స్మృతిపురాణములయందే ఉన్నవి. నారద స్మృతియందు 'నష్టే' కలదు. అచ్చట పుత్రులు ౧౨ గురు చెప్పబడిరి. పౌనర్భవు డం దొకడు, వాడు ఔరసుడుగాడు, అదాయాదుడు, అపిండదుడు.

అగ్నిపురాణమున 'నష్టే'కలదు, అచ్చటను ౧౨ ఱుపుత్రులు చెప్పబడినారు, పౌనర్భవు డం దొకడు. ఔరసుడుగాడు-అదాయాదుడు-అపిండదుడు-వర్ణసంకరుడు-ఉదకక్రియాహీనుడు.

మనుస్మృతియందు 'నష్టే' ఉండెనట-దానియందును పుత్రులు ౧౨ ఱు-పౌనర్భవుడందొకడు - ఔరసుడుగాడు - అదాయాదుడు-అపిండదుడు - వర్ణసంకరుడు - విధవావివాహము పశుధర్మము. కనుక 'నష్టే' యను శ్లోకముచే పౌనర్భవునికి ఆసంజ్ఞ పోదు. ఔరసాద్యన్యతమసంజ్ఞయు గాదు-కనుక పరాశరస్మృతిలో పౌనర్భవుని కన్యునియందు అంతర్భావమనుట ప్రల్లదము. కనుక పరాశరస్మృతిచేత పౌనర్భవునికి ఈయుగమున అపుత్రత్వము గలుగుచున్నది. కనుక పరాశరస్మృతియందలి 'నష్టేమృతే' వివాహవిధిగాదు.

ఈ'నష్టే' అదాయాదత్వ - అపిండదత్వ - వర్ణసంకరత్వ - పశుత్వములను మాన్పలేదట - ఔరసత్వము నిచ్చునట! పరాశరులవారు ఔరసునికి, క్షేత్రజునికి, కృత్రిమునికి, 'శేషం ముని విభాషిత మ్మ'ని ప్రాచీనలక్షణములను అనగా పౌనర్భవుని వ్యావర్తించిన లక్షణములను చెప్పినారు. ప్రాచీనులు ౧౨ పుత్రులను చెప్పినారు. పౌనర్భవుని ఆ ౧౨ ఱలో నొకనినిగా ప్రత్యేకముగా చెప్పినారు. వాడు మఱి యెవనియం దైన నంతర్భూతుడైన, ౧౨ అనుసంఖ్య యెట్లు నిలుచును? వాని పృథక్త్వ మెట్లు నిలుచును. కనుక ౧౧ ఱ లక్షణములయందును పౌనర్భవుడు వ్యావర్తింప బడియుండుట నిశ్చయము. కనుక ఔరసలక్షణమునగాని, క్షేత్రజలక్షణమునగాని, కృత్రిమలక్షణమునగాని పౌనర్భవుడు ప్రవేశింపడు. ప్ర॥ అట్లయిన ప్రతిపక్షులు పౌనర్భవుని ఔరసునియందు చేర్చుటకు కారణమేమి ? ఉ॥ వారి ప్రజ్ఞావిశేషమువలన పౌనర్భవుని వ్యావర్తించుచున్న ఔరస లక్షణమునకు వారికి పౌనర్భవ పరముగా అపార్థము స్ఫురించినది. అట్లే పౌనర్భవుని వ్యావర్తించుచున్న క్షేత్రజలక్షణమునకుగాని, కృత్రిమ



లక్షణమునకుగాని పౌనర్భవ పరముగా అపార్థము స్ఫురించిన పౌనర్భవుడు క్షేత్రజుడో కృత్రిముడో అగును. ముగ్గుర లక్షణములకుగాని యిద్దఱ లక్షణములకుగాని యపార్థములు స్ఫురించిన, అప్పుడు ఒక దాని యపార్థమును మాత్రమే వెల్లడిచేయుదురు గాబోలును. ఇందువలన పౌనర్భవు డౌరసు డనుటకు అపార్థకల్పనకన్న వేఱె ఆధారము లే దని విశదము గదా.

“స్వే క్షేత్రే సంస్కృతాయాం తు స్వయ ముత్పాదయే ద్ధి యం।
త మౌరసం విజానీయా త్పుత్రం ప్రథమకల్పితమ్॥” మనుః.

“సంస్కరింపబడిన తన క్షేత్రమందు, తాను గన్న కుమారుడు ఔరసుడు పుత్రులలో నుత్తముడు, అని యెఱుగవలయును.”

“యాపత్యా వా పరిత్యక్తా విధవా వా స్వ యేచ్ఛయా।
ఉత్పాదయే త్పున ర్భూత్వా స పౌనర్భవ ఉచ్యతే॥” మనుః.

“పతిచే విడువబడిన దైనను, విధవ యయినను, స్వేచ్ఛచే పునర్భువై యెవనిని కనునో వాడు పౌనర్భవు డనబడును.” పరిత్యాగాదికము పరక్షేత్రత్వమును తెలుపును. పతిచే విడువబడినదాని సుతుడే పౌనర్భవుడుగాని, పతిని విడిచినదాని సుతుడు పౌనర్భవుడుకాడు అని యభిప్రాయముకాదు. అగునెడల,

“మృతే భర్తరి యా నారీ త్యక్తవ త్యథ తం స్వయం।
సవర్ణా జ్జనయే ద్గర్భం భర్తుః పౌనర్భవం సుతమ్॥” బ్రహ్మపురాణము.

మనుస్మృతిలో పతిచే విడువబడినదనియు బ్రహ్మపురాణమున పతినివిడిచినదనియును విరోధించును. విరోధపరిహారముకొఱకు లక్షణములయం దెల్లనసమగ్రత నంగీకరించుటకంటె పరిత్యాగా ద్యుపన్యాసము పరక్షేత్రత్వ మాత్రాభిప్రాయక మనుట శ్రేయము. 'వా పరిత్యక్తా' అనియు 'వా స్వ యేచ్ఛయా' అనియు పరిత్యాగస్వేచ్ఛలకు వికల్పము కల్పించినను విరోధము మానును. అప్పుడును విశేషణములు పరక్షేత్రత్వమాత్రప్రకాశకములే యగును.

ఇచట పతి పుత్రుని గనుట సాధారణము. సంస్కృతయందు గనుట సాధారణము. వీరిచే వ్యావృత్తి గలుగదు. సామాన్యవిశేష భావముచే నీసంజ్ఞలకు వ్యవహార మనుటకు, ఔరసునిగూర్చిన యేవిధియు పౌనర్భవునికిగాని వానిని గూర్చిన యేవిధియైనను ఔరసునికిగాని చెందదు. కనుక అన్యవిశేషణములచే వ్యావృత్తి గలుగవలయును. కనుక ఔరసలక్షణమందలి స్వక్షేత్రత్వమును పౌనర్భవలక్షణమందలి పరక్షేత్రత్వ పునస్సంస్కారములును వ్యావర్తకములు.

స్వక్షేత్రత్వము వ్యావర్తకము గానియెడల ఔరస లక్షణమునకు పౌనర్భవునియం దతివ్యాప్తి. పరక్షేత్రత్వ పునస్సంస్కారములు వ్యావర్తకములు గానియెడల పౌనర్భవలక్షణమునకు ఔరసునియం దతివ్యాప్తి కనుక స్వక్షేత్రత్వమును పరక్షేత్రత్వ పునస్సంస్కారములును వ్యావర్తకములు, "నష్టేమృతే" స్వక్షేత్రత్వమును గలుగజేయును. 'నష్టే'కలయాగ్నే యమందే "స్వకీయాపరకీయా చ పునర్భూ రితి కౌశికాః" అనగా పునర్భువు స్వీయ గాదు అనగా స్వక్షేత్రముగాదు అని చెప్పబడియున్నది. కనుక పరక్షేత్రత్వ పునస్సంస్కారములు ఔరససంజ్ఞ యొక్క యసంభవమునకును పౌనర్భవ సంజ్ఞయొక్క సంభవమునకును హేతువు. ఇట్లుండగా పరక్షేత్రత్వ పునస్సంస్కారములే ఔరససంజ్ఞయొక్క యసంభవమునకును పౌనర్భవసంజ్ఞయొక్క సంభవమునకును హేతువనుటకన్న అనగా పౌనర్భవు డౌరసు డనుటకన్న అజ్ఞాన మే మున్నది? కనుక పౌనర్భవుడు ఔరసుడు గాడు. ఇట్లే క్షేత్రజుడును గాడు. ఇట్లే కృత్రిముడును గాడు. కనుక ఈయుగమున పుత్రత్వమును పరాశరులవారు నిషేధించినారు. కనుక 'నష్టే మృతే' వివాహపరము కాదు.

ఇది వివాహ మయిన ధర్మ్యవివాహమే కదా యగును; పతియొక్క మరణమువలన తత్సంబంధము సర్వమును భార్యకు నశించునని పూర్వపక్షుల యభిప్రాయముగావున వైధర్మ్యసంబంధ మనగూడదు గావున "మృతేతు దేవరే దేయా" అనుటచే వదినె, మరదలు, సవతుతల్లి, భార్యతల్లి వీరలనెల్ల సంగ్రహింపవచ్చును. ఒకడే అల్లుడును మగడును కావచ్చును. నలుగురుకూతులతల్లిని వివాహము చేసికొనిన, అదిపోయిన, తరువాత, ఆపిల్లలను వరుసగా గాని, వరుసగా ఆపిల్లలను వివాహముచేసికొని తరువాత తల్లినిగాని వివాహమాడి ఏకపత్నీవ్రతమును నిర్వహించు చుండవచ్చును. మేనమామకూతును అతని భార్యను సంగ్రహింపవచ్చును. వయస్సుమాత్రము తక్కువయినం జాలును.

పినతండ్రిభార్యను, పెదతండ్రిభార్యను, పినతాతభార్యను, పెదతాత భార్యను, తాతయొక్క చిన్నభార్యను, "తదాభావే యథేచ్ఛయా" అనుటచే పెండ్లియాడవచ్చును. కాని,

ప్ర॥ ఈవివాహము క్షతలకా? అక్షతలకా?

ఉ॥ పరాశరులవారు ఈవిషయమున నూరకున్నారు. నారదులవారు ప్రసూతా, అప్రసూతా, అనుచున్నారు. కనుక నిది యందఱకును.

ప్ర॥ సంస్కారము కలదా లేదా?



ఉ॥ పరాశరులవారు ఊరకున్నారు. అక్షతయోనులకు కలదని మన్వాదులు. ఆమన్వాదులు చెప్పినసంస్కారము అధర్మ్యమగు పునర్భూసంస్కారము. ఇది ధర్మ్యము. "విధీయతే" "దోషో న విద్యతే" అనువచనములు ప్రమాణము. కనుక మన్వాదులు చెప్పిన యక్షతయోనికా సంస్కార మిచ్చుట కాదు. కనుక సంస్కారము లేదు.

ప్ర॥ సంస్కారము లేక పతియగునా?

ఉ॥ విధానసామర్థ్యముచే తక్కిన కార్యము లెల్ల జరిగించిన నగును.

ప్ర॥ విధానసామర్థ్యముచే సంస్కారమే గలుగరాదా?

ఉ॥ విధానసామర్థ్యముచేత గలిగిన క్షతయోనులకు సంస్కారమేది?

ఉన్నయెడల "చేదక్షతయోనిఃస్యాత్" ని యేల యుండును. మఱియు, "సాచేదక్షతయోనిఃస్యాత్" ననది ధర్మ్యవివాహమును ధర్మ్యసంస్కారమును చెప్పినను, 'నష్టే మృతే' అనుప్రమాణముచేత జరుగుకర్మయందు సంస్కారము లేదు. ఏలయనగా 'నష్టే మృతే" ప్రసూతలకునుంగూడ చెప్పబడినది. "సాచేత్" అక్షతయోనులకుమాత్రమే సంస్కారవిధి. కనుక "నష్టే మృతే" యనునది సంస్కారసంబంధముగల విధికాదు.

" నోదకేన న వా వాచా కన్యాయాః పతి రిష్యతే ।
పాణిగ్రహణ సంస్కారాత్ పతిత్వం సప్తమే పదే ॥"

"ఉదకదానముచేత గాని, వాగ్దానముచేత గాని, కన్యకు పతి గానేరడు. పాణిగ్రహణ సంస్కారముచేత సప్తమపదమునందు పతిత్వము."

అని యమపరాశరస్మృతులు చెప్పుచున్నవనియు, అట్లే నారదస్మృతియు చెప్పుచున్నవనియు, కనుక సప్తపదికి ముందు పతిసంజ్ఞ లేదనియు, "పతి రన్యో విధీయతే" యనగా అన్యపతి విధింపబడుచున్నాడు అనుటచే సంస్కారపూర్వకమగు వివాహమే చెప్పబడిన దనియు, పూర్వపక్షులు వాదించుచున్నారు. ఇందునకు సమాధానము - యమపరాశర స్మృతులయందే కాదు, అనేకస్మృతులయందు కొన్నిటియందు పతివాచక శబ్దముచేతను, కొన్నిటియందు భార్యావాచక శబ్దముచేతను, వివాహ సంపూర్తి సప్తపదిచేతనే గాని, తత్పూర్వము కాదని మహర్షులు చెప్పి యున్నారు. అంతయేగాని ఆవచనములు భార్యాపతుల నిర్వచనములుగావు. మనుస్మృతియందు,

" పాణిగ్రహణికామంత్రా నియతం దారలక్షణం ।
తేషాం నిష్ఠా తు విజ్ఞేయా విద్వద్భిః సప్తమే పదే ॥"

"పాణిగ్రహణ మంత్రములు నియతమయిన భార్యాలక్షణము, వాని యొక్కరూఢి సప్తమపదమున గలుగును" అని చెప్పబడియున్నది - యమాది స్మృతులయందు పతి శబ్దమును, మనుస్మృతియందు దారశబ్దమును చెప్ప బడినవి - రామునికి సీత భార్య యన్నను, రాముడు సీతకు భర్తయన్నను అర్థ భేదములేదు - కనుక సప్తపదికి ముందు పతిత్వములేని యెడల, వాగ్దానము మాత్ర మయిన వెనుక చచ్చినవానిని గూర్చి "యస్యా మ్రియేత కన్యాయా వాచా సత్యే కృతే పతిః" అని పతిశబ్ద ప్రయోగము అసంగత మగును. "యస్మై వాచా దత్తాస వివాహమంతరే ణాస్యాః పతి రిత్యనే నావగమ్యతే" ఎవని కొఱకు కన్య వాగ్దానము చేయబడెనో వాడు వివాహములేకయే దానికి పతియని యీవచనముచేత తెలియ జేయబడె నని, విజ్ఞానేశ్వర భగ వత్పాదులవారు వివరించి యున్నారు. వాగ్దాన మాత్రముచేతనే పతి గావుననే ఆస్త్రీకి అటుపైని నియోగము చెప్పబడినది - కనుక పైవచనములు భార్యా పతుల నిర్వచనములు గావు. మఱియు,

ఈ'నష్టేమృతే'యను శ్లోకము మనుస్మృతియం దుండెనని మాధవాచా ర్యులవారు చెప్పియున్నారు. పూర్వపక్షులు ఆమాటలు మిగుల ప్రియముగా గ్రహించియున్నారు. అందున్నదన్న మాటను ఇకమీదు వారు ఒప్పుకొనక పోయినను ఆశ్లోకము, మనువు చెప్పిననారదస్మృతియందు గలదు. నారద స్మృతియందు ఊఢయయిన యక్షతయోనికే పునస్సంస్కారము చెప్పబడి నది. మనుస్మృతియందును 'సా చే దక్షతయోనిః స్యా' త్తని అక్షతయోనికే పున స్సంస్కారము చెప్పబడినది. అగ్నిపురాణమందును పూర్వోక్త సమన్వయ ముచేత అక్షతయోనికే సంస్కారము చెప్పబడినది. ధర్మశాస్త్ర మిట్లుండగా 'పతి రన్యో విధీయతే' యను పతి శబ్దస్వారస్యముచేత సంస్కారము గలుగు ననుట యజ్ఞాన విలాసముగాక మఱియేమగును. ఉదాహృత వచనములు భార్యాపతుల నిర్వచనము లైనను క్షతోఢలసంస్కారము, "నష్టేమృతే"యను శ్లోకముగలస్మృతులయందే నిషేధింప బడియుండుటచే, 'పతి రన్యో విధీయతే' యనువచనమునకు పతిగా నన్యుడు విధింపబడుచున్నాడు, అనగా పతిచేయు కార్యము చేయుటకు, అనగా 'ఆపత్సు' అనుటచేత ఆపద సంతాన పరిక్షయము గాన, పుత్రోత్పాదనకొఱకు అన్యుడు విధింపబడుచున్నాడు అని యర్థ మని స్పష్టతరమై యున్నది. మఱియు పతిశబ్దమునకు పైవచనములు అర్థ మును చెప్పిన ఆశబ్దమునకు అన్యార్థము లేదని అది విధియగునా? భూపతిశబ్దము



కలదు గదా? భూమితో పాణిగ్రహణ సంస్కారమును ఎవడు పొందినాడు? స్వైరిణికి సంస్కారము లేదు గదా; స్వైరిణీపతిశబ్దమున కేమిగతి? పతిశబ్దప్ర యోగము నియోగపతియందును గల దని చూపబడినదిగదా. కనుక అన్యపతి యనగా, స్త్రీకి కౌమారపతియు, నియోగపతియు, ఇద్దఱే ధర్మ్యులుగాన నియోగపతి యేల యర్థము గారాదు?

ప్ర॥ సంస్కారము పతిలోకము కొఱకుగదా. పతిలోకమున నీపునర్భువు ఏపతితోనుండును? ఉ॥ నాభార్యయని ఒకచేయిపట్టి వాడు లాగను నాభార్య యని ఒకచేయిపట్టి వీడు లాగును.

" కేశాకేశి మహా ద్యుద్ధం బాహాబాహి పదాపది ।
ముష్టాముష్టి హరే ర్దగ్రే పునర్భూధవయో ర్భవేత్ ॥" మదీయము.

ప్ర॥ విధవ, తనభర్తృ కుటుంబము సర్వాత్మకముగా నశించిన, అప్పటికి తండ్రికుటుంబము నాశ్రయింప వలయునుగాని, భర్త పోయిన మాత్రముననే ఆ కుటుంబమును వదలగూడదు-అని నారదస్మృతి చెప్పుచున్నది. కనుకను, ఇహ మున క్షేత్రజపుత్రుడు చెప్పబడెను కనుకను, ఈయాపదలే నియోగ కారణ ములు గనుకను, వివాహముకొఱకు ఇది లాగులాడను, నియోగముకొఱకు వాడు తన్నులాడను, కన్నుల పండువుగా నుండును.

ప్ర॥ భర్త దేశాంతరము పోయిన యెన్ని గడియలకు ఈపునర్వివాహము? ఉ॥ పరాశరులవారు ఈవిషయమందు మౌనమును ధరించినారు. కనుక నిరీక్షణ కాలమును తెలిసి కొనుటకయి 'శేషం ముని విభాషిత మ్మ'ని స్మృత్యం తరమును గ్రహింప వలయును. ఈశ్లోకముతోడనే కాలము నారదస్మృతి యందు చెప్పబడియున్నది. కనుక దానినే గ్రహింపవలయును. దానివలన 'నష్టే మృతే' నియోగ విధి యని స్పష్టపడినదిగదా. కనుక పరాశరులవారు ఈయుగ మునకు నియోగమును చెప్పిరి గాని 'కేశాకేశి' మహాయుద్ధమును చెప్పలేదు.

'ప్రతిగృహ్య'యను పదమునకు అర్థము తెలియక ప్రతిపక్షులు,

"ప్రతిగృహ్య తు యః కన్యాం వరో దేశాంతరం వ్రజేత్ ।
త్రీ నృతూ న్సమతిక్రమ్య కన్యాఽన్యం వరయే ద్వరమ్ ॥" నారదః.

అను నారద వచనమును వ్రాసి "వివాహమాడిన వాడు దేశాంతరము పోయిన మూడు ఋతువులు చూచి ఆకన్య యన్యుని వివాహము చేసికొనవలయును" అని యర్థము వ్రాసి, యిందువలన పునర్వివాహమును సాధింప గోరుచున్నారు.

ఆప్రకారము మూడుఋతువులు చూచి తమభార్యలు అన్యులను వివాహము చేసికొనిన ఒప్పుకొందురు గాబోలును. ఆశ్లోకమునకు పదియవది—

"ప్రతిగృహ్య తు యః కన్యా మదోషా ముత్సృజే న్నరః ।
స వినేయ స్త్వకామోఽపి కన్యాం తా మేవ చోద్వహేత్ ॥" నారదః.

ప్రతిగ్రహమనగా వరణముగాని వివాహముగాదు. "కన్యను వరించి నిర్దోష యగుదానిని త్యజించినవాడు అకాముడైనను వానిని రాజు దండింపవలయును. ఆకన్యనే వాడు వివాహము చేసికొనవలయును" ఇందువలన ఎవరును మూడు ఋతువులకే తమభార్య లన్యుల వివాహ మాడుదు రేమో యని భయపడ నక్కఱలేదు.

సకలస్మృతులయొక్క యభిప్రాయమును ఆపదయందు నియోగముగాని వివాహముగా దని కాశికులవారు తెలియజేసినారు.

"ధర్మ్య ఏకఃపతిః స్త్రీణాం కౌమార ఇతి కౌశికః ।
ఆపత్సు చ నియోగేన సంతానార్థేఽపరః స్మృతః ।
గచ్ఛేత యా తృతీయం తు తస్యా నిష్కృతి రుచ్యతే ।
చతుర్థే పతితా ధర్మాత్ పంచమే బంధకీ భవేత్ ।
ఏవం గతే ధర్మపథే న వృణే బహుపుంస్కతామ్ ।
అలోకాచరితా దస్మా త్కథం ముచ్యేమ సంకరాత్ ॥" భారత.

"కౌమారాపూర్వవచనే" పాణినీయము ౪-వ అధ్యాయము. ౨-వ పాదము. ౧౩-వ సూత్రము. ఇందులవృత్తి, సిద్ధాంతకౌముది. "కౌమారేత్యవిభక్తికోనిర్దేశః, అపూర్వత్వేనిపాతనమిదమ్ 'అపూర్వపతిం కుమారీం పతిరుపపన్నః కౌమారః పతిః' అపూర్వపతియయిన అనగా, అదివఱకు పతినెఱుగనిది, అట్టికుమారిని పొందిన పతి కౌమారపతి.

"స్త్రీలకు కౌమారపతి యనగా ప్రథమపతి. అతడొక్కడే ధర్మ్యుడు" ఆపదలయందు నియోగముచేత సంతానముకొఱకు అన్యుడు చెప్పబడినాడు, మూడవవానిని పొందినదానికి ప్రాయశ్చిత్తము చెప్పబడినది; నాలుగవవానివలన ధర్మమునుండి పడిపోవును ; అయిదవవానివలన బంధకియగును ; ధర్మపద్ధతి యిట్లున్నదిగాన బహుభర్తలను కోరను లోకవిరుద్ధమయిన యీసంకరమునుండి యెట్లు తొలగింపబడుదును ?", ఇట్లని బహుభర్తల నీయవలదని మహేశ్వరుని వేడుకొనుచున్న నాఁడాయని చెప్పెను. కనుక నిది వ్యభిచారగర్హణము గాదు. మఱియు,



"విప్రదుష్టాం స్త్రియం భర్తా నిరుంధ్యా దేకవేశ్మని ।
యత్పుంసః పరదారేషు తచ్చైనాం చారయే ద్వ్రతం ।
సాచే త్పునః ప్రదుష్యే త్తు సదృశే నోపయంత్రితా ।
కృచ్ఛ్రం చాంద్రాయణం చైవ తదస్యాః పావనం స్మృతమ్ ॥" మనుః.

అని రెండు వ్యభిచారములకు ప్రాయశ్చిత్తము కలదు. ఇచ్చట నొకమారే ప్రాయశ్చిత్తము చెప్పబడినది - కనుక నిది వ్యభిచారగర్హణము గాదు.

"యది సా బాలవిధవా బలా త్త్యక్తాథ వాక్వచిత్ ।
తదా భూయస్తు సంస్కార్యా గృహీతా యేనకేనచిత్ ।
త్యక్త్వా భర్తృగృహం గచ్ఛే ద్యది దోషం వినా పునః ।
భర్త్రా సా సంస్కర్తవ్యా ప్రాయశ్చిత్తాదిభిః క్రమాత్ ॥" బ్రహ్మపురాణము.

అని పునర్భువునకు ప్రాయశ్చిత్తము చెప్పబడియున్నది. ఇందువలన ఆపదలయందు నియోగముగాని పునర్వివాహము గాదని స్పష్టము. ఆపదయందెల్ల నియోగమే చెప్పబడినది. వివాహ మెచ్చటను చెప్పబడలేదు. అట్లే మనుస్మృతి - "అతః పరం... యోషితాం ధర్మమాపది," అని యాపద్ధర్మముల యారంభము - తరువాత నియోగవిధానమును వివాహ నిషేధమును వినతరువాత 'ఆపద్యపత్యప్రాప్తిశ్చ' అని నియోగము ఆపదయందు విధింపబడినది. భారతమందును, 'కాంక్షంతే పుత్రమాపది' ఆపదయందు సంతానమును గోరుదురు అని నియోగము చెప్పబడెను. 'ధర్మ్య ఏకపతిః' అను ప్రమాణము ఆపదలయందు నియోగమును విధించి వివాహమును నిషేధించినది. అచ్చటనే నియుక్తుడు పతియని వ్యవహరింపబడినాడు, కనుక ఆనియోగమందు ప్రధానుడు దేవరుడు గాన 'ద్వితీయోవరో దేవరః' అను యాస్కకల్పిత వ్యుత్పత్తియు సంగతించియున్నది.

శ్రు॥ "కో వాం శయుత్రా విధవేవ దేవరం మర్యం న యోషా కృణుతే సధస్థఆ."

ఈ ఋక్కు పునర్వివాహమును చెప్పుచున్నదని ప్రతిపక్షులు ఒక కల్పన చేసినారు.

ఇందులకు శాయనభాష్యము.

హే అశ్వినౌ, వాం = యువాం, కో-యజమానః, సధస్థే = సహస్థానే వైద్యాఖ్యే, ఆకృణుతే=ఆకురుతే=పరిచరణార్థ మభిముఖీకరోతి.

తత్రదృష్టాంతౌ దర్శయతి, శయుత్రా = శయనే, విధవేవ = యథామృతభర్తృకా నారీ, దేవరం భర్తృభ్రాతర మభిముఖీకరోతి.

మర్యం న=యథాచసర్వం మనుష్యం, యోషా = సర్వానారీ, సంభోగ కాలే అభిముఖీకరోతి, తద్వ దిత్యర్థః ॥

దీనియర్థము.

శయనమందు విధవ దేవరుని అభిముఖుని చేసికొనునట్లు,

ఓయశ్వి దేవతలారా మిమ్ములను ఏయజమానుడు అభిముఖులను చేసికొనుచున్నాడు?

ఇచ్చట శయనే అనుపదము సంగమమునే చెప్పునుగాని వివాహమును చెప్పదనియు, విధవాశబ్దము నియుక్తయం దన్వయించినట్లు పునర్వివాహిత యందు అనగా సధవయందు అన్వయింపదనియు, పునర్భువు శయనమందు దిధిషువును గూడినట్లు అనక విధవ శయనమందు మగనిభ్రాతను అభిముఖుని చేసికొనునట్లు అనుటచే నియోగ మనువదింపబడె ననియు సులభముగా తెలియుచున్నది. పునర్వివాహమును చెప్పు స్మృతివచనములయందు దేవర శబ్దము పత్యర్థము ఎక్కడను అగపడదు.

"యా పత్యా వా పరిత్యక్తా విధవా వా స్వ యేచ్ఛయా ।
ఉత్పాదయే త్పున ర్భూత్వా స పౌనర్భవ ఉచ్యతే ॥
సా చేదక్షతయోనిః స్యా ద్గత ప్రత్యాగతాపివా ।
పౌనర్భవేన భర్త్రాసా పునస్సంస్కార మర్హతి ॥
మృతే భర్తరి యానారీత్యక్త వత్యథ తం స్వయం ।
సవర్ణా జ్జనయే ద్గర్భం భర్తుః పౌనర్భవం సుతం ॥
యది సా బాలవిధవా బలాత్త్యక్తా థవాక్వచిత్ ।
తదాభూయ స్తు సంస్కార్యా గృహీతా యేనకేనచిత్ ॥
యా పూర్వం పతిం విత్త్వా అథాన్యం విందతే పతిం ।
సమానలోకోభవతి పునర్భవా పరః తిః ।
బాలికాక్షతయోన్యో శ్చ వరేణాన్యేన సంస్కృతిః ॥"

నియోగమును చెప్పువచనములయందు సాధారణముగా దేవరశబ్దము లేనిచోటే లేదు.

"దేవరాచ్చ సుతో త్పత్తి ర్దత్తా కన్యా న దీయతే ।
యస్యా మ్రియేత కన్యాయా వాచా సత్యే కృతే పతిః ।
తామనేన విధానేన నిజో విందేత దేవరః ॥



ఉత్తమా ద్దేవరా త్పుంసః కాంక్షంతే పుత్రమాపది ।
దేవరా ద్వా స పిండాద్వా స్త్రియా సమ్య జ్నియుక్తయా ।
ప్రజేప్సితాధిగంతవ్యా సంతానస్య పరిక్షయే ॥"

బ్రహ్మపురాణముకూడ స్త్రీపునర్వివాహమును చెప్పి "యది సా బాలవిధవా" అను శ్లోకమునకు వెంబడి కలియుగమునకు దాని నిషేధించుచు,

"స్త్రీణాం పునర్వివాహ శ్చ దేవరా త్పుత్రసంతతిః ।
స్వాతంత్ర్యం వా కలియుగే న కర్తవ్యం కదాచన ॥"

అని ఒక్క చోటనే పునర్వివాహమందు దేవర ప్రశంస చేయక, నియోగమందే చేసియున్నది. కొన్ని స్థలములయందు దేవరశబ్దముకూడ లేక అన్నభార్యయను మాట మాత్రముచేతనే నియోగధర్మము చెప్పబడినది.

"ఊఢాయాః పునరుద్వాహం జ్యేష్ఠాంశం గోవధం తథా ।
కలౌ పంచ న కుర్వీత భ్రాతృజాయాం కమండలుమ్ ॥"

స్వైరిణీలక్షణమునగూడ

"మృతే భర్తరి తు ప్రాప్తా న్దేవరాదీ నపాస్య యా ।
కామా త్స మాశ్రయే దన్యం సా ద్వితీయా ప్రకీర్తితా ॥"

విధవ నిష్కామురాలై దేవరుని ఆశ్రయింప వలయును అని నియోగమే చెప్పబడినది.

ఇందువలన పునర్వివాహమందు దేవర ప్రసక్తి లే దనియు నియోగమున దేవర ప్రాధాన్య మనియు స్పష్టపడినదిగదా.

"భ్రాతు ర్మృతస్య భార్యాయాం యోఽనురజ్యేత కామతః ।
ధర్మే ణాపి నియుక్తాయాం సజ్ఞేయో దిధిషూపతిః ॥" మనుః.

అని యిచ్చటను నియోగమున విధవయు, దేవరుడును, చెప్పబడిరి—శ్రుతియందును విధవయు, దేవరుడును, సంగమమును చెప్పబడినవి—కనుక శ్రుతి నియోగమునే చెప్పుచున్నదనియు దేవరశబ్దస్వారస్యముచేత "మృతే తు దేవరే దేయా" అను వచనముకూడ నియోగమునే చెప్పుచున్న దనియు స్పష్టము.

మఱియు,

"మృతే తు దేవరే దేయా" అనునదియే పునర్వివాహవిధాయక మయిన పునర్వివాహమందును దేవరుడే ప్రధానమును దేవరార్థికమును పాతకమును

యగును. దేవరుడు భ్రాతృభార్యను వివాహము చేసికొనిన పౌనర్భవుడును, నియోగమాశ్రయించిన క్షేత్రజుడును పుట్టునుగాన,

‘పూర్వాభావే పరః పరః’

అను ప్రమాణముచే క్షేత్రజుడు లభించుచుండగా పౌనర్భవుని కోరకూడదని విధించుచున్న శాస్త్రమే, పౌనర్భవుడు లభించుచుండగా క్షేత్రజుని కోరకూడదని విధించుచున్నదని చెప్పవలసి వచ్చును.

క్షేత్రజుడు, పౌనర్భవుడు అను నిరువురిలో నొక్కని కోరుకొనవలసినపుడు, ఉత్తముడైన క్షేత్రజుని కోరవలదు. అపిండదుడును, అదాయాదుడును అయిన పౌనర్భవునే కోరుడు అని శాస్త్రమే శాసించుచున్నదని ఎట్లు చెప్పవచ్చును ?

“ధనం యో బిభృయాద్భ్రాతు ర్మృతస్య స్త్రియ మేవ వా ।
సోఽపత్యం భ్రాతు రుత్పాద్య దద్యా త్తస్యైవ తద్ధనం ॥” మనుః.

చచ్చినభ్రాతయొక్క ధనమును భార్యను ఎవడు భరించునో వాడు వానికే పుత్రునిపుట్టించి ఆపుత్రునికే ఆధనమును ఇయ్యవలయును. అను వచనముచే దేవరుడు వివాహము చేసికొనుటకు ఎంతమాత్రమును అవకాశము లేదు. నియోగమే విధింపబడుచున్నది. కనుక “మృతే తు దేవరే దేయా” అనునది నియోగమునే చెప్పుచున్నది. కనుక “నష్టేమృతే” అనునది నియోగ విధాయకముగాని వివాహ విధాయకముగాదు. ‘తదభావే యథేచ్ఛయా’ యనుచోట ‘తదభావే’ అనగా దేవరుడు లేనియెడల అనుటచేతను నియోగార్థమే నిశ్చయపడుచున్నది. ఎట్లనిన; వివాహమునకైన దేవరు డున్నమాత్రమున నతనికిచ్చుట సందర్భింపదు. అదివఱకే అతనికి వివాహమైనయెడలను, ఆమెకన్న చిన్నవాడైనను వివాహము సంభవింపదు. అత డున్నయెడల నతనికే యిమ్మని యీవచనము చెప్పుచున్నది. ఇట్టి విరోధము కలుగుచున్నది. కనుక వివాహమే యభిప్రాయమైన, దేవరు డున్నయెడల నతని కియ్యవలె నని చెప్పకూడదు. మఱి యేమనిన దేవరుడు ఆమెకు వివాహయోగ్యుడైనయెడల అతనికియ్యవలెను అని చెప్పవలెను.

‘యవీయసీ ముద్వహే’దిత్యాది విశేషవచనములు దీనిని బాధించు నను నెడల, వానిని ఇదియే యేల బాధింపగూడదు. కనుక ‘తదభావే’ అనియే యుండవచ్చునని చెప్పగూడదు. నియోగమునకైనయెడల ఈ యాక్షేపములు లేవు. కనుక అభావశబ్దస్వారస్యముచేతను “మృతే తు” అను వచనమును అందువలన



‘నష్టే’యను వచనమును నియోగమునే విధించుచున్నవని ఇందువలన సిద్ధాంతపడినది.

శూద్రకమలాకరమందును ‘నష్టేమృతే’ నియోగపరమని వక్కాణింపబడియున్నది.

కనుక “పతి రన్యో విధీయతే” అనగా నియోగపతి విధింపబడుచున్నాడని, లేక అన్యుడు పతిగా అనగా పుత్రోత్పాదనకొఱకు విధింపబడుచున్నాడు అని వ్యాఖ్యానము నిరవద్యము. ఇందువలన, మను వసిష్ఠ నారదాగ్ని పరాశరుల వారలు, నాశమరణ క్లీబతలయందు క్షతలకును అక్షతలకును నియోగమును విధించి వివాహమును నిషేధించినారనియు, వాగ్దత్తకును శుల్కదత్తకునుగూడ నియోగాంగముగు దేవరకర్తృక వివాహమును చెప్పి అన్యునికొఱకు దానమును నిషేధించినారనియు, పౌనర్భవుడు, అదాయాదుడు, అపిండదుడును అనియు, వాడు చచ్చిన, వాని నుదకక్రియలు లేవనియు, వానితల్లి వానితండ్రికి స్వకీయ గాదనియు, అనగా నుంచుకొన్నదనియు, పునర్వివాహము వర్ణసంకరమనియు, పశుధర్మమనియు, పశుధర్మము వివేకులచే గర్హింపబడినదనియు, స్పష్టముగదా. విధవలకపవాద మనుటయు, అక్షతయోనులకపవాద మనుటయు కువాదమనియు, స్పష్టముగదా. “న ద్వితీయ శ్చ సాధ్వీనాం” “న వివాహవిధా వుక్తమ్” అనువచనములకు అపవాదము లేదనియు, వానివలన వేదమున పునర్వివాహవిధి లేదనియు, ఎచ్చటనైనను ఆ ప్రస్తావము కలిగిన, అది యనువాదమో, అర్థవాదమో గాని, విధికాదనియు, స్పష్టముగదా. ధర్మశాస్త్రమిట్లు చెప్పుచుండగా వేదముననే పునర్వివాహవిధానముకలదనుటకన్న కువాదమేమికలదు !

## ప్రతిపక్షులు శ్రుతివచనములకుం జేయుకుత్సితార్థములకు నిరాసము.

ప్రతిపక్షులు పునర్వివాహ నిషేధములనుగూడ పునర్వివాహవిధులని యుదాహరించుచున్నారు. భారద్వాజసూత్రము అపరకర్మలు.—

సూ॥ అత్ర పత్నీ ముపనిపాతయంతి, ఇయం నారీతి.

శ్రు॥ ఇయం నారీ పతిలోకం వృణానా నిపద్యత ఉపత్వా మర్త్యప్రేతం.
విశ్వం పురాణ మనుపాలయంతీ తస్యై ప్రజాం ద్రవిణం చేహ ధేహి॥

సూ॥ తాం పతిత్థ ఏకధనేన అన్యోవా బ్రాహ్మణ ఉత్థాపయ త్యుదీర్ష్వ నారీతి॥

శ్రు॥ ఉదీర్ష్వ నా ర్యభి జీవలోక మితా సు మేత ముప శేష ఏహి.
హ స్తగ్రాభస్య దిధిషో స్త్వ మేతత్ పత్యు ర్జనిత్వ మభిసంబభూవ ॥

ఇందులకు శాయనభాష్యము.

హేమర్త్య, యానారీ మృతస్య తవ భార్యా, సా, పతిలోకం, వృణానా = కామయానా, ప్రేతం = మృతం, త్వాం, ఉపనిపద్యతే = సమీపేనితరాం

ప్రాప్నోతి, కీదృశీ, పురాణం విశ్వం = అనాదికాలప్రవృత్తం స్త్రీధర్మం, అను=క్రమేణ, పాలయంతీ, పతివ్రతానాం స్త్రీణాం పత్యా సహైవ వాసః పరమోధర్మః. తస్యై=ధర్మపత్న్యై, త్వం, ఇహలోకే వాసార్థమనుజ్ఞాందత్త్వా, ప్రజాం = పూర్వం విద్యమానాంపుత్త్రాదికాం, ద్రవిణం=ధనంచ ధేహి = సంపాదయ, అనుజానీహీత్యర్థః ॥

హేనారి, త్వం, ఇతాసుం = గతప్రాణం, ఏతం = పతిం, ఉపశేషే= ఉపేత్యశయనంకరోషి, ఉదీర్ష్వ = అస్మాత్పతిసమీపాదుత్తిష్ఠ, జీవలోకమభి =జీవంతం ప్రాణిసమూహ మభిలక్ష్య, ఏహి=ఆగచ్ఛ, త్వమ్, హస్తగ్రాభస్య =పాణిగ్రాహవతః, దిధిషోః=పునర్వివాహేచ్ఛోః, పత్యుః, ఏతత్, జనిత్వం=జాయాత్వం, అభిసంబభూవ = ఆభిముఖ్యేనసమ్యక్ప్రాప్నుహి.

"ఓమనుష్యుడా, ఏస్త్రీ మృతుడవయిన నీభార్యయో, ఆమె, పతిలోకమును కోరుచున్నదై, మృతుడవయిన నీసమీపమున పడియున్నది. ఎట్టిదై పడియున్నదనగా, అనాది కాలప్రవృత్తమయిన స్త్రీధర్మమును వరుసగా పరిపాలించుచున్నదై. పతివ్రతలైనస్త్రీలకు పతితోడనే నివాసముకదా ఉత్కృష్టధర్మము. ఆధర్మపత్నికి నీవు ఈలోకమందు నివాసముకొఱకు, అనుజ్ఞ నిచ్చి పూర్వమందున్న పుత్త్రాదులను ధనమును కలుగజేయుము. అనుజ్ఞ యిమ్ము అని యర్థము" ఈమంత్రము చెప్పి పతియొద్ద భార్యను పడవేయవలయును. ఇందు "పూర్వం విద్యమానాం పుత్త్రాదికాం" అనుటచే బ్రహ్మచర్యమునకు అనుజ్ఞ కోరబడుచున్న దనియు, పునర్వివాహగంధ మయినను దీనియందు లేదనియును స్పష్టము.

ఇట, ప్రజామ్ అనగా 'పూర్వం విద్యమానాం ప్రజామ్'అను భాష్యము మూలవిరుద్ధమనియు, 'ప్రజాం ధేహి' అనగా క్రొత్తగా సంతానమును పడయుటకు అనుజ్ఞ యిమ్ము అని యర్థ మనియు, 'తస్యై ప్రజామ్' ఆమెకు సంతానమును అనుటచే, నియోగమువలన బుట్టినసంతానము వచ్చినవానికి చెందునుగాని ఆమెకు చెందదుగాన, పునర్వివాహమువలన సంతానము బొంద ననుజ్ఞ ప్రార్థింపబడెననియు ఈమంత్రము అపుత్రకకేగాని సపుత్రకకు లేదనియు, వేదమునకు విద్యారణ్యాదుల భాష్యములను తిరస్కరించి డిక్షనేరీలచేత ఇష్టార్థకల్పన చేయువారియొక్క వాదము. ఇందు, ఈమంత్రము అపుత్రకకే యనుట కేవలము పొల్లు. ఇది సకలస్త్రీలకును సహగమనమంత్రము. సహగమనము అపుత్రకకేయనుట యజ్ఞానము. పితృమేధసారము చతుర్థఖండము. "అనుమరణేచైవమ్, అత్ర స్నాత్వా, శక్తితో దత్త్వా, బ్రాహ్మణైరభ్యనుజ్ఞాతా, చితిం గతం భర్తారం ప్రదక్షిణీకృత్య, ప్రణమ్య, చితిమారుహ్య, భర్తుర్దక్షిణపార్శ్వేశయీత, అత్రకర్తా పత్నీ ముపనిపాతయ తీయంనారీతి."



"సహగమనమందు ఈ ప్రకారము చేయవలయును, ఇక్కడ స్నానముచేసి, యథాశక్తి దానముచేసి, బ్రాహ్మణులవలన ననుజ్ఞ పొంది, చితిమీదనున్న భర్తను ప్రదక్షిణముచేసి నమస్కరించి, చితిమీద నెక్కి భర్తయొక్క దక్షిణపార్శ్వమున శయనింపవలయును. ఇచ్చట కర్తయయినవాడు 'ఇయంనారి'యనుమంత్రముచెప్పి పత్నిని పరుండబెట్టవలయును." సహగమనము చేయుదానికి పుత్త్రాది ప్రార్థన ఏలయనగా ఆమెతో వియోగము సహింపలేక సహగమనము నంగీకరింపని కర్తయొక్క వచన మిది. ఈ మంత్రద్వయము అపుత్రకేయని సూత్రమందు లేదు. సహగమనమంత్ర మగుటచేత సకల స్త్రీలకును అయినందున, సపుత్రకలకు అని వేఱేమంత్రము చెప్పబడనందున,ఇది అపుత్రకేయనుట కవిత్వముగాని వేఱు గాదు. భాష్యమందును, 'పూర్వం విద్యమానాం పుత్త్రాదికామ్' అని యున్నది. కనుకను అపుత్రకకే యనుట కవిత్వముగాక మఱియేమి? భాష్యము మూల విరుద్ధ మనుట కువాదము. క్రొత్తసంతానమునే కోరినట్లుండిన, చచ్చినవానిని గూర్చి ప్రార్థించుచు, వాని కుపయోగించు సంతానమును ప్రార్థింపక, ఎవడో మఱియొకని కుపయోగించు సంతానముకొఱ కెవడైనను వానిని ప్రార్థించునా? ఈ విధవకు నియోగసంతానము చెందదనుటయు, పౌనర్భవ సంతానము చెందు ననుటయు, ప్రల్లదము; ఏసంతానమయినను, 'భర్తుఃపుత్త్రం విజానంతి' యను ప్రమాణమునుబట్టి, భర్తదియే గాని, యీ విధవది గాదు. ఒకవేళ దీనిది ఆయెనా, పౌనర్భవుడు ఎంతమాత్రము దీనికిచెందునో, అంతమాత్రము నియోగజుడును చెందును. అందులోను క్రొత్తసంతానమునే కోరినయెడల, ఉత్తముడయిన క్షేత్రజునిగోరక, అధముడైన పౌనర్భవుని ఏవిధవ గోరును? అందువలనను, 'ఓప్రేతా-మఱియొకనికయిన నుపయోగించునట్టి - నీకు ఉపయోగింపని-సంతానమును కనుటకు ఈ విధవకు అనుజ్ఞ యిమ్ము." అనగా నీముందఱి యన్నము ఎవనికైనపెట్టి నీవు పొమ్ము, అని మనుష్యుడయినవాడెవడును ప్రార్థనచేయడు గనుకను, డిక్షనేరీ కల్పవృక్షములచేత అర్థముచేసినను, ఈ శ్రుతి పూర్వపక్షుల కుపయోగింపదు. కేవలము నియోగమయిపోవును. మఱియు, క్రొత్తసంతానముకొఱకే ప్రార్థనయయిన అనుజ్ఞాతమయిన పిదప అధర్మ్యము కాకయుండగా విధవలనుద్దేశించి మనువు పంచమాశ్వాసమున,

" 3. అపత్యలోభాద్యా తు స్త్రీ భర్తార మతివర్తతే ।
సేహ నిందా మవాప్నోతి పతిలోకాచ్చ హీయతే ॥
అనేకాని సహస్రాణి కౌమార బ్రహ్మచారిణాం ।

దివం గతాని విప్రాణా మకృత్వా కులసంతతిమ్ ॥
మృతే భర్తరి యా నారీ బ్రహ్మచర్యే వ్యవస్థితా ।
సా మృతా లభతే స్వర్గం యథా తే బ్రహ్మచారిణః ॥
నాన్యోత్పన్నా ప్రజాస్తీహ న చాప్యన్య పరిగ్రహే ॥" మనుః.

అని యింతస్పష్టముగా అపత్యార్థమయి యన్యునిగూడుటను ఎట్లు నిషేధించును ? మఱియు క్రొత్తసంతానముయొక్కగాని క్రొత్త వివాహముయొక్కగాని అవసరము ప్రతి విధవకును గలిగియుండునా ? ఈ మంత్రము ప్రతివిధవకును చెప్పవలసినదేగదా? మఱియు నీమంత్రము వివాహమునే అనుగ్రహించు నెడల, సహగమనముచేయని విధవకెల్ల పునర్వివాహమే సంభవించును గావున, సకల స్మృతులును అమితముగ పొగడుచున్న బ్రహ్మచర్యమునకు ఏమూల నవకాశము ? మొదట సహగమనమునకే ఎక్కడ నవకాశము ? మఱియు, ఈ మంత్రములు అపుత్త్రికకు మాత్రమే అగు నెడల సపుత్త్రికలకు సహగమనము లేదా? అపుత్త్రికకే యీమంత్రము లని వాదించుచునే పూర్వపక్షులు అపుత్త్రికకు సపుత్త్రికకు సకల విధవలకు పునర్వివాహమును స్థాపించుటయు, వారిలో మఱికొందఱు అక్షతయోనికి మాత్రమే స్థాపించుటయు, సకల విధవలకును ఈ మంత్రములు కల వనుచు కొందఱు పూర్వపక్షులు అక్షతయోనులకు మాత్రమే ఈ వివాహమును సిద్ధాంతపఱుచుటయు మిగుల ఆశ్చర్యకరముగా నున్నది. కనుక ఇది నియోగముచేతగాని వివాహముచేతగాని క్రొత్త సంతానముకొఱకు ప్రార్థన గాదని వివేకులకు విశదము. కనుకనే విద్యారణ్యులవారు "పూర్వం విద్యమానాం పుత్త్రాదికాం ప్రజామ్" అని భాష్యముచేసినారు. కనుక ఈమంత్రము పునర్వివాహ సాధకమనుటకన్న గారుడము వేఱు లేదు.

"ఓ స్త్రీ నీవు మృతుడైన ఈపతియొద్ద పడియున్నావు. పతియొక్క యీ సమీపమునుండి లెమ్ము. జీవించుచున్న ప్రాణిసమూహమును గూర్చిరమ్ము." ఇంతవఱకు పునర్వివాహప్రశంస లేదుగదా. "నీవు పాణిగ్రాహవంతుడును, పునర్వివాహమును కోరుచున్నవాడును, అయిన పతియొక్క యీజాయాత్వమును, తప్పకుండ బాగుగపొందుము." ఈమంత్రము చెప్పి పతి హితుడుగాని, మఱియొక బ్రాహ్మణుడుగాని ఒకసువర్ణముతో ఆమెను లేవదీయవలయును. ఇది పునర్వివాహమును విధించుచున్నదట. ఇహలోక నివాసమునకే ప్రేతయొక్క యనుజ్ఞ కావలసి యుండగా, పునర్వివాహమున కతనియనుజ్ఞ యక్కఱలేదా. ఇహలోక నివాసమునకై యతని యనుజ్ఞను పొంది తరువాత యుక్తిచమత్కారముచేత పునర్వివాహము చేసికొనవలసినదా ? ఇంతటుక్కు పూర్వులకును దెలియునా? మొదటిమంత్రము ప్రేతనుసంబోధించి చెప్పినది, ఇహలోకమున నుండ ననుజ్ఞ యిమ్మని ప్రార్థన. రెండవమంత్రము స్త్రీని సంబో-



ధించి చెప్పినది; ఇహలోకమున నుండ ననుజ్ఞ పతి ఇచ్చినట్టుగా భావించుకొని, కర్త స్త్రీకి, ఇహలోకమున నుండు మని చేయుబోధన. నాపతితోడ గూడ నేను పోక అతని నెట్లు వదలియుందు నను నాశంకయందు, నీ విచట నిలిచిన మాత్రమున, నీభార్యాత్వము పోదు, అతడు నిన్నే కోరుచుండును. నీవు అతని లోకమును తప్పకుండ పొందుదువు అని సమాధానము.

మఱికొన్నికుకల్పనలకు సమాధానము.

హస్తగ్రాభుడు అనగా ప్రాణిగ్రాహుడు. హకారమునకు భకారము ఛాందసము. పాణిగ్రాహు డనగా ప్రాణిగ్రాహము చేసికొనినవాడు గాని, చేసికొనబోవువాడు గాడు. పాణిగ్రాహమనగా వివాహము.

"బాల్యే పితు ర్వశే తిష్ఠే త్పాణిగ్రాహస్య యౌవనే ।
పుత్రాణాం భర్తరి ప్రేతే న భజేత్ స్త్రీ స్వతంత్రతామ్ ॥" మనుః

"యౌవనమందు పాణిగ్రాహము చేసికొనిన వానివశమున నుండవలయును." చేసికొన బోవువానివశమున నుండు మని విధిగాదు. చేసికొనక ముందు చేసికొనబోవువా డెవడో ఎట్లు తెలియును ?

"పాణిగ్రాహస్య సాధ్వీ స్త్రీ జీవతో వా మృతస్య వా ।
పతిలోక మభీప్సంతీ నాచరే త్కించి దప్రియమ్॥" మనుః.

"పాణిగ్రాహము చేసికొన బోవువాడు చచ్చినను" అనియిచ్చట అర్థమగునా? చచ్చినవా డెక్కడనయిన పాణిగ్రాహము చేసికొనుటకలదా? చేసికొనినవా డర్థముగనుకనే విద్యారణ్యులవారు 'పాణిగ్రాహవతః' పాణిగ్రాహవంతునియొక్క, అని వివరించినారు. ఒకడు "ధనవాన్ భవిష్యామి" అని యుదాహరించి మతుప్పు భవిష్యదర్థక మనెను. అతడు 'భవిష్యామి'యొక్క యర్థమది యని యెఱుగవలయును. ఇందువలన, 'పాణిగ్రాహవతః' అనుపదముచేత ప్రేతభర్త చెప్పబడెనుగాని, రాబోవువాడు చెప్పబడలేదని స్పష్టము. ఈయర్థమును 'పాణిం గృహీతవతః' 'ఇదివఱకే పాణినిగ్రహించిన వాడయిన' అని భూతార్థక మయిన క్తవతు ప్రత్యయమును ప్రయోగించి భట్టభాస్కరులవారు స్పష్టపఱిచినారు.

'దిధిషు' వనగా రూఢిచేత మాఱుమనువుదానిని వివాహము చేసికొనినవాడు. "పునర్భూర్దిధిషూరూఢా ద్వి స్తస్యా దిధిషుః పతిః" అమరము. వాడే యిచ్చట అర్థమయిన, అదివఱకు ఒక మాఱుమనువుదానిని వివాహము చేసికొనిన వాడేగాని విధవకు పనికిరాడని ధర్మ మగును. అట్లయిన పునర్వివాహము అసంభవ

కల్ప మగును. అట్లువ్రాయక విద్యారణ్యులవారు "పునర్వివాహేచ్ఛోః" అని వివరించినారు. పునర్వివాహేచ్ఛు యనగా మరల నుద్వహింప గోరువాడు, అదివఱకు వివాహమయి మరల వివాహము కోరుచున్న మఱియొకడు అర్థమైన ఉభయులకు సరిగానుండునుగాని, 'ఏతజ్జాయాత్వం' బాధించును. స్వర్గమున వివాహములు జరుగవనియు, పునర్వివాహేచ్ఛువనగా ప్రేతయనుట యసంగత మనియు, పూర్వపక్షులకుశంక.

"అష్టౌవివాహావర్ణానాం సంస్కారార్థం ప్రకీర్తితాః।" నారదః. "వర్ణములకు సంస్కారముకొఱకు ఎనిమిది వివాహములు చెప్పబడినవి" అను ప్రమాణము వలన సంస్కారముకన్న వివాహము వేఱుగాన, పరలోకమున దేహభేదముగాన, సంగమమే అచట వివాహ మనబడె నని గ్రహింపవలయును. పునర్వివాహేచ్ఛు వనగా ఈ విధవకు పునర్వివాహమగునాయని కోరువాడట. పునర్వివాహము శాస్త్రీయమయిుల, ఈస్త్రీ వివాహయోగ్యతకలదైయుండిన, సహజముగా దీనికి పునర్వివాహమును గోరువారు, తండ్రి, అన్న, తమ్ముడు మొదలగువారును. తల్లి, అక్క, చెల్లెలు, మొదలగు వారును. ఇందెవరికి ఈమె భార్యాత్వమును పొందవలయును? కనుక "పునర్వివాహము కోరుచున్న" అనునర్థమునకు పూర్వపక్షులు చేర్చిన "ఈమెయొక్క" అనునది చాలలేదు. కనుక, "పునర్వివాహేచ్ఛు" వనగా "ఈవిధవకు మరల వివాహమగునా యనియు, ఆ వివాహము వలన నిది తనభార్యయగునాయనియును కోరువాడు" అని యొక కథయంత యర్థమును కల్పించినారు. ఆ శబ్దమున ఈయర్థము లే దని చెప్పవలసినదిలేదు. ఇంతయర్థము దానియం దున్నను, ఏతజ్జనిత్వము బాధించును. కనుక ప్రేతయం దు పునశ్శబ్ద మన్వయించునుగాని అన్యులయం దన్వయింపదు. పాణిగ్రహణము చేసికొనినవాడు, (పైలోకమందు) మరల నుద్వహింపగోరువాడును అయిన పతియొక్క యీ భార్యాత్వమును తప్పకుండ బాగుగా పొందు మని యర్థము.

'దిధిషోః'అనగా 'గర్భస్యధాతుః' అని భట్టభాస్కరభాష్యము. పాణిగ్రహణముచే క్షేత్రియు గర్భాధానముచే ఉత్పాదకుడును అగును. 'భర్తుఃపుత్రం విజానంతి' యని యుభయధా భర్తృత్వము చెప్పబడినదిగాన, క్షేత్రియు, గర్భధాతయు, ఉభయధా, పత్యుః భర్తయైనవానియొక్క యని యర్థము. వేదమునకు, ఋషులవంటి విద్వాంసులుచేసిన భాష్యములను నిరసించి, నైఘంటుకార్థములను చెప్పుటకన్న జఘన్య మేమున్నది? నిఘంటువులు ఆధునికములు. వేద మనాది. వేదమందలిమాటల యర్థములు లోకమున



మాటిమాటి, బహుకాలము వ్యవహరింపబడిన వెనుక, ఏదో ఒక యర్థమున రూఢములైనవెనుక నిఘంటువులయందు ఆ చిట్టచివరయర్థము వ్రాయబడుచున్నది. ఒకప్పుడు, వేదమందును లోకమందును ఒకటేశబ్ద మున్నను, ఆ శబ్దము వేదమందలి సరూపశబ్దముతోను దానియర్థముతోను ఏవిధమయిన సంబంధమును లేక ప్రత్యేకముగా లోకమందే పుట్టి లోకమందలి యర్థముతో వేఱుశబ్దము అయియుండును. ఇట్లుండగా నిఘంటువులను ప్రమాణీకరించి తద్విరుద్ధభాష్యములను నిరసింపవచ్చునా? దిధిషు శబ్దమునకు 'గర్భస్యధాతా' యను నర్థమందు ప్రాచీన వ్యవహారము చూడ వచ్చును. భాగవతము, ౬౭౩-వ పుట.

"వ్యవాయకాలే దదృశే వనౌకో దంపతీ ద్విజౌ।
క్షుధార్తో జగృహే విప్రం తత్పత్న్యాహాకృతార్థవత్ ॥
న భవాన్ రాక్షసః సాక్షాదిక్ష్వాకూణాం మహారథః।
మదయంత్యాః పతిర్వీర నాధర్మం కర్తుమర్హసి ॥
ఏవం కరుణభాషిణ్యాః విలపంత్యాః అనాథవత్।
వ్యాఘ్రః పశుమివాఖాదత్సౌదాసః శాపమోహితః॥
బ్రాహ్మణీ వీక్ష్య దిధిషుం పురుషాదేన భక్షితం।
శోచంత్యాత్మాన ముర్వీశమశపత్కుపితాసతీ ॥
యస్మాన్మే ఖాదితో౽పాపః కామార్తాయాః పతిస్త్వయా।
తవాపి మృత్యురాధానాదకృతప్రజ్ఞ దర్శితః ॥"

"దిధిషుం గర్భస్య ధాతారం" అని శ్రీధరీయవ్యాఖ్య — ఏభాష్యమును చూడబోయినను విధవావివాహ పరముగా వివరించునది ఒకటియైనను లేదు.

ఏతజ్జనిత్వం అనగా ఈ భార్యాత్వము అనగా ఇప్పుడు నీయం దెవనిసంబంధము గలభార్యాత్వముకలదో వానిసంబంధముగల భార్యాత్వము. ప్రతిపక్షులు ఏతజ్జనిత్వ మనగా ఏతాదృశ భార్యాత్వము, అని యపార్థమును కల్పించినారు. ఏతచ్ఛబ్దమునకు "ఈ" యర్థమనియు, "ఇట్టి" యర్థముకాదనియు సంస్కృతభాష యెఱిగినవారికి చెప్ప నక్కరలేదు. పాణిగ్రాహము చేయక ముందు, పాణిగ్రాహము చేయబోవువాడు అనునిశ్చయము లేదుగదా, పరలోకమున మరల ఈమెనే భార్యనుగా కైకొనక ముందుమాత్రము, అనిశ్చయమెట్లు కలుగును? వివాహసంస్కారము పతిలోకముకొఱకేగదా పుట్టినది. ఉంచుకొనుటకు సంస్కార మేల?

"ప్రేత్యభావేపి కల్యాణః సంగమో మే సహాత్వయా ॥" రామాయణము.

"ఏతస్మాత్కారణా ద్రాజన్ పాణిగ్రహణమిష్యతే ।
యదాప్నోతి పతిర్భార్యా మిహలోకే పరత్రచ ॥" భారతము.

అనువచనములను స్మరించుకొనవలయును. ఇందువలన ఈరెండు శ్రుతులును, బ్రహ్మచర్యమును చెప్పుచున్నవని స్పష్టము.

మఱియు సూత్రముచేత వేదార్థమును తెలిసికొనవలయును గాని డిక్షనేరీ వలన గాదు. భారద్వాజ సూత్రములో ఈ రెండు మంత్రములను చెప్పి లేవవేసినపయిన, అపుటలోనే, "యావజ్జీవం ప్రేతపత్న్యాః, ఉదకస్పర్శన, మేకభుక్తం, అధశ్శయ్యా, బ్రహ్మచర్యం, క్షారలవణవర్జనం చ॥" అని యావజ్జీవము బ్రహ్మచర్యమును విధించియున్నారు. మొట్టమొదట 'ఇయంనారీ' యని పునర్వివాహమున కనుజ్ఞగోరి పిమ్మట 'ఉదీర్ష్వనారి' యని పునర్వివాహము చేసికొందువు లేచిరా యని తీసికొనివచ్చి, తరువాత యావజ్జీవమును బ్రహ్మచర్యమును విధించుటకు భారద్వాజులవారికికూడ ఇంతటుక్క తెలియునా? పైసూత్రము యావజ్జీవమును బ్రహ్మచర్యమును విధించుచుండగా పూర్వసూత్రానీతములగు శ్రుతులు పునర్వివాహ విధాయకములనుటకన్న కువాద ముండునా? బ్రహ్మచర్యవిధానముచే ఈశ్రుతులు పునర్వివాహమును మూల ముట్టుగా నిషేధించుచున్నవని యెఱుగవలయును.

శ్రు॥ "య దేకస్మి న్యూపే ద్వేరశనే పరివ్యయతి తస్మా దేకో ద్వే జాయే విందతే। య న్నైకాగ్ం రశనాం ద్వయో ర్యూపయోః పరివ్యయతి తస్మా న్నైకా ద్వౌ పతీ విందతే."

"ఎందుచేత ఒకయూపమునకు రెండురశనలను చుట్టుదురో, అందుచేత ఒకడు ఇద్దఱు భార్యలను వివాహము చేసికొనును; ఎందుచేత ఒకరశనను రెండుయూపములకు చుట్టరో, అందుచేత ఒకతె యిద్దఱు భర్తలను వివాహము చేసికొనదు." దీనియందు ఏకకాలమం దనిగాని, భిన్నకాలమునం దని గాని, కాలనియామకశబ్ద మేమియును లేదు. కనుక ఏక కాలమునందును భిన్న కాలము నందును, ఒకతె యిద్దఱు భర్తలను వివాహముచేసికొనదు. అని యీశ్రుతి యొక్క యర్థము.

ఇందు పూర్వపక్షులుచేసిన యర్థములు.

౧. పూ॥ ఏకకాలము చెప్పబడినది అని యొక కల్పనచేసి, ఆకల్పన యాధారముగా, ఈశ్రుతికి, ఏకకాలమున ఇద్దఱు భర్త లుండరని యర్థమనియు, అందువలన భిన్నకాలముల నుందురని భావమనియు కనుక నిది విధవావివాహ విధి యనియు, మొదటిది.



ఉ॥ ఏకకాలమున నిద్ద ఱుండ రనుటచే, భిన్నకాలమున నుందు రని యభిప్రాయము కానేరదు. అగునేని, ఏకకాలమున అనునంశము సర్వత్ర సంబంధించునుగాన, ఏకకాలమున నొకనికిద్దఱు భార్య లుందురను పూర్వభాగార్థమునకును, భిన్నకాలముల నుండ రని యభిప్రాయముకాదా? ఇద్దఱు భార్య లుందు రనుటచే ముగ్గు రుండ రనియు, ఇద్దఱు భర్తలుండరనుటచే ముగ్గు రుందు రనియు ఏల యర్థముకాదు?

౨. పూ॥ లోకములో ఒకని కిద్దఱు భార్యలు అనగానే ఏకకాలమున అని యర్థమనియు, అట్లే ఇక్కడను, ఏకకాలము చెప్పబడినది అనియు, రెండవ చమత్కారము.

ఉ॥ ఒనికిద్దఱుభార్యలు అను వాక్యములో కలరు అనుక్రియ అధ్యాహార్యమనియు, అధ్యాహార్యమయిన యస్త్యర్థక ధాతువుయొక్క మహిమచే ఏకకాలమర్థ మయినదనియు, రామయ్యకు ఇద్దఱుభార్యలు పోయినారు అనుచోట, ఏకకాలము అర్థముకావలసిన నియమము లేదనియు, రంగయ్యకు ఇరువదిసంవత్సరములు అనగా ఇదివఱకు వరుసగా గడచిన సంవత్సరములసంఖ్య ఇరువది గాని, ఏకకాలమున ఇరువదిసంవత్సరములు గావనియు, ఆమెకు ఏనమండ్రు కుమారులు పుట్టినారు అనుచోట ఏకకాలమున అని యర్థము కాదనియు, ఏక కాలమున కాదగినదానికి ఏకకాలమునను, భిన్నకాలముల గాదగినదానికి భిన్నకాలములను, ఉభయథా కాదగినదానికి ఉభయకాలమును, అనునర్థము కాలనియామక శబ్దములేనప్పుడు కలుగుననియు, ఇక్కడ కాలనియామకశబ్దము లేదుగావున, అస్త్యర్థకధాతు వధ్యాహార్యముకాదు గావునను, ఈకార్యము ఉభయథా జరుగదగినది గావునను, ఇచ్చట, ఉభయకాలములయందు అనునర్థము, లభించుచున్న దనియు, వివేకులయినవారికి చెప్పనక్కఱలేదు.

3. పూ॥ అగ్నిష్ఠమను యూపమునుగూర్చిన మంత్రమిది. దీనిని గూర్చిన శ్రౌతసూత్రము "అగ్నిష్ఠంద్వాగ్ భ్యాంరశనాగ్ భ్యాం పరివీయ" "అగ్నిష్ఠమునకు రెండురశనలనుచుట్టి" అనునది. ఈకార్యము ఏకకాలముననే జరుగును. కనుకనిచ్చట ఏకకాలమే అభిప్రేతము అని మూడవది.

ఉ॥ అగ్నిష్ఠమునకు ఏకకాలమున రెండురశనలనుచుట్టుట యథార్థమేగాని ఆరశనా పరివ్యయమునకు మంత్ర మిదియనుటమాత్రము అజ్ఞానవిలసితము. ఇది మంత్రముగాదు, అర్థవాదము. పరివ్యయనమంత్రము వేఱే యున్నది. ఈయర్థవాదము అగ్నిష్ఠముతో సంబంధముకలదైనను అగ్నిష్ఠమున కుపయోగింపని యంశమం దుండకూడదా? కూడనియెడల అగ్నిష్ఠమునకును వివాహమునకును ఏమి సంబంధము? ఒకరశనను రెండుయూపములకు చుట్ట రనువంశమునకును

అగ్నిష్టోమమునకును ఏమిసంబంధము? కనుక అగ్నిష్టోమప్రయోగమాత్రమే యిందుఁ డవలయు నను నియమములేదు. కావున భిన్నకాలముకూడ నర్థముకావచ్చును. పరివ్యయనము అప్రస్తుతముగాను, వివాహము ప్రస్తుతముగాను, ఇందు చెప్ప బడినది. దానిచేతనైనను ఇది అగ్నిష్టోమమంత్రముగాదని బుద్ధిమంతులు గ్రహింప వచ్చును. కనుక శ్రుత్యభిప్రాయమేమనిన, ఏప్రకారము ఒక యూపమునకు ఏకకాలమునను భిన్నకాలములను బహురశనలను చుట్టుదురో, ఆప్రకారమే ఒకనికి ఏకకాలమునను భిన్నకాలములను, బహుభార్యలుందురు. ఏప్రకారము ఒకరశనను ఏకకాలమునను భిన్నకాలములను, బహుయూపములకు చుట్టరో ఆప్రకారమే ఏకకాలమునను భిన్నకాలములను, ఒకతెకు బహుభర్తలుండరు అని ఉభయకాలములును అర్థముకాక తప్పదు. కనుక నిది పునర్వివాహనిషేధ మని నిశ్చయము.

'తస్మాదేకస్య' యనుశ్రుతి స్త్రీపునర్వివాహవిధాయక మని ప్రతిపక్షులు చెప్పుచున్నారు. అది పొరబాటు. ప్రకరణమువలన దానియథార్థము తెలియును.

“ఋక్చవా ఇద మగ్రే సామ చాస్తాం సైవ నామ ఋగాసీత్, అమో నామ సామ, సావా ఋ క్సా మోపావద న్మిథునం సంభవావ ప్రజాత్యాఇతి. నేత్య బ్రవీ త్సామ, జాయాన్వా అతోమమ మహిమేతి. తేద్వేభూత్వో పావదతామ్. తేన ప్రతిచన సమవదత. తా స్తిస్రో భూ త్వోపావదన్. త త్తిసృభిస్సమ భవత్, య త్తిసృభి స్సమభవ త్తస్మా త్తిసృభిస్తువంతి తిసృభిరుద్గాయంతి తిసృభిర్హి సామసమ్మితమ్. తస్మా దేకస్య బహ్వ్యో జాయా భవంతి నైకస్యా బహవ స్సహ పతయః యద్వై వ్తత త్సా చామ శ్చసమభవతామ్, తత్సామాభవత్॥”

“మొట్టమొదట, ఋక్కును సామయు ఉండెను. ఋక్కునకు సా అని పేరును, సామకు అముడు అని పేరును ఉండెను. మనమిద్దఱము సంతానము కొఱకు భార్యాభర్తలముగా కలియుదము అని ఋక్కైన సా సామతో అనెను. వలనుపడదు నీకంటె నాకుమహిమ యెక్కువ అని సామ చెప్పెను. వారు(సా) ఇద్దఱై చెప్పినారు. సామ ఒప్పుకొనలేదు. వారు (సా) ముగ్గురై చెప్పినారు. సామ ముగ్గురితోను కలసెను. ఎందుచేత సామ మూడు ఋక్కులతో కలసెనో అందుచేత మూడుఋక్కులతో స్తుతిచేయుదురు. మూడు ఋక్కులతో ఉద్గానము చేయుదురు. ముగ్గురతోగదా సామ కూడుకొనెను. అందుచేత ఒకనికి పలువురు భార్య లుందురు. ఒకతెకు ఏకకాలమున పలువురు పతు లుండరు. సాయును అముడును ఎందుచేత కలసికొనిరో అందుచేత సామయను పేరుకలిగినది.” ఇది శాయనభాష్య సమ్మతమైన యర్థము.



ముగ్గురతోకదా సామ కూడుకొనెను. అందుచేత ఒకనికి పలువురు భార్య లుందురు. అని వేదము చెప్పుచున్నది. ఇచ్చట బహుభార్యాకరణమునకు సామ యొక్క యుదాహరణము హేతురూపముగా చెప్పబడినది. మూడుఋక్కులును ఏకకాలమున సామకు భార్యలయినవి. భిన్నకాలములగాలేదు. సా ఒకతెయే గదా ముగ్గురయినది. కనుక ఏకకాలమున బహుభార్యలు ఒకని కుందురు అనియే యర్థము. భిన్నకాలముల అనగా, ఒకతె గతించినవెనుక మఱి యొకతె, ఇట్లు వరుసగా భార్యలుందురని వివరించుట మిగుల తప్పు. ఎందుచేత ననగా ఏకభార్యను సామగ్రహింప ననెను. “జ్యాయాన్వా అతోమమ మహిమేతి” నామహిమ నీ మహిమకంటె ఎక్కువగదా అనిచెప్పి ఒకతెను సామ గ్రహింపదాయెను. ఒక్కతె సామకు చాలదాయెను. కనుక సా ఇద్దఱా యెను. ఇద్దఱును ఒకతెయయిన వెనుక మఱియొకతెయై యిచ్చట చెప్పబడిన యెడల ఒకతె చాలకపోయె ననుట యసంగతము. వరుసయందు ఒకతెయే గదా అనగా చాలనిదియేగదా లభించును. ఇద్దఱు సామకు చాలనందున సా ముగ్గురాయెను. సామకు ముగ్గురు చాలిరి. సామ ముగ్గురతో కలసికొనెను. అట్లయిన ఒకతెనుగాని, ఇద్దఱనుగాని ఎవడును గ్రహింపకూడదా యనిన, ఇది విధిగాదు. భిన్నకాలములయందు ఒకతెకు పలువురు భర్తలుందురని యిచ్చట అర్థము చెప్పకూడదు. ఎందుచేతననగా ఇచ్చట ఒకతె ఒకనికే చాలదని చెప్ప బడుచున్నది.

ఒకతె ఒకనికి చాలనందున, అనేకభార్యలను ఒకడు గ్రహించును, ఒకతె ఒకనికే చాలనందున అనేకభర్తలను ఒకతె గ్రహింపదు, అని ఈశ్రుతికర్థము. స్పష్టార్థమయి యుపసంహారమందు సహాశబ్దము ప్రయోగింపబడినది. ఏకకాలమే సామోదాహరణమందు చెప్పబడియుండుటచే ఆ సహాశబ్దము పూర్వార్థమునకుగూడ అనగా పురుషవిషయమందునుంగూడ అన్వయించును. ఇట్లని విద్వాంసులు వ్యాఖ్యానము చేసియున్నారు. పురుషవిషయమున ఏకకాలమును భిన్నకాలములునుంగూడ చెప్పబడినయెడల స్త్రీవిషయమున భిన్నకాలమున పతులుందురని యర్థమగును. పురుషవిషయమున ఏకకాలమే చెప్పబడినదిగాని భిన్నకాలము ఎంతమాత్రమును చెప్పబడలేదని విశదముగదా. కనుక భిన్నకాలసంబంధమయిన యర్థము స్త్రీవిషయమున గలుగదు. భిన్నకాలమున బహుపతులుందురేని ఒక్కతెను సామ ఏలగ్రహింపలేదు. (న)సహా యనుటచే భిన్నకాలముల నుందురని యర్థ మగునేని (న)బహవః అనుటచే ఏకకాలమున ఇద్దఱు భర్త లుందురనియు (న)ఏకస్యాః అనుటచే అనేక స్త్రీలకు ఏకకాలమున అనగా ఉమ్మడిగా బహుభర్తలుందురనియు (న)పతయః అనుటచే ఉపపతు లనేకు లుందురనియును అర్థమగునా? కనుక చెప్పినంతయే గ్రహింపవల

యును గాని విపరీతవ్యాఖ్యలు చేయగూడదు. సామోదాహరణము వరునకు పనికిరాదు. యాగపద్యమె యిచట పురుషవిషయమునను స్త్రీవిషయమునను, తస్మాత్తని సామోదాహరణమునకు హేతుత్వమును చెప్పుటచే చెప్పబడినది గావున, దీనివలన విధవావివాహము సాధ్యముగాదు. వరుసగా బహుపతులను గ్రహించిన అవివాహములెల్ల శాస్త్రీయములైన అపతులందఱితోడను స్వర్గలోకమున పాణిగ్రహణ సంస్కారమహిమచేత ఉండవలయును గాన, పరలోకమున అట్టి స్త్రీకి సహపతు లనేకు లుందురు. నైకస్యాబహవః అని యీ శ్రుతియే యేకకాలమున బహుపతులను నిషేధించుచున్నది. కనుక నిది వరుస పతుల నంగీకరించెనేని, సహపతులను విధించునదియు, నిషేధించునదియు, ఈ శ్రుతియే అగును. ఇట్టి విరోధములు ప్రతిపక్షుల కేల యగపడవు. ఈశ్రుతి విధవావివాహమునకు బొత్తిగా సాధనము కాదని యిందువలన స్పష్టము. కొందఱు సహాశబ్దము సాదృశ్యవాచకమనియు, సహపతులనగా సదృశులయిన పతులని యర్థమనియు చెప్పినారు. సదృశులయిన పతులనగా అర్థమేమని యడుగగా వివాహము చేసికొనిన పతులని ఉత్తరము చెప్పినారు. "వివాహము చేసికొనిన" అను నీయర్థము సహాశబ్దప్రయోగములేకయే "బహ్వోవ్యజాయాః" అను చోటంబోలె పతిశబ్దమాత్ర ప్రయోగముచేతనే సంభవించును. మఱియు సాదృశ్యమిచ్చట "వివాహముచేసికొనుట" యని యెట్లు తెలియును, అని యాక్షేపింపగా, సామోదాహరణమున యాగపద్యము చెప్పబడియేయుండగా మరల వివాహవిషయమందు ఏల చెప్పవలయును? ఆయర్థమును చెప్పకయే లభించునుగదా యని బదు లాక్షేపించినారు. ఇందునకు సమాధానమేమనగా విధేయాంశము దృష్టాంతమున గమ్యమయినను దార్ష్టాంతికమున ముఖ్యముగా వాచ్యమై యుండవలయును. కనుక సాదృశ్యార్థ మసంగతము.

ఆధర్వణవేదమునుండి.

"యా పూర్వం పతిం విత్త్వా అ థాన్యం విందతే పతిం । పంచౌదనం చ తా వజం దదాతో న వియోషతః । సమానలోకో భవతి పునర్భువా పరః పతిః । గౌజం పంచౌదనం దక్షిణా జ్యోతి షగ్ం దదాతి ॥" అని యుదాహరించి,

అజాపంచౌదన దానమువలన పునర్భువును దిధిషువును, సమానలోకమున నుందురని యర్థమును వ్రాసి ఇది విధవా వివాహసాధక మని చెప్పుచున్నారు. ఇది వివాహసాధకమయిన,

"పరిప్రియాహివః కారిః కామ్యాం సంశ్రావ యేత్తి స్త్రియం ।
సా తం కామయతే కామ వాత్ర కార్యా విచారణా॥" అగ్నిపురాణము.



"పరిప్రియాహీత్యాది యజుస్సును తాను కామించిన స్త్రీకి వినబడునట్లు చదివిన, ఆమె యతనిని కామించును, ఇందులకు సంశయము లేదు" అనునది వ్యభిచారవిధాయక మేల గాదు ?

ఈపాపులకు ఏకలోక నివాసముకొఱకు ఒకదానవిశేషము చెప్పబడియున్న నుండవచ్చునుగాని, వివాహము ధర్మ్యమని చెప్పబడలేదు. దీన, సంస్కారహీనులై, చాతుర్వర్ణ్యములో చేరక ఈపునర్వివాహనిషేధములకు గుఱికాని జాతుల స్త్రీలు ద్వితీయభర్తను గ్రహించిన, వారలకు గతి చెప్పబడియుండునే కాని, యిది సాధ్వులకెల్ల పునర్వివాహవిధి గాదు. మఱియు ఇది వివాహ సాధకమయిన, "యన్మేమాతా ప్రలులుభే విచరం త్యపతివ్రతా తన్మేరేతః పితా వృఙ్క్తామ్" అనునదియు వ్యభిచారవిధాయక మగును. పూర్వపక్షులు ఇద్దఱు భర్తలతో తృప్తి తీరక పదుగురు పదునొకండ్రు భర్తలనుం గూడ వేదమువలన సాధించుచున్నారు.

అధర్వవేదమునుండి,

"ఉత య త్పతయో దశ స్త్రియాః పూర్వే అబ్రాహ్మణాః ।
బ్రహ్మా చే ద్ధస్త మగ్రహీత్ । స ఏవ పతి రేకధా ।
బ్రాహ్మణా ఏవ పతి ర్న రాజన్యో న వైశ్యా త త్సూర్యః ప్రబ్రువా నితి
పంచేభ్యో మానవేభ్యః॥"

అని యుదాహరించి, "పూర్వము బ్రాహ్మణులు కానివారు పదిమంది భర్తలైనను బ్రాహ్మణుడు గనుక హస్తమును గ్రహించెనా, వాడొక్కడే పతి. బ్రాహ్మణుడేగాని రాజుగాడు వైశ్యుడుగాడు; ఇట్లు సూర్యుడు ఐదుగురు మానవులకు చెప్పుచున్నాడు;" అని యర్థము వ్రాసి ఈవచనము ఏకాదశ వివాహములను స్త్రీకి విధించుచున్నదని వాదించుచున్నారు.

ఈ పతిత్వము ఐహికమా ఆముష్మికమా ? ఐహిక మయిన, కడమ పదుగురుగాని, అందు కొందఱుగాని, ఒకడుగాని, ఉండగానా పోయినవెనుకనా? ఉండగానే అయినయెడల, బ్రాహ్మణుడు, క్షత్రియ వైశ్యశూద్రుల యొక్క భార్యలను, బాలకులు అన్యు లడుగుదు రను భయముచేత చేతనున్న ఫలమును ఎంగిలిచేసినట్లు, వారికి పనికిరాకుండ నొకక్షణములో చేయవచ్చును. ఇదియే శ్రుత్యర్థమయిన పలుగురకిది కల్పవృక్షము. పోయిన వెనుకనే అయినయెడల బ్రాహ్మణుడు గ్రహించిన బ్రాహ్మణుడే పతి యని చెప్పవలయునా ? పోయినవెనుక ఇహమున ఎవడు గ్రహించిన వాడే

పతిగాడా? ఆముష్మికమయిన, ఈపదుగురలో అజాపంచోదనమిచ్చినవాడా బ్రాహ్మణుడా? బ్రాహ్మణుడే అయిన అజాపంచోదన ఫలమేమి? ఈబ్రాహ్మణు నితరువాత నలుగురు బ్రాహ్మణులు దానిని గ్రహించిన అప్పు డది ఎవరిది? వీ రందఱును, 'వారవధూశిఖామణిని వంతులు బెట్టుక స్వీకరింపుడీ, మీరును మీరుమీరు మఱి మీరును మీరును మీరు మీరునుఙ్,' అని పూర్వులు చెప్పినట్లు జరిగింతురా? లేక సుందోపసుందోపాఖ్యానమగునా? తరువాత కొందఱు రాజన్యులు కొందఱు వైశ్యులును వచ్చిన, వారు చచ్చిన, అప్పు డెవనిది? ఇట్టిప్రమాణములను వ్రాయుటచేతనే పూర్వపక్షులది కన్యాఏతి వాదమని విశద మగుచున్నది. ఇది వైశ్య శూద్రకన్యలను పలువురు అడిగిన బ్రాహ్మణు డునుం గూడనడిగిన వానికేగాని యితరుల కీయగూడదని చెప్పుచున్న దని తోచుచున్నది. ఈయధర్మమును, ధర్మశాస్త్రములయందు ఒకటి నిషేధించి మఱియొకటి నిషేధింపకపోలేదు. పరమాధర్మమయినను, జరిగినను జరుగక పోయినను, పూర్వయుగములయందు పౌనర్భవునికి బంధుత్వమువూత్ర మంగీకరిం పబడినది. ఈయుగమున నదియును పరాశరులవారిచేత నిషేధింపబడినదిగదా. బృహత్పరాశరులవారును,

పరపూర్వాగర్హణము.

"పరపూర్వాస్త్రియాః పుత్రా న పిండం నోదకక్రియాః ।
కన్యాయాః పూర్వభర్తా చ ధర్మాధర్మౌ వవాప్యతే॥"

'పరః పూర్వః పతి ర్యస్యాః సా పరపూర్వా,' పూర్వ మింకొక పతి కలిగి యుండినస్త్రీ పరపూర్వా. దానికి పుత్రులు లేరు; పుత్రులుపుట్ట రని యర్థము కానేరదు గావున, పుట్టెడువారికి పుత్రత్వము లేదని భావము. పుత్రత్వము లేదనుటచే జాతిసంస్కారాదులు లే వనిభావము. పరపూర్వకు పుత్రులు లేరు గాన పిండోదకక్రియలు లేవు. కన్యావస్థయందు వివాహమాడిన పూర్వభర్తయు ధర్మాధర్మములను పొందును; అని స్పష్టపఱచిరి.

ఇచ్చట పుత్రులు పూర్వభర్తవలన గలిగినవారు చెప్పబడి రనగూడదు. అట్లయిన, అదియే ఋషిహృదయమయిన భర్తృశబ్దమునకుంబోలె పుత్రశబ్దమున కును విశేషణమేల ప్రయోగింపబడదు. మఱియు నిచట పునర్భూమాత్రమే నిషేధింపబడెనని గాని స్వైరిణిమాత్రమే నిషేధింపబడెనని గాని చెప్పకూడదు. అట్లయిన పునర్భూశబ్దమేగాని స్వైరిణీశబ్దమేయేల ప్రయోగింపబడదు?

ఈనిషేధమును తప్పించుకొనుటకయి పూర్వపక్షులు పరపూర్వయనగా తక్కువవానిని వదలి యెక్కువవానిని సేవించుచున్న స్త్రీయని యపార్థమును



కల్పించినారు. వారి కాయపార్థమెట్లు లభించె ననిన, మనుస్మృతిలో "న ద్వితీయశ్చ సాధ్వీనాం క్వచిద్భర్తోపదిశ్యతే" అను పునర్వివాహ నిషేధప్రకరణ ములో-సరి యే రెండవపతి కూడదు, ఎక్కువజాతివానిని వివాహము చేసి కొనుట మిక్కిలి ప్రశస్తమని శాస్త్రము చెప్పుచున్నదిగదా, అరెండవపతి ఎక్కువ జాతివాడైనను కూడదా యను నాకాంక్షయందు,

"పతిం హిత్వాపకృష్టం స్వ ముత్కృష్టం యా నిషేవతే ।
నిం ద్యైవ సాభవే ల్లోకే పరపూర్వేతి చోచ్యతే ॥" మను.

"క్రిందిజాతిపతిని విడిచి మీదిజాతిపతిని ఎవతె సేవించునో అది లోక మున నింద్యయే యగును. పరపూర్వయనియును చెప్పబడును." అని మనువు చెప్పియున్నాడు. ఇచ్చట ప్రతిపక్షులకు ఉత్కృష్టాపకృష్ట పరపూర్వాశబ్ద ములకు అర్థము తెలియలేదు. ధర్మశాస్త్రములలోను అందులో మనుస్మృతి లోను ఉత్కృష్టాపకృష్టశబ్దములు జాతిపరములు.

౧. "జాత్యుత్కర్షో యుగేజ్ఞేయః ।" యాజ్ఞవల్క్యులవారు.
౨. "నోత్కృష్టశయ్యాసనయో ర్నాపకృష్టస్య చారుహేత్ ।"
[మార్కండేయపురాణము.

మనువు:—

"అక్షమాలా వసిష్ఠేన సంయుక్తా ధమయోనిజా ।
సారంగీ మంద పాలేన జగా మాభ్యర్హణీయతామ్ ॥"
3. "ఏతా శ్చాన్యా శ్చ లోకేస్మి న్నపకృష్టప్రసూతయః ।
ఉత్కర్షం యోషితః ప్రాప్తాః స్వైః స్వై ర్భర్తృగుణైః శుభైః ॥"
౪. "తపోబీజ ప్రభావై స్తు తే గచ్ఛన్తి యుగే యుగే ।
ఉత్కర్షం చాపకర్షం చ మనుష్యే ష్విహ జన్మతః ॥"
౫. "యో లోభా దధమో జాత్యా జీవే దుత్కృష్టకర్మభిః ।
తం రాజా నిర్ధనం కృత్వా క్షిప్రమేవ ప్రవాసయేత్ ॥"
౬. "శరః క్షత్రియయా గ్రాహ్యః ప్రతోదో వైశ్య కన్యయా ।
వసనస్య దశా గ్రాహ్యా శూద్ర యోత్కృష్టవేదనే ॥"
౭. "కన్యాం భజంతీ ముత్కృష్టం న కించిదపి దాపయేత్ ।
జఘన్యం సేవమానాంతు సంయతాం వాసయేద్గృహే ॥"
౮. "శుచిరుత్కృష్ట శుశ్రూషు ర్మృదువా గనహంకృతిః ।
బ్రాహ్మణాద్యాశ్రయో నిత్య ముత్కృష్టాం జాతి మశ్నుతే ॥"

౯. “సహాసన మభిప్రేప్సు రుత్కృష్టే నాపకృష్టజః ।
కట్యాం కృతాంకో నిర్వాస్యః స్ఫిచం చా స్యావకర్తయేత్ ॥”

ఇట్లు ఉత్కృష్టాపకృష్ట శబ్దములు జాతిపరములుగానే ప్రయోగింపబడుచున్నవి. కుల్లూకభట్టాచార్యులవారును ఆ రెండు శబ్దములను జాతిపరములుగానే వివరించియున్నారు. ఇది పరపూర్వా లక్షణము. గాదు. లక్షణమువేఱుగా నున్నది.

“ పరపూర్వాస్త్రియ స్త్వన్యాః సప్తప్రోక్తాయథాక్రమం ।
పునర్భూ స్త్రీవిధా తాసాం స్వైరిణీ తు చతుర్విధా ॥”

అను నిత్యాది శ్లోకములచే నారదులవారు చెప్పియున్నారు.

మఱియు వృద్ధపరాశరులవారు పితృగృహనివాసమును అక్షతయోని విధవకు విధించినారు:—

“ విధవాయా భవే త్కన్యా నిర్దోషా భర్తృవర్జితా ।
తస్యా వాసః పితు ర్వేశ్మ సలజ్జా చైవ సర్వదా ॥

“విధవగాని, నిర్దోషయై పతిచే విడువబడినదిగాని, అగుకన్య తండ్రియింట నుండవలయును.” పునర్భవమును పితృగృహనివాసమును ఒక్కతెకే చెప్పబడినవి. ఎట్లనిన——

“ యా పత్యావా పరిత్యక్తా విధవా వా స్వ యేచ్ఛయా ।
ఉత్పాదయే త్పునర్భూత్వా స పౌనర్భవ ఉచ్యతే ॥
సా చే దక్షతయోనిః స్యా ద్గత ప్రత్యాగతాపివా ।
పౌనర్భవేణ భర్త్రా సా పునస్సంస్కార మర్హతి ॥”మనుః.

“ యది సా బాలవిధవా బలా త్త్యక్తాథవా క్వచిత్ ।
తదా భూయస్తు సంస్కార్యా గృహీతా యేనకేనచిత్ ॥”

బ్రహ్మపురాణము.

ఇచ్చట వృద్ధపరాశరమందును బ్రహ్మవచనముల మూడింటను విధవాశబ్దము కలదు. కన్యా, బాలా, అక్షతయోని ఇవి సమములు. భర్తృవర్జితా, పత్యాపరిత్యక్తా, బలాత్త్యక్తా, సమములు, వృద్ధపరాశరులవారు ‘పరపూర్వాస్త్రియః’ అని పునర్భవమును నిషేధించినారు. ‘విధవా యా భవే త్త’ని పితృగృహనివాసమును విధించినారు. ఇట్లు సకల ధర్మశాస్త్రములును విశేషించి కలియుగప్రధానమగు పారాశరమును నిషేధించుచున్నదిగాన ఎల్ల యధర్మములతోడ



నైనను ఈయుగమున నీవివాహము సంభవింపదు. ఇది వివాహముగా దనియు, పునర్భువు భార్య గా దనియు, రెండవవాడు పతి గా డనియు, వీరియందా సంజ్ఞలు ఔపచారికము లనియు, ఇచ్చటనే స్పష్ట మయియున్నది. ఈయ ధర్మము మనువులో వివాహములయందు చెప్పబడలేదనియు, స్త్రీధర్మముల యందు నిషేధింపబడినదనియు ఆపద్ధర్మములయందు వాగ్దత్తకుం గూడ నిషేధింపబడిన దనియును విశదపఱుపబడినది. ఇది దాయభాగప్రకరణమందు చెప్పబడినది. అందులో అదాయాదపుత్రులలో పౌనర్భవుడు చెప్పబడినాడు. అందులోను సంకరపుత్రులలో చెప్పబడినాడు. అచ్చట ఈ వివాహము పౌనర్భవలక్షణము నవలంబించి చెప్పబడినదిగాని ప్రత్యేకముగా చెప్పబడలేదు.

ఎట్లనిన మనుస్మృతి నవమాధ్యాయము:—

“పుత్రా న్ద్వాదశ యా నాహ నృణాం స్వాయంభువో మనుః ।
తేషాం షడ్బంధుదాయాదాః షడదాయాద బాంధవాః ॥” ౧౫౮.

“ మనుష్యులకు స్వాయంభువమనువు పన్నిద్దఱను పుత్రులను చెప్పెను గదా. వారిలో ఆఱుగురు దాయాద బాంధవులు, ఆఱుగురు అదాయాదబాంధవులు.” వా రెవ రెవ రనగా——

“ఔరసః క్షేత్రజ శ్చైవ దత్తః కృత్రిమ ఏవ చ ।
గూఢోత్పన్నో పవిద్ధశ్చ దాయాదా బాంధవాశ్చషట్ ॥” ౧౫౯.

“ ఔరస, క్షేత్రజ, దత్త, కృత్రిమ, గూఢోత్పన్న, అపవిద్ధులు ఆఱుగురు దాయాదబాంధవులు. ”

“కానీన శ్చ సహోఢ శ్చ క్రీతః పౌనర్భవ స్తథా ।
స్వయందత్త శ్చ శౌద్ర శ్చ షడదాయాదబాంధవాః ॥” ౧౬౦.

“ కానీన, సహోఢ, క్రీత, పౌనర్భవ, స్వయందత్త, శౌద్రులు ఆఱుగురు అదాయాదబాంధవులు ” వీరిలక్షణము లే వనగా——

“స్వేక్షేత్రే సంస్కృతాయాం తు స్వయము త్పాదయే ద్ధియం ।
త మౌరసం విజానీయా త్పుత్రం ప్రథమ కల్పితం ॥” ౧౬౬.

“ తనక్షేత్రమందు, సంస్కరింప బడినదానియందు, తాను గన్నకుమారుడు ఔరసుడు, పుత్రులలో నుత్తముడుగా నెఱుగవలయును. ”

"య స్తల్పజః ప్రమీతస్య క్లీబస్య వ్యాధితస్య వా ।
స్వధర్మేణ నియుక్తాయాం సపుత్రః క్షేత్రజస్స్మృతః ॥" ౧౬౭.

"మృత, నపుంసక, రోగులభార్యలయందు నియోగమువలన బుట్టినవాడు క్షేత్రజుడు."

"మాతా పితా వా దద్యాతాం య మద్భిః పుత్ర మాపది ।
సదృశం ప్రీతి సంయుక్తం సజ్ఞేయో దత్తిమః సుతః ॥" ౧౬౮.

"తల్లిగాని, తండ్రిగాని, పుత్రాభావరూపమగు నాపదయందు, సవర్ణుడును ప్రీతియుక్తుడును అయిన యేపుత్రుని ఉదకపూర్వకముగా నిత్తురో వానికి దత్తిముడని పేరు."

"సదృశం తు ప్రకుర్యాద్యం గుణదోషవిచక్షణం ।
పుత్రం పుత్రగుణై ర్యుక్తం సవిజ్ఞేయ స్తు కృత్రిమః ॥" ౧౬౯.

"గుణదోషము లెఱిగినవాడును, పుత్రగుణములు కలవాడును, అనగా పిండోదకము లిచ్చువాడును, సవర్ణుడును, అయిన ఎవడు పుత్రుడుగా జేసి కొనబడునో వాడు కృత్రిమపుత్రుడు."

"ఉత్పద్యతే గృహే యస్తు న చజ్ఞాయేత కస్య సః ।
స గృహే గూఢ ఉత్పన్న స్తస్య స్యాద్యస్య తల్పజః ॥" ౧౭౦.

"ఒకనిభార్యయందు వానియింటనే మఱి యెవనివలననో వీనివలన వాని వలన నని తెలియక పుట్టినవాడు గూఢోత్పన్నుడు, వాడు తన తల్లియొక్క మగనికి చెందును."

"మాతాపితృభ్యా ముత్సృష్టం తయో రన్య తరేణ వా ।
యం పుత్రం పరిగృహ్ణీయా దపవిద్ధ స్స ఉచ్యతే ॥" ౧౭౧.

"తల్లిదండ్రులచేతగాని, వారిలో నొకరిచేతగాని, పారవైవబడి పుత్రుడుగా కైకొనబడినవాడు, అపవిద్ధు డనబడును."

"పితృవేశ్మని కన్యా తు యం పుత్రం జనయే ద్రహః ।
తం కానీనం వదే న్నామ్నా వోఢుః కన్యాసముద్భవం ॥" ౧౭౨.

"తండ్రియింట వ్యభిచారమువలన కన్య గనిన కుమారుడు కానీనుడు. దాని నెవరు వివాహమాడునో వానికి జెందును."



"యా గర్భిణీ సంస్క్రియతే జ్ఞాతాజ్ఞాతాపి వాసతీ ।
వోఢుః స్స గర్భో భవతి సహోఢ ఇతి చోచ్యతే ॥" ౧౭౩.

"వివాహకాలమందు గర్భిణిగా నుండిన, ఆగర్భము సహోఢు డనబడును. సంస్కర్తకు జెందును."

"క్రీణీయా ద్యస్త్వ పత్యార్థం మాతాపిత్రో ర్య మంతికాత్ ।
స క్రీతక స్సుత స్తస్య సదృశో సదృశోపి వా ॥" ౧౭౪.

"సదృశ్యుని గాని అసదృశ్యునిగాని ఎవనిని పుత్రార్థమై తల్లిదండ్రులవలన ఎవడు కొనునో వాడు వానికి పుత్రుడు, క్రీతుడనబడును."

"యా పత్యా వా పరిత్యక్తా విధవా వా స్వయేచ్ఛయా ।
ఉత్పాదయే త్పున ర్భూత్వా స <u>పౌనర్భవ ఉచ్యతే</u> ॥" ౧౭౫.

"ఏస్త్రీ, పతిచే విడువబడిన దైనను, పతిని విడిచినదైనను, విధవ యైనను, స్వేచ్ఛచే నైనను, కాకపోయినను, మరలనొకని (భార్య) యై ఎవనిని కనునో వాడు పౌనర్భవు డనబడును."

"సా చే దక్షతయోనిః స్యా ద్గత ప్రత్యాగతాపివా ।
<u>పౌనర్భవేన భర్త్రా</u> సా పున స్సంస్కార మర్హతి ॥ ౧౭౬.

"ఆస్త్రీ (అనగా త్యక్తయేని విధవయేని అయి స్వేచ్ఛచేగాని అన్యథాగాని మరల నొకనిభార్య యగుస్త్రీ) పౌనర్భవభర్తచేతను, పోయి మరల వచ్చిన యెడల కౌమారభర్తచేతను, అక్షతయోని యై యున్నయెడల, మరల సంస్కారమును పొందవలయును."

ఈ "పునస్సంస్కార మర్హతి" యను వచనమువలన జరుగు వివాహమువలన పుట్టినవానికి పౌనర్భవ సంజ్ఞలే దనియు, వాడు ఔరసుడేయనియు, కొందఱు వాదింతురు. 'యా' 'సా'యను యచ్ఛబ్దతచ్ఛబ్దములయొక్క నిత్య సంబంధముచే, రెండు శ్లోకములును కలసి,

'ఏస్త్రీ అన్యుని ఆశ్రయించునో, దానికొడుకు పౌనర్భవుడు, అది యక్షత యోనియైన పునసంస్కారమును పొందవలయును.'

అని యర్థమగుచుండగా, పునస్సంస్కృతాసుతుడు పౌనర్భవుడే యని తెల్లమై యుండగా, పునస్సంస్కృతాసుతుడు పౌనర్భవుడు గా డనుట మిక్కిలి యాశ్చర్యకరముగా నున్నది. ప్రథమశ్లోకమున ద్వితీయుని గైకొను

స్త్రీయెల్లను అనగా పరపూర్వ యెల్ల చెప్పబడినది. రెండవశ్లోకమున, అక్షతయోనినిమాత్ర ముద్దేశించిన సంస్కారము చెప్పబడినది. అంతియకాని పౌనర్భవసంజ్ఞ తప్పింపబడలేదు. ద్వాదశ పుత్రులయందు, ప్రతిస్మృతియందు అక్షతయోని పుత్రుడే పౌనర్భవుడుగా చెప్పబడినాడు. రెండవవాడుకూడ చెప్పబడినాడు.

"అక్షతాయాం క్షతాయాం వా జాతః పౌనర్భవః సుతః ।"

అగ్నిః. యాజ్ఞవల్క్యః

"అక్షతా భూయస్సంస్కృతా పునర్భూః ॥" విష్ణుః.

"అక్షతాయాం క్షతాయాం వా జాతౌ పౌనర్భవౌ మతౌ ।" లోహితః.

"కన్యైవాక్షతయోని ర్యా.

పునర్భూః ప్రథమాప్రోక్తా పునస్సంస్కారకర్మణా ॥" నారదః.

"యా వా క్లీబం...పునర్భూ ర్భవతి ।" వసిష్ఠః.

"క్లీబం విహాయ పతితం...పౌనర్భవో జాతః ॥" కాత్యాయనః.

ఇట్లు సకలస్మృతులచేతను విశేషించి మనుస్మృతిలోని యీ శ్లోకములచేతను అక్షతయోని పుత్రుడు పౌనర్భవుడే యని చెప్పబడుచున్నాడు.

"మాతాపితృవిహీనో య స్త్యక్తో వా స్యాదకారణాత్ ।

ఆత్మానం స్పర్శయే దస్మై స్వయందత్త స్సుతః స్మృతః ॥" ౧౭౭.

"తల్లిదండ్రులులేని వాడయినను, నిష్కారణముగా త్యజింపబడిన వాడయినను, తన్నుస్వయముగా నెవ డేవని కర్పించుకొనునో, వాడు వానికి స్వయందత్తు డను పుత్రుడు."

"యం బ్రాహ్మణ స్తు శూద్రాయాం కామా దుత్పాదయే త్సుతం ।

స పారయన్నేవ శవ స్తస్మా త్పారశవః స్మృతః ॥" ౧౭౮.

"ఎవనిని కామముచే బ్రాహ్మణుడు శూద్రస్త్రీయందు కనునో, వాడు జీవించియే శవము గనుక పారశవు డనబడును."

అధర్మ్యములైన సంస్కారములెల్ల నిందు చెప్పబడినవి. ఏమనిన పుత్రవతీ గర్భిణీ విధవా సంస్కారములు చెప్పబడినవి. ఇవి యధర్మ్యములని యష్టమాధ్యాయమందు మనువే చెప్పి యున్నాడు.

కన్యాశబ్దార్థము.

"పాణిగ్రహణ మంత్రా స్తు కన్యాస్వేవ ప్రతిష్ఠితాః ।

నాకన్యాసు క్వచి న్నౄణాం లుప్తధర్మక్రియా హి తాః ॥" ౨౨౬.



"మనుష్యులకొఱకయిన పాణిగ్రహణమంత్రములు కన్యలయందే స్థాపింపబడియున్నవి." అనగా మంత్రములలో కన్యాశబ్దమున్నది. కనుక పాణిగ్రహణ మంత్రములు కన్యలకే చెప్పబడినవి. "అకన్యలకొఱకు ఎప్పుడును ఏర్పడలేదు. అయకన్యలు ధర్మక్రియారహితలుగదా."

కన్య యనగా నక్షతయోని.

"సా తు వైచ్ఛ ద్వరారోహా కన్యాహ మితి ప్రార్థిప।

ప్రాదాచ్చ తస్యై కన్యాత్వం పున స్స పరమద్యుతిః॥" భాగవతము.

"కుంతీదేవి సూర్యునితో తాను కన్య గావున సంగమించుటకు ఒప్పుకొనకపోయెను. అయినను ఆయన సంగమించి కన్యాత్వము నిచ్చిపోయెను." ఇందువలన అక్షతయోని కన్యయనియు, క్షతయోని కన్యనితో ధర్మక్రియలు లేవనియు, స్పష్టము. కన్యయనగా అనూఢ.

"వివాహితాయాః కన్యాయాః కన్యాత్వం నైవ విద్యతే।

కన్యాయాశ్చ వివాహేన సంబంధః పృథివీశ్వర॥" మార్కండేయః

"వివాహిత యయినదానికి కన్యాత్వము లేదు. కన్యకే గాని యన్యకు వివాహములేదు." ఇందువలన అవివాహిత కన్యయనియు, వివాహిత కన్యనితో ధర్మక్రియలు లేవనియును-స్పష్టము. కనుక, గర్భిణీపుత్రవతీ విధవాసంస్కారములు మనువే నిషేధించె నని స్పష్టము. కనుక పుత్రవతీ, గర్భిణీ, పునర్భువులకు ధర్మాధికారములేదు. కనుకనే యాజ్ఞవల్క్యులవారు, 'ఔరసో ధర్మపత్నీజః' అనుటచే ఈ ముగ్గురును ధర్మపత్నులు గారని చెప్పినారు. ఇచ్చట కన్యాశబ్దముయొక్క యర్థము నెఱుంగక పూర్వపక్షులు "దశవర్షా భవేత్కన్యా" అను ప్రమాణమువలన, మంత్రములయందు దశవర్షయే చెప్పబడినదని వచించినారు. అది యజ్ఞానము. ఎట్లనిన, మనువే.

"త్రింశద్వర్షో వహేత్కన్యాం హృద్యాం ద్వాదశవార్షికీం।

త్ర్యష్టవర్షోఽష్టవర్షాం వా ధర్మే సీదతి సత్వరః॥"

అని పండ్రెండేండ్లదానిని వివాహము చేసికొనవలయు నని చెప్పినాడు.

ఉక్తప్రమాణములచే అవివాహితాక్షత యోనికే వివాహముగాని తదితరలకు లేదని స్పష్టముగదా. ఇట్లుండగా, పూర్వపక్షులు "లుప్తధర్మక్రియాః" అను విశేషము వ్యభిచారిణులకే అన్వయించుననియు, విధవలు భర్తలను గూర్చి యేమి, దైవములను గూర్చి యేమి, ధర్మములను చేయుట కాక్షేపము

లేదుగాన నారియం దీవిశేషణము అన్వయింప దనియు, కనుక పాణిగ్రహణ మంత్రాస్తు అను శ్లోకమునందలి అకన్యలు వ్యభిచారిణులుగాని విధవాదులు గారనియు కుయుక్తి చేసినారు. వ్యభిచారిణులకు గూడ ఎవనితో వ్యభిచారమో వానిని గూర్చి ధర్మక్రియలు కలవు.

"సకామాయాం తు కన్యాయాం సంగమే నాస్త్యతిక్రమః।
కిం త్వలంకృత్య సత్కృత్య స ఏ వైనాం సముద్వహేత్॥" నారదః.

అన్యులతో ధర్మక్రియలు ఇరువురకును లేవు. కనుక "నాకన్యాను" అనునది వివాహితలకు చెంద దనగూడదు.

ఈధర్మరహితలయొక్క సంస్కారములను మనువు అపవాదముగా చెప్పలేదు. ఇవి యపవాదమైన "నాకన్యాను" అను నిషేధము నిరవకాశమగును. మఱియు, "వ్యభిచారాత్తు వర్ణానాం" అనుటచే వర్ణసంకరుడైన గూఢోత్పన్నుడు, దాయాదుడనియు, కానీన సహోఢజ పౌనర్భవులదాయాదులనియును చెప్పినాడు. కనుక పౌనర్భవుడు వర్ణసంకరుడనుటకు ఏమాక్షేపము. 'శ్రేయసః శ్రేయసో లాభే పాపీయా దరిక్థ మర్హతి' 'యోగ్యులు లేకపోయినయెడల పాపిష్ఠుడు దాయమును పొందును' అనుటచే కానీన సహోఢజ, క్రీత, పౌనర్భవులందఱు వర్ణసంకరులనియు, ఉత్తరోత్తరము పాపిష్ఠులనియు, అందు పౌనర్భవుడు పాపిష్ఠాగ్రగణ్యుడనియు, ఎవరికి తెల్లము గాదు?

"అప్రశస్తా స్తు కానీన గూఢోత్పన్న సహోఢజాః।
పౌనర్భవ శ్చ నైవైతే పిండరిక్థాంశ భాగినః॥" విష్ణుః.

'కానీన' గూఢోత్పన్న, సహోఢజ, పౌనర్భవులు అప్రశస్తులు. వీరు పిండము నియ్యరు, రిక్థమును పొందరు.' విష్ణువే గదా ద్వాదశపుత్రులలో 'అక్షతా భూయస్సంస్కృతా పునర్భూః' అని తల్లిద్వారమున పౌనర్భవుని స్వరూపమును తెలియబఱిచెను. ఆయనమతమే గదా అప్రశస్తులలో పౌనర్భవుడు అధమాధముడని.

"యాదృశం ఫల మాప్నోతి కుప్లవై స్సంతరఞ్జలం।
తాదృశం ఫల మాప్నోతి కుపుత్రై స్సంతరం స్తమః॥" మనుః

"చెడుతెప్పలు నీట ముంచునట్లు కుపుత్రులు నరకమున ముంచివైతురు." కనుక ఈ సంస్కారములు అపవాదములు కావు.

పూ॥ వివాహాయోగ్యలను జెప్పుచు బుధులు,—



"దీర్ఘ కుత్సిత రోగార్తా వ్యంగా సంస్పృష్ట మైథునా।
దృష్టాన్యగతభావా చ కన్యాదోషాః ప్రకీర్తితాః॥" నారదః.

అని క్షతయోనిని నిషేధించినారు గాని, ఊఢను నిషేధింపలే దనియు, కనుక క్షతయోని పనికిరాదు గాని ఊఢ పనికి వచ్చు ననియు, పూర్వపక్షులు వచించుచున్నారు.

ఉ॥ వివాహితలకు మగల వివాహముతో సంబంధములేదు గాన, గుణదోషములెల్ల నామహర్షులు అవివాహితలకే చెప్పిరి.

"పాణిగ్రహణమంత్రాస్తు" అని మనువును, "వివాహితాయాః కన్యాయాః" అని మార్కండేయులవారును, అవివాహితకే వివాహముతో సంబంధము గాని, వివాహితకు వివాహముతో సంబంధము లే దని విధించినారు. అట్లే వరదోషములయందును,

"ఉన్మత్తః పతితః క్లీబః దుర్భగ స్త్యక్తబాంధవః।
కన్యాదోషౌ చ యౌ పూర్వౌ ఏష దోషగణో వరే॥" నారదః.

క్లీబాదుల కీయగూడ దని చెప్పబడియున్నదిగాని, సన్న్యాసి కీయగూడదని నిషేధము లేదు. కనుక సన్న్యాసికిని కన్యనీయవచ్చు నని పూర్వపక్షులు సిద్ధాంతము కల్పింప వచ్చును. సన్న్యాసికి వివాహముతో సంబంధములేదు. కనుక వరదోషములెల్ల అసన్న్యాసికే చెప్పబడినవి. అట్లే వివాహితకు వివాహముతో సంబంధమే లేనందున, కన్యాదోషము లెల్ల అవివాహితలకే చెప్పబడినవి. దుష్టయయినను వివాహసంబంధము కలదానిని వివాహమాడిన అది వివాహము కాకపోదు. వివాహసంబంధము లేనిదానిని వివాహమాడిన నది వివాహము కానేరదు.

సన్న్యాసిని వివాహమాడిన నది వివాహము కానేరదుగాని, దుర్భగుని అనగా కురూపిని వివాహమాడిన నది వివాహముకాదా? అట్లే వ్యంగను అనగా అంగహీనురాలిని వివాహమాడిన నది వివాహమెట్లు గాకపోవును? వివాహ సంబంధములేని వివాహితను అనగా విధవాదులను వివాహము చేసికొనిన అది వివాహ మెట్లగును? కనుక పునర్భువు మొదలగువారియం దెల్ల ఆయాసంజ్ఞలు ఔపచారికములు అయి యున్నవి. వివాహితకు వివాహ సంబంధము లేదని ప్రతిమహర్షియు శతశః కన్యాశబ్దమును వివాహ్యావాచకముగా ప్రయోగించుటచే తెలియబఱిచినాడు. ప్రతిపక్షులకు కన్యాశబ్దము యొక్క యర్థము తెలియనందున ఆయంశము బోధపడినదిగాదు. దోషములకే కన్యా

దోషములని పేరు పెట్టియున్నారు. "వివాహితాయాః కన్యాయాః కన్యాత్వం నైవ విద్యతే" యని మహర్షులు స్పష్టపఱచినందున కన్యాదోషములనగా అవివాహితా దోషములు అనియే యర్థముగదా.

"అవిప్లుత బ్రహ్మచర్యో లక్షణ్యాం స్త్రియ ముద్వహేత్। [కన్యాః]
అనన్యపూర్వికాం కాంతా మసపిండాం యవీయసీమ్॥" యాజ్ఞవ
"గృహస్థ స్సదృశీం భార్యాం విందేతా నన్యపూర్వాం యవీయసీమ్."
గౌతమః.

"అనన్యపూర్వికను వివాహము చేసికొనవలయును." అనన్యపూర్విక యనగా పూర్వమందు అన్యుడు ఎవతెకు లేడో అది, అనగా పరపూర్వ. సంగమమునుమాత్రమే చెప్పెననుటకు ప్రమాణము లేదుగాన 'దానముచేతగాని ఉపభోగముచేతగాని అప్పటికి అన్యునిది కానిది' అని యర్థము.

"ఏవం స్నాతకతాంప్రాప్తో ద్వితీయాశ్రమకాంక్షయా।
ప్రతీక్షేత వివాహార్థ మనింద్యాన్వయసంభవామ్।
అరోగా దుష్టవంశోత్థా మశుల్కా దానదూషితామ్।
అనన్యపూర్వికాం లక్ష్మీం శుభలక్షణసంయుతామ్॥" వ్యాసః.

"ఉద్వాహితాపి యా కన్యా న స్యాత్సంప్రాప్తమైథునా।
పున స్సంస్కార మర్హేత యథా కన్యా తథైవ సా॥"

"వివాహితయైనను అక్షతయోనియైయున్నయెడల అవివాహితవలెనే మరల సంస్కారమును పొందదగినది" అనుటచేత వివాహవిధులెల్ల అవివాహితలకేగాని అన్యలకు చెప్పబడలేదని స్పష్టము. ఈ 'యుద్వాహితా' యను నపవాదమునకుగతి యిదివఱకే చూపబడినది.

ఆపస్తంబులవారు వివాహానర్హలను చెప్పుచు,

"దత్తాం, గుప్తాం, ద్యోతామ్, ఋషభాం, శరభాం, వినతాం, వికటాం, ముండాం, మూషికాం, సాంకారికాం, రాతాం, పాలీం, మిత్రాగ్ం, స్వనుజాం, వర్షకారీం చ వర్జయేత్॥" అని దత్తను నిషేధించినారు.

"వాచాదత్తా, మనోదత్తా, అగ్నింపరిగతా, సప్తమం పదంనీతా, భుక్తా ప్రసూతా గృహీతగర్భాచేతి సప్తవిధా పునర్భూః, తాం గృహీత్వాన ధర్మం న ప్రజాం విందేత్." అని బోధాయనులవారు, 'వాచాదత్త మొదలుకొని గృహీతగర్భవఱకు ఏడుగురు పునర్భువులు, వారిని గ్రహించి ధర్మముచేయ



గూడదు. వారివలన సంతానమును పొందకూడదు.' అని నిషేధించినారు. ప్రతిపక్షులు లేదనినను వివాహితకు మరల వివాహమును నిషేధించునట్టి వచనము లిట్లు అనేకములున్నవి. ఇందు క్షతయోని యగు నసూఢకన్న నక్షతయోనియైన యూఢ యధమ యని యిదివఱకే తెలియజేయబడెను. 'భర్త్రా సా సంస్కర్తవ్యా ప్రాయశ్చిత్తాభిః క్రమాత్' అని ఒకపునర్భవమునకే ప్రాయశ్చిత్తము చెప్పబడినది. "సా చేత్పునః ప్రదుష్యేత్తు...కృచ్ఛ్రం చాంద్రాయణం స్మృతమ్" అని రెండువ్యభిచారములకు ప్రాయశ్చిత్తములు కలవు. కనుక వ్యభిచారమునకన్న వివాహము అధికపాపము. కనుక పునస్సంస్కృతాక్షతయోని, సంస్కృతక్షతయోనికన్న నధమ యని సిద్ధాంతము. కనుకనే నారదులవారు, "కన్యైవాక్షతయోని ర్యా...చతుర్థీ ప్రకీర్తితా," అని ముగ్గురు పునర్భువులను నలుగురు స్వైరిణుల లక్షణములతోను చెప్పి, ఆవెంబడి,

"పునర్భువాం విధి స్త్వేష స్వైరిణీనాం ప్రకీర్తితః।
పూర్వాపూర్వా జఘన్యా సా శ్రేయసీ తూత్తరోత్తరా॥"

"పునర్భువులయందును స్వైరిణులయందును ఇది విధి. పూర్వపూర్వ అధమురాలు, ఉత్తరోత్తర శ్రేష్ఠురాలు"—అనగా అక్షతపునస్సంస్కృతకంటె, క్షతసంస్కృత, దానికంటె నన్యునికీయబడిన వాచాదత్త, శుల్కదత్త, ఈవరుసను, ప్రాశస్త్యాప్రాశస్త్యములను చెప్పినారు. కనుక పునర్భువు లందఱిలోను, అక్షత పునసంస్కృతయే అధమురాలు! దానినే పూర్వపక్షులు అందఱిలోను ఉత్తమ యన గోరుచున్నారు.

పూ॥ ఇంతయధర్మ్యములయిన, ఈసంస్కారములెందునకు చెప్పబడినవి?

ఉ॥ "నాపుత్రస్యలోకోస్తి." వసిష్ఠః. "పుత్రహీనునికి పరలోకము లేదు." కనుక పుత్రాభావమందు సుపుత్రులు లభింపనియెడల, పాపిష్ఠపుత్రుడైనను లభించును గాక యని, చెప్పబడినవి. ధర్మముకొఱకు ఈ సంస్కారములు కానందున, కామముకొఱకు వేఱే చెప్పబడి యున్నందున, చెడిపోయిన వారికి ఈపుత్రులు అన్యాభావమున కొంచెము ఉపయోగింతురు గాక యని యీసంస్కారములు చెప్పబడినవి. అట్లే క్షేత్రజజనకమగు నియోగధర్మము ఔరసాద్యభావమందు, పుత్రార్థముగాని మఱి యెందునకును గాదని స్పష్టమయియున్నది. పుత్రాభావమగు నాపదయందు. తన్నివారణమునకై దత్తపుత్రస్వీకారమని ఎల్లవారికిని విదితమే ఐయున్నది. కృత్రిమపుత్రగ్రహణము పుత్రార్థమని తల్లక్షణమందే చెప్పబడినది. భార్యయొక్క వ్యభిచారమువలన గలిగిన గూఢోత్పన్నుడు ఆపదయందు పుత్రార్థ

ముగా దేని మఱి యేల? పాఱవేయబడినవానిని తెచ్చి పుత్రుని చేసికొనుట యాపదయందు పుత్రార్థముగాదేని మఱియేల? పుత్రవతీగర్భిణీ వివాహములు, ధర్మమునకు పనికి రానివి పుత్రార్థముగాని యెడల మఱియేల? ఈసంస్కారములచే అపుత్రుడును, అగర్భమును, సంస్కృతను జెందును. లేనియెడల "కానీనః కన్యకాజాతో మాతామహసుతశ్చసః"(యాజ్ఞ్యవల్క్యః), 'కన్యయందు బుట్టినవాడు కానీనుడు. వాడు మాతామహునికి జెందును.' కనుక 'వోఢుః కన్యాసముద్భవం' 'వోఢుః సగర్భో భవతి' అనుటచే అపుత్రునికొఱకును అగర్భముకొఱకును ఈసంస్కారములని స్పష్టము. క్రీతునిలక్షణమే, 'అపత్యార్థమైకొనబడినవాడు' అనిగదా. క్రయమునకు ఎవడును లభింపనియెడల, పుట్టబోవువాడు తనకు జెందుటకొఱకయి అన్యభార్యా సంస్కారము. ధర్మముకొఱకయిన, భార్యార్థమయిన, ఇందఱకన్నను పౌనర్భవుడు అధముడును, అదాయాదుడును, అపిండదుడును, ఎట్లగును? పుత్రవతీసంస్కారము పుత్రస్వామ్యముకొఱకు, గర్భిణీసంస్కారము గర్భస్వామ్యముకొఱకు అట్లే పునర్భూసంస్కారము పౌనర్భవస్వామ్యముకొఱకు. ఈపుత్రులను గోరుట యెప్పుడనగా,

"అపుత్రేణైవ కర్తవ్యః పుత్రప్రతినిధిః సదా।"

"ఎప్పుడైనను పుత్రహీనుడే యీప్రతినిధులను చేసికొనవలయును" ఈ విధి బ్రహ్మచారులకుగాదు. ఎందుచేత ననగా,

"అనేకాని సహస్రాణి కౌమార బ్రహ్మచారిణాం।
దివం గతాని విప్రాణామకృత్వా కులసంతతిమ్॥" మనుః.

"పెక్కువేలమంది కౌమార విప్రబ్రహ్మచారులు కులసంతతి చేయకయే స్వర్గమును పొందిరి" అనిమనువుచెప్పినాడు. కనుక ఈవిధి గృహస్థులకు; కనుకనిది గార్హస్థ్యముకొఱకు గాదని స్పష్టము. అనగా భార్యార్థము గాదనిస్పష్టము. పునర్భువు ప్రథమభార్యగా కూడదు.

"అపుత్రేణ సుతః కార్యో యాదృక్ తాదృక్ ప్రయత్నతః।
పిండోదకక్రియాహేతోర్నామసంకీర్తనాయ చ॥"

అని మనువునుండి యని వైద్యనాథదీక్షితులవారుదాహరించినారు.

"అపుత్రకుడైనవాడు ఏట్టివానినో ఒకనిని ప్రయత్నపూర్వకముగా పుత్రుని జేసికొనవలయును. ఎందులకనగా పిండోదకక్రియలకొఱకును, తన పేరు భూమిమీద నుండుటకును." అట్లే మనువును,



"క్షేత్రజాదీన్సుతానేతాన్ ఏకాదశ యథోదితాన్।
పుత్రప్రతినిధీనాహుః క్రియాలోపాన్మనీషిణః॥"

"ఈ క్షేత్రజాది పుత్రులను పదునొకరిని వరుసగా క్రియాలోపమును నివారించుటకొఱకుగాను పెద్దలు పుత్రప్రతినిధులనుగా చెప్పినారు." అట్లే బృహస్పతి—

"ఆజ్యం వినా, యథాతైలం సద్భిః ప్రతినిధీకృతం।
తథైకాదశపుత్రాస్తు పుత్రికౌరసయోర్వినా॥"

"నేయి లేనియెడల నూనె, యెట్లుప్రతినిధి చేయబడుచున్నదో, అట్లే కూతురును ఔరసుడును లేనియెడల ఏకాదశపుత్రులును ప్రతినిధులుగా జేసికొనబడుచున్నారు." కనుక, పుత్రార్థమగు, నధర్మమిదియని స్పష్టము. అట్లయిన మన పూర్వపక్షుల కక్కఱలేదు, భార్యార్థమే వారికి కావలయును.

మనువు ౯ (౧౦౨)-వ శ్లోకమందు "అప, ద్యపత్యప్రాప్తిశ్చ" యని నియోగప్రకరణమును ముగించి, "దాయభాగం, నిబోధత" అని యారంభించిన దాయప్రకరణములో ఈ సంస్కారములనెల్ల, చెప్పి ఈ ప్రకరణమును,

"అయ ముక్తో విభాగో వః పుత్రాణాం చ క్రియావిధిః।
క్రమశః, క్షేత్రజాదీనాం ద్యూతధర్మం నిబోధత॥"

"ఇదిగో దాయభాగమును చెప్పితిని" అనియు, ఇందులో సంకీర్ణమయియున్న పుత్రప్రతినిధుల గ్రహణమును వరుసగా క్షేత్రజాది పుత్రులను గ్రహించువిధమును చెప్పితిని" అనియు,ముగించెను. అటుపైన ద్యూత ప్రకరణ మారంభించెను. కనుక ఈ సంస్కారములు పుత్రార్థము గాని మఱి యెందునకునుగావు. ఇవి ధర్మ్యసంస్కారము లనుట ప్రకరణమునకు విరుద్ధము. పుత్రాభావమున పౌత్రుడు, తదభావమున అధివేదనము, మరల నధివేదనము, తరువాతపుత్రిక, దౌహిత్రుడు, పుత్రికాపుత్రుడు, భాతృపుత్రుడు, వరుసగా వీరెవ్వరును లభింపనియెడల, పరిశుద్ధజన్ములలో తనభార్యకు మాత్రము దేహ సంబంధముగల క్షేత్రజుడు, తదలాభమున ఆసంబంధమును లేక దాన సంబంధముగల దత్తుడు, తదభావమున దానసంబంధమును లేక విచక్షణుడగు కృత్రిముడు, తదభావమున సంకరాగ్రగణ్యుడయిన గూఢోత్పన్నుడు, తదభావమున సాంకర్యముచేతనైనను దేహసంబంధములేనివాడు పాఱవేయబడినవాడు, తరువాత సంకరులలో అసంస్కృతావ్యభిచారమువలన పుట్టిన కానీనుడు, తరువాత అట్టివాడే మఱియొకడు, తరువాత క్రీతుడు, తరువాత ఇరువురయు దోషమువలన గలిగినవాడు పౌనర్భవుడు.

## అర్హతి శబ్దార్థము.

ప్రతిపక్షులు స్మృతివచనములయందలి సంస్కృతశబ్దములకు స్మృతిసంప్రదాయ సిద్ధమయిన యర్థమును చెప్పుట లేనే లేదు గదా, సంస్కృతభాషకు సామాన్యముగా అనుకూలించునర్థమునయినను చెప్పుటలేదు. మఱియేమనిన, ఆసంస్కృతశబ్దములు దేశభాషలో పామరజనములచేత ఏయర్థమందు ప్రయోగింపబడుచున్నవో ఆయర్థము నే స్మృతులకు చెప్పుచున్నారు. పునర్భూలక్షణమందు "సాచేదక్షతయోనిః స్యాత్పున సంస్కార మర్హతి" అనియున్నది. 'అక్షతయోనియైనదానికి పునసంస్కారము చేయవలయును' అనియర్థము. ఈవచనమునకు—'పునసంస్కారమునకు అక్షతయోనికి అధికారము కలదు' అనగా 'కన్యకెట్లో అట్లే ఈయకన్యకును వివాహయోగ్యత కలదు'—అనియర్థము చెప్పుచున్నారు. పునస్సంస్కారాధికారమే దీనికున్నయెడల దీనిపుత్రుడు అదాయాదుడును అపిండదుడును పాపిష్ఠుడును ఏలయగును? దీనికి పునస్సంస్కారాధికారము ఎంతమాత్రమును లేదు. 'అర్హతి' యనునది యోగ్యతావిశేషమును మాత్రమే చెప్పునదికాదు. అది దోషమునే చెప్పగలదు.

"నోన్మత్తాయా నకుష్ఠిన్యా న చ యాస్పృష్టమైథునా।
పూర్వం దోషా నభిఖ్యాప్య ప్రదాతా దండ మర్హతి॥" మనుః.

"పూర్వము దోషములు చెప్పి కన్యనిచ్చువాడు శిక్షకు అర్హుడుగాడు."

"క్షేత్రేష్వన్యేషు తు పశుః సపాదం దండ మర్హతి॥" మనుః.

"అన్యక్షేత్రమందు పశువును మేపినవాడు ఒకటియుంబాతిక దండుగకు అర్హుడు."

"పాణి ముద్యమ్య దండం వా పాణిచ్ఛేదన మర్హతి।
పాదేన ప్రహరన్ కోపా త్పాదచ్ఛేదన మర్హతి॥" మనుః.

"చే యెత్తిగాని, కఱ్ఱ యెత్తిగాని, కొట్టినవాడు, పాణిచ్ఛేదనమున కర్హుడు. పాదముతో కోపమున తన్నినవాడు పాదచ్ఛేదనమున కర్హుడు."

"వైశ్య స్సర్వస్వదండ్యః స్యా త్సంవత్సరనిరోధతః.
సహస్రం క్షత్త్రియో దండ్యో మౌండ్యం మూత్రేణ చార్హతి॥" మనుః.

"వైశ్యుడు క్షత్త్రియాగమనము చేసిన, ఒకసంవత్సరము ఖయిదులోనుంచి వానిసర్వద్రవ్యమును రాజు, హరింపవలయును. క్షత్త్రియుడు బ్రాహ్మణీగమనముచేసిన వేయిసువర్ణములు దండ్యుడు. గాడిదమూత్రముతో మౌండ్యమునకు అనగా బోడిగుండు చేయింపబడుటకును అర్హుడు. ఇచ్చట నెల్లదోషము నే



అర్హతి చెప్పుచున్నది. కనుక 'అర్హతి' యోగ్యతనే చెప్పుననుట తప్పు. 'పునస్సంస్కార మర్హతి' అనగా యోగ్యత చెప్పబడినదని పూర్వపక్షులు భ్రమపడుచున్నారు. పాపముపోవుటకు, నరకము తప్పుటకు, జాతినిలుచుటకును, పాతకములకుప్రాయశ్చిత్తముగా "పునస్సంస్కార మర్హతి" అను వచనముచేత ధర్మశాస్త్రములయందు పునస్సంస్కారము విధింపబడుచున్నది. ఎట్లనిన

"అజ్ఞానా త్ప్రాశ్య విణ్మూత్రం సురాసంస్పృష్టమేవ చ।
పునస్సంస్కార మర్హంతి త్రయో వర్ణా ద్విజాతయః॥" మనుః.

"శకృత్ప్రాశనమును, మూత్రపానమును, సురాసంస్పృష్ట ప్రాశనమును అజ్ఞానముచే జేసినేని ద్విజాతులు ముగ్గురును పునస్సంస్కారమున కర్హులు." పునంస్సస్కార మనుధర్మమును కోరినవారు, అజ్ఞానముచే శకృత్ప్రాశనము మూత్రపానమును చేయవలయుననియు, అట్లుచేసిన పునస్సంస్కారమునకు యోగ్యులగుదురనియును అర్థముకాదు. మఱియేమనిన, ఈయకార్యముల వలన వారికి ఉపనయన సంస్కారఫలము అనగా ప్రథమసంస్కారఫలము నశించు ననియు, పునరుపనయనము చేసికొననియెడల జాతిభ్రష్టులగుదురనియు, తాత్పర్యము.

"మ్లేచ్ఛై ర్గతానాం చౌరై ర్వా కాంతారే వా ప్రవాసినాం।
భక్ష్యాభక్ష్య విశుద్ధ్యర్థం తేషాం వక్ష్యామి నిష్కృతిమ్॥
పునః ప్రాప్య స్వదేశం చ వర్ణానా మానుపూర్వశః।
కృచ్ఛ్రస్యాంతే బ్రాహ్మణ స్తు పునస్సంస్కార మర్హతి॥"

"అజ్ఞానాత్ప్రాశ్య విణ్మూత్రం సురాసంస్పృష్ట మేవచ।
పునస్సంస్కార మర్హంతి సర్వే వర్ణా ద్విజాతయః॥" అగ్నిపు.

"మ్లేచ్ఛాదులచే బలాత్కృతులై యభక్ష్యభక్షణము చేసినవారు పునస్సంస్కారము చేసికొనవలయును. ఇందుచేత మహత్తరమయిన దోషము చెప్పబడినదిగాని, అధికారము చెప్పబడలేదు. 'పునస్సంస్కారమర్హతి' అనునది పాతకముచే ప్రథమసంస్కారము నశించెనని తెలియజేయుచున్నది, నశింపనియెడల మరల సంస్కారమెందునకు?

పూ॥ అట్లైన, పురుషుడు బహువివాహములయందు పునఃపునః సంస్కారమును పొందుచున్నాడు. పాతకము హేతువుగాదు.

ఉ॥ వివాహ సంస్కారము పురుషునికి గాదు; స్త్రీకి. ఆసంస్కారము చేయువాడు భర్త. అదే స్త్రీకి ఉపనయన సంస్కారము. అందువలన స్త్రీకి ద్విజాతిత్వము కలిగినది. పురుషునికి సంస్కారము ఉపనయనము. పాతకము నాశముచేయని యెడల దానికి అవృత్తి లేదు. స్త్రీయొక్క ప్రథమ వివాహ సంస్కారఫలమును అనగా ద్విజాతిత్వాదికమును, ఏపాతకము నాశము చేసినది?

పూ॥ అక్షతయోనిత్వమును వైధవ్యమును.

ఉ॥ అట్లైన, ఈసంస్కారము ఐచ్ఛికమా, విహితమా? పూ॥ ఐచ్ఛికము.

ఉ॥ కనుక ప్రథమసంస్కారము నశింపలేదు. కనుక ఈ సంస్కారము స్త్రీకి ఆవశ్యకముగాదు. పురుషునికొఱకా యనిన,

"దేవదత్తాం పతిర్భార్యాం విందతే నేచ్ఛయాత్మనః।
తాం సాధ్వీం బిభృయా న్నిత్యం దేవానాం ప్రియ మాచరన్॥
ప్రజనార్థం స్త్రియ స్సృష్టాః సంతానార్థంతు మానవాః॥
తస్మా త్సాధారణోధర్మః శ్రుతౌ పత్న్యా సహోదితః॥" మనుః.

"దేవత లిచ్చినదానినే భార్యనుగా భర్త వివాహము చేసికొనవలయును. ఒకటితెచ్చి యుంచుకొనగూడదు. (అనగా సంస్కారముచేసికొనియే భార్యను గ్రహింపవలయును;) దానిని సదా పోషింపవలయును. కనుటకు స్త్రీలును వంశవృద్ధికొఱకు పురుషులును సృజింపబడినారు. కనుక భార్యతో కూడనే ధర్మమును చేయవలయునని వేదము చెప్పుచున్నది." "ధర్మము చేయవలయు" ననుటచే సంస్కారవిధి ధర్మపత్నికి గాని పునర్భువునకుగాదు.

"ఔరసో ధర్మపత్నీజః... అక్షతాయాం క్షతాయాం వా జాతః పౌనర్భవః సుతః।" ఇత్యాది బహుప్రమాణములచేత పునర్భువు ధర్మపత్ని గాదు. కామార్థమగుసంస్కారమా యనిన;

"కామత స్తు ప్రవృత్తానా మిమాః స్యుః క్రమశో వరాః॥" మనుః.

"కామముకొఱకు ఈక్రిందివర్ణములవారుతగుదురు." అని చెప్పబడియున్నదిగాని, అచ్చటగాని మఱియెచ్చటగాని పునర్భువు చెప్పబడలేదు. కనుకనీసంస్కారము కామముకొఱకును ఆవశ్యకముగాదు. పుత్రప్రతినిధులయందు చెప్పబడినదిగావున పుత్రప్రతినిధికొఱకు అని, విశదము. పుత్రవతీ సంస్కా-



రమువలెనే ఇదియును పుత్రప్రతినిధికొఱకు అని సిద్ధాంతము. కనుకనే అది ధర్మాధికారము లేనిదిగాన దానిని ధర్మార్థము గ్రహింపగూడదని చెప్పుచు, ఎవడైననొకడు ఒకవేళ దానిని గ్రహించిన, మరల సంస్కరింపవలయు నని శాస్త్రము చెప్పుచున్నదిగాని, అది సంస్కారాధికారము కలదిగాన దానిని గ్రహింపవచ్చును, అని చెప్పుటలేదు. కనుక ఈమనుశ్లోకములకు,

౧. "మృతేభర్తరి యా నారీ త్యక్త్వవ త్యథ తం స్వయం।
సవర్ణా జ్జనయేద్గర్భం భర్తుః పౌనర్భవం సుతమ్॥
౨. యది సా బాలవిధవా బలా త్త్యక్తాఽథవా క్వచిత్।
తదా భూయ స్తు సంస్కార్యా గృహీతా యేన కేనచిత్॥
౩. త్యక్త్వా భర్తృగృహం గచ్ఛే ద్యది దోషం వినాపునః।
భర్త్రాసా సంస్కర్తవ్యా ప్రాయశ్చిత్తాదిభిః క్రమాత్॥
౪. స్త్రీణాం పునర్వివాహ శ్చ దేవరా త్పుత్రసంతతిః।
స్వాతంత్ర్యం వా కలియుగే నకర్తవ్యంకదాచన॥" బ్రహ్మపురాణము.

"ఎవడైననొకడు దానిని మరల గ్రహించెనేని సంస్కరింపవలయును; రెండవవానిని వదలి భర్తృగృహమున కేదోషములేకుండ, మరలపోయిన, భర్త ప్రాయశ్చిత్తాదిచే వరుసగా సంస్కరింపవలయును." దీనియందేమియు దోషము లేనియెడల ప్రాయశ్చిత్తమేల? కనుక రెండవవానియొద్దకు పోవుట యను దోషమునకు ప్రాయశ్చిత్తము. 'పత్యా వా పరిత్యక్తా' యను వాక్యమునకు 'త్యక్త్వవ త్యథ తం స్వయమ్' అనియు, 'సజాతీయే ష్వయం ప్రోక్త స్తనయేషు మయావిధిః' అను యాజ్ఞవల్క్యవచనమునకు 'సవర్ణాత్' అనియు ఒకరిని విడిచి మఱియొకరిని అనగా ఎన్నివందలమందినైనను, వివాహము చేసికొనినను, ఇంక మఱియేమిచేసినను సరియే అక్షతయోనిగా మాత్రముండిన జాలును, అని పూర్వపక్షులు అర్థముచేసిన 'గతప్రత్యాగతా' యనువచనమునకు, 'త్యక్త్వాభర్తృగృహం గచ్ఛేత్త' నియు; (గతా=వెడలిపోయినది ప్రతి=మరలి, ఆగతా=వచ్చినది) 'అక్షతయోనిః' అను పదమునకు 'దోషం వినా' అనియు; 'పౌనర్భవేన' అనుదానికి 'యదిగృహీతా యేన కేనచిత్' అనియు; 'పునస్సంస్కార మర్హతి' అనుదానికి 'భూయస్తు సంస్కార్యా' 'సంస్కర్తవ్యా' అనియు; బ్రహ్మపురాణము వ్యాఖ్యానము చేసియున్నది. ఇందు, 'భర్తృగృహం' 'భర్త్రాసంస్కర్తవ్యా' అనుటచే కౌమారుడే భర్తగాని అన్యుడు భర్తగాడనియు, అన్యులందా వ్యవహార మౌపచారికమనియు,

కౌమారునికే భార్యగాని రెండవవానికి భార్యగాదనియు, రెండవవానిని కై కొనుట పాప మనియు, రెండవవానికి స్వీయ గాదనియు స్పష్టము.

''గతప్రత్యాగతా'' అను పదమునకు 'లేచిపోయి మరల భర్తయింటికి వచ్చినది' అనునర్థము 'పరిత్యక్తా' అనుదానితోమాత్ర మన్వయించును గాని, 'విధవా' అనుపదముతో అన్వయింపదు; కావున ఈ యర్థమును కల్పించితిమని పూర్వపక్షులు వచించినారు. దేనితో నన్వయించిన, దానికే చెప్పబడెనని యేల గ్రహింపరాదు. భర్త చచ్చిన యెడల మరల భర్తృగృహమునకేల వచ్చును? భర్తయుండిన రావచ్చును. సంస్కారము కావచ్చును. బ్రహ్మపురాణమందును 'విధవా' 'త్యక్తా' అని యిరువురును చెప్పబడిరి. అందు ''త్యక్త్వా భర్తృగృహం గచ్ఛే'' త్తనునది త్యక్తతో మాత్ర మన్వయించును గాన దానికే ప్రాయశ్చిత్తమును, సంస్కారమును. అట్లే మనుస్మృతియందును గ్రహింపవలయును.

ఎవడయిన నొకపాపిష్ఠుడు ఔరసాదిపుత్రులను బొందు యోగ్యతను కోల్పోయి, పాపాత్మురాలయిన పునర్భువును గ్రహించిన, దానియందొక పుత్రుడు గలిగిన ఆపాపిష్ఠుడును సర్వాభావమున ఈపాపిష్ఠునికి ఉపయోగించును గాకయని, ధర్మశాస్త్రము ఒకసంస్కారమును చెప్పగా అది ధర్మ్యవివాహ మని వ్యవహరించుటకన్న పొరబా టేమున్నది.

పూ॥ అక్షతను సంస్కరింపగా పుత్రునియందు స్వామ్యము కలిగినది. క్షతకు సంస్కారము లేదు. తత్పుత్రునియందు స్వామ్య మెట్లు గలుగును?

ఉ॥ తద్భర్తకు శుల్కమిచ్చినయెడల పుత్రునియందు స్వామ్యము కలుగును. అట్లని నారదులవారు చెప్పియున్నారు.

''పునర్భువాం విధి స్త్వేషః స్వైరిణీనాం ప్రకీర్తితః।
పూర్వా పూర్వా జఘన్యా సా శ్రేయసీ తూత్తరోత్తరా॥
అపత్య ముత్పాద యితుః స్తాసాం యా శ్శుల్కతోఽహృతాః।
అశుల్కాపహృతాయాం తు క్షేత్రిక స్యైవ తద్ధనమ్॥''

''వారిలో శుల్కమిచ్చి గ్రహించిన దానియందు పుట్టినవాడు బీజికి చెందును. శుల్కమీయక గ్రహించిన దానియందు పుట్టినవాడు క్షేత్రికి చెందును.''



అట్లే మరల దాయభాగ ప్రకరణమున

''జాతా యే త్వనియుక్తాయా మేకేన బహుభి స్తథా।
అరిక్థభాజస్సర్వే స్యు ర్బీజినా మేవ తే సుతాః॥
దద్యు స్తే బీజనే పిండం మాతాచే చ్ఛుల్కతో హృతా!
అశుల్కాపహృతాయాం తు పిండదా వోఢు రేవ తే॥''

''అనియుక్తయందు, ఒకనికిగాని పలువురకుగాని పుట్టినవారు దాయహీనులు, వారు ఉత్పాదకులకే సుతులు. అయినను, తల్లిగనుక శుల్కముచే హరింపబడెనా వారు బీజికే పిండము నీయావలయును. శుల్కమీయక గ్రహింపబడిన, వారు క్షేత్రికే పిండము నీయవలయును.'' కనుక సంస్కారశుల్కములచే పౌనర్భవులయందు ఉత్పాదకునికి స్వామ్యము కలుగును. అనగా వానిచేతి పిండమునకు హక్కుగలుగును. ఆపిండముకై ఇన్నిమార్గములు పూర్వ యుగములయందు చెప్పబడినవి. ఇంతచేసినను, వీనికి ఈపౌనర్భవత్వమయినను జన్మమాత్రముచేత గలుగదు. ఎట్లనిన,

''పౌనర్భవం తు తనయం జాతమాత్రం సమానయేత్।
కృత్వా పౌనర్భవస్తోమం జాతమాత్రస్య తస్య వై॥
సర్వాన్స్తు కుర్యాత్సంస్కారాన్ జాతకర్మాదికాన్నరః।
కృతే పౌనర్భవస్తోమే సుతః పౌనర్భవ స్తతః॥'' కాళికాపురాణము.

''పౌనర్భవుని పుట్టినవెంటనే తెప్పింపవలసినది. తెప్పించి పుట్టినవెంటనే వానికి పౌనర్భవస్తోమము చేయవలసినది. చేసి జాతకర్మాది సంస్కారములనెల్ల చేయవలసినది. పౌనర్భవస్తోమము చేసినతరువాత వాడు పౌనర్భవుడగును.'' అయినను వీడు క్షత్రియజనితు డయిన వీనికి రాజ్యము లేదు.

''ఔరసః క్షేత్రజ శ్చైవ దత్తః కృత్రిమ ఏవచ।
గూఢోత్పన్నోఽపవిద్ధ శ్చ భాగార్హా స్తనయా ఇమే॥
కానీన శ్చ సహోఢ శ్చ క్రీతః పౌనర్భవ స్తథా।
స్వయందత్త శ్చ దాస శ్చ షడిమే పుత్రపాంసవః॥
అభావే పూర్వపూర్వేషాం పరా న్సమభిషేచయేత్।
పౌనర్భవం స్వయందత్తం దాసం రాజ్యే న యోజయేత్॥''

"పూర్వాపూర్వులు లేనియెడల ఉత్తరోత్తరునికి రాజ్యాభిషేకము చేయవలయును. పౌనర్భవ స్వయందత్త దాసులను మాత్రము రాజ్యమున నియోగింప గూడదు."

క్షత్రియునికేగాని అన్యునికి రాజ్యాధికారములేదు. పౌనర్భవునికి జాతి లేదు గనుక క్షత్రియుడు గాడు. 'రాజధర్మాన్ ప్రవక్ష్యామి' అని మనువు సప్తమాధ్యాయ మారంభించి ద్వితీయ శ్లోకమున—

"బ్రాహ్మ్యం ప్రాప్తేన సంస్కారం క్షత్రియేణ యథావిధి।
సర్వ స్యాస్య యథాన్యాయం కర్తవ్యం పరిరక్షణమ్॥"

"యథావిధిగా బ్రాహ్మ్యసంస్కారమును అనగా ఉపనయన సంస్కారమును పొందినక్షత్త్రియుడు, ఈసమస్తముయొక్కయు రక్షణమును యథాన్యాయముగా చేయవలయును" అని చెప్పెను. కనుక ఉపనయనసంస్కారము పొందిన క్షత్త్రియునికేగాని రాజ్యాధికారము లేదు.

"సర్వవర్ణేషు తుల్యాసు పత్నీ ష్వక్షతయోనిషు।
ఆనులోమ్యేన సంభూతా జాత్యా జ్ఞేయా స్త ఏవ తే॥" మనుః.

"సకలవర్ణములయందును, సవర్ణలును, పత్నులును అనగా ధర్మభార్యలును, అక్షతయోనులును, అగువారియందు పుట్టినవారు తల్లిదండ్రులజాతి గలవారు అగుదురు." పునర్భువుద్వితీయునికి పత్ని గాదు. కనుక పౌనర్భవునికి జాతి లేదు. కనుకనే ఉపనయనాది సంస్కారము లేదు. కనుకనే,

"ద్వితీయేన తు యః పిత్రా సవర్ణాయాం ప్రజాయతే।
అవావట ఇతి ఖ్యాతః శూద్రధర్మా స జాతితః॥" దేవలః.

"రెండవ తండ్రివలన సవర్ణయందు పుట్టినవాడు అవావటు డనబడును. వాడు జాతిచే శూద్రతుల్యుడు."

"వ్రతహీనా న సంస్కార్యాః స్వతంత్రా స్వేవ యే సుతాః।
ఉత్పాదితాః సవర్ణేన వ్రాత్యాఇవ బహిష్కృతాః॥" దేవలః.

"సవర్ణునిచేత స్వతంత్రలయందు పుట్టింపబడినవారు వ్రతహీనులు, వారికి సంస్కారము చేయకూడదు. వారు వ్రాత్యులవలె బహిష్కృతులు." వ్రాత్యులవలెననుటచే ఉపనయనసంస్కారము లేదని యర్థము. ఎట్లనిన,

"ద్విజాతయ సవర్ణాసు జనయం త్యవ్రతాం స్తు యాన్।
తాన్ సావిత్రీ పరిభ్రష్టాన్ వ్రాత్యా నితి వినిర్దిశేత్॥" మనుః.



"సవర్ణలయందు ద్విజాతులకు పుట్టినవారు ఉపనయన సంస్కారరహితులైనయెడల వ్రాత్యులనబడుదురు." పురుషునికి సంస్కారమనగా ఉపనయనము. అదియే ప్రధాన సంస్కారము గావున, ఆ శబ్దము నిరుపపదముగా ప్రయోగింపబడినయెడల ఉపనయనమునే తెలియజేయును. ఎట్లనిన,

"అజ్ఞానాత్ప్రాశ్య విణ్మూత్రం సురాసంస్పృష్ట మేవ చ।
పునస్సంస్కార మర్హంతి త్రయోవర్ణా ద్విజాతయః।
వపనం మేఖలాదండో భైక్షచర్యా వ్రతాని చ।
నివర్తంతే ద్విజాతీనాం పునస్సంస్కార కర్మణి॥" మనుః.

క్షౌరము, మౌంజి, దండము, భిక్ష, వ్రతములును పునస్సంస్కారమందు కూడవు అనుటచే, పునస్సంస్కారము పునరుపనయన మని స్పష్టము. కనుక బ్రాహ్మ్య సంస్కారముగాక తక్కిన జాతకర్మాది సంస్కారములు కలవు. కనుకనే కాళికాపురాణమున 'సర్వాం స్తు కుర్యాత్సంస్కారాన్ జాతకర్మాదికాన్ నరః' అని యున్నది. బ్రాహ్మసంస్కారమును క్షత్త్రియత్వమును లేవు గాన వీనికి రాజ్యము లేదు. ఈ పౌనర్భవుడుమాత్రమేకాక వీని తల్లిదండ్రులును బహిష్కృతులని యెఱుగవలయును. ఎట్లనిన,

"పునర్భూ శ్చాపి తద్భర్తా తా వుభౌ స్మృతినిందితౌ।
సద్భి ర్విగర్హితౌ స్యాతాం సర్వకర్మ బహిష్కృతౌ॥" గౌతమః.

"పునర్భువును దానిమగడును, ఇద్దఱును స్మృతినిందితులు, పెద్దలచేత గర్హింపబడినవారు. సర్వకర్మ బహిష్కృతులు."

పూ॥ ఏదియేమయినను సరియేగాని, అక్షతయోని సుతుఁడగు పౌనర్భవునికి మాత్రము నింద్యతలేదు.

ఉ॥ కనుకనే లోహితమహర్షి —

"అక్షతాయాం క్షతాయాం వా జాతౌ పౌనర్భవౌ మతౌ।
తౌ చాతినిందితౌ పాపౌ పుత్రాభాసౌ ప్రకీర్తితౌ।
అకీర్తికారకౌ బంధుజనానాం దూషితౌ ఖిలౌ।
అతినైచ్యం గతౌ హేయౌ ధర్మశాస్త్రప్రదూషితౌ।
పితృదోషైకజనకౌ న యోగ్యౌ యస్య కస్యచిత్॥"

"అక్షత పునర్భువునందును క్షతపునర్భువునందును పుట్టిన పౌనర్భవులిద్దఱును అతినిందితులు, పాపులు, పుత్రాభాసులు," అని చెప్పబడినారు. వా

రుభయులు బంధుజనులకు అకీర్తి కారకులు, దూషితులు, ఖలులు, అతినీచులు, వదలి వేయవలసినవారు. ధర్మశాస్త్రములయందు దూషింపబడినవారు, తండ్రికి దోషమునే కలుగజేయువారు. ఎవ్వనికైనను యోగ్యులుగారు.'' అని యక్షతయోని పుత్రుని కొనియాడెను.

పూ॥ అట్లయిన బోధాయనులవారు మనోదత్తను కూడ పునర్భువు అన్నారు. వాచాదత్తను కూడ పునర్భువన్నారు. ఇప్పటి వివాహము లెల్ల నట్టివే. కనుక మనతల్లులందఱు పునర్భువులు, మనమెల్ల పౌనర్భవులము.

ఉ॥ నియత ప్రథమసంబంధము గలదియే, పునస్సంబంధముచేత పునర్భువని బోధాయనులవారి యభిప్రాయము. కానియెడల వరణభంజక వచనములు విరోధించును.

"స్త్రీపుంసయో స్తు సంబంధే వరణం ప్రాగ్విధీయతే।
వరణా ద్గ్రహణం పాణేః సంస్కారోఽయం విలక్షణః
తయో రనియతం ప్రోక్తం వరణం దోష దర్శనే॥" నారదః.

"దోషమగపడిన, వరణము అనియతము."

"ప్రతిశ్రుత్యా ప్యధర్మసంయుక్తాయ న దద్యాత్॥ గౌతమః.
"వాగ్దానము చేసినను అధర్మయుక్తుని కీయగూడదు."

మఱియు మనువు వాగ్దత్తకును పతిమృతియందు నియోగమునే చెప్పెను. దానిని మూఁడు యుగములకే చెప్పెను. ఈయుగమున కేమిధర్మమో చెప్పలేదు. కనుక నియోగమునకు ప్రతికూలముగా ఇతరమహర్షులు విధించిన పునర్దానము కలియుగమున కని వ్యవస్థాపింపవలయును.

"అద్భి ర్వాచా చ దత్తాయాః మ్రియే తాథ వరో యది।
నచ మంత్రోపనీతా స్యా త్కుమారీ పితు రేవసా॥" వసిష్ఠః.।

"ఉదకదానమును వాగ్దానమును అయినవెనుక వరుడు మృతిబొందిన, మంత్ర సంస్కారముగాకయుండిన అకన్య తండ్రికే చెందును." "న చ తౌ దంపతీ స్యాతామ్" అను పాఠమందు "ఆ వధూవరులు భార్యాభర్తలు కారు." అని యర్థము. కొందఱు బుద్ధిమంతులు పునర్భువునుగానే ఇచ్చుటకొఱకు ఈ స్వామ్యము మరలతండ్రి కీయబడినదని వచించినారు. ఈకన్య తండ్రిదే యనుటచే మృతునిదిగాదని స్పష్టము. స్వామి యిచ్చుటచే రెండవవానికి స్వక్షేత్రమగును. పూర్వునిది కామిచే పరక్షేత్రముగాదు, పునర్భవయిన స్వక్షేత్రముగాదు, పరక్షేత్రమగును. కనుక నిది పునర్భువుగాదని స్ప



ష్టము. పునర్భువునుగా ఇచ్చుటకు స్వామ్యమేల? జనకునికి స్వామ్యము లేకయే కదా ఊఢలు పునర్భువు లగుచున్నారు. పునర్భూత్వము ఈ స్వామ్యము చేత తప్పనియెడల దీనివలన పురుషాన్నృత పాతకముమాత్రము తప్పునా? కనుక పురుషాన్నృత పాతకము జనకునికి రాకయే పునర్భువుకాగలదానిని పురుషాన్నృతపాతకము చేసియే పునర్భువునుగా చేయవలసినదియని యొకవిధియుండునా? కనుక నిది యథావిధిగా నిచ్చి ధర్మపత్నిని చేయవలయునని విధియని సిద్ధాంతము. ఇట్లే వ్యాసులవారును చెప్పియున్నారు.

"కన్యా న్యస్మై ప్రదాతవ్యా వాగ్దానేతు కృతే వరే।
మృతే న్యస్మై ప్రదాతవ్యా మృతే సప్త పదాత్పరా॥" వ్యాసః.

"వాగ్దానమాత్రమునకు పిమ్మట వరుడు మృతిబొందిన ఆకన్య నన్యుని కీయవలసినది. సప్తపదమునకు ముందు మృతిబొందిన నన్యునికీయవలసినది." ఇందువలన సప్తపదమునకు పిమ్మట ప్రదానముకూడదు. కావునను, ధర్మ్యవివాహమునకుగాను, 'అద్భిర్వాచా చ దత్తాయాః' అని వసిష్ఠులవారే వేఱే శ్లోకముచేత పునర్దానమును విధించిరిగనుకను,

"పాణిగ్రాహే మృతే బాలా కేవలం మంత్రసంస్కృతా।
సా చే దక్షతయోనిః స్యా త్పున స్సంస్కార మర్హతి॥"

"మంత్రసంస్కార మాత్రమయిన యక్షతయోనికి మరల సంస్కారము చేయవలయును" అను వసిష్ఠవచనమును సప్తపదమునకు పూర్వసంస్కారమునే చెప్పుచున్నది. శాస్త్రప్రదీపమందు పేరుచెప్పక యొకప్రమాణము దాహృతమైయున్నది.

దానిని ప్రతిపక్షులు—

"పంచత్వంచే ద్వరోగచ్ఛే ద్వాగ్దానే తు కృతే సతి।
కన్యా న్యస్మై ప్రదాతవ్యా తథా సప్తపదాత్పరమ్॥"

అని యుదహరించినారు. ఈశ్లోకము పైనుదాహరించిన వ్యాసవచనముతో 'పరమ్మ్' ను చోట తప్ప కడమయెల్ల యంశములను సమార్థముగానుండుటచేతను, సప్తపదమునకు తర్వాత అని గ్రహించితిమేని, ఇది వఱకు విమర్శించిన సకల స్మృతులకును విరుద్ధమగుటయేకాక, సప్తపదమునకు తర్వాత ఏయవధివఱకో ఆయవధి లేక యనవస్థ యగును గనుకను, 'పరమ్మ్' ను పదము 'పురా' యను పదమునకు మాఱుగా పొరబాటువలన పడిన దనియే చెప్పవలయును. లేదా, పరం=తరువాత అనగా వాగ్దానమునకు తర్వాత,ఆసప్తపదాత్=సప్తపదమువఱకును, పునర్దానము చేయవచ్చును, అనియైనను వివరింపవలయును. కాశ్యపులవారును వాచాదత్తాదుల నేడుగురను చెప్పి మంత్రసంస్కారమునకు ముందుదోష మగపడిన అన్యుని కీయవలసిన దని విధించియున్నారు.

"సప్త పౌనర్భవాః కన్యాః వర్జనీయాః కులాధమాః।
వాచాదత్తా మనోదత్తా కృతకౌతుకమంగళా।
ఉదకస్పర్శితా యాచ యాచ పాణిగృహీతికా।
అగ్నిం పరిగతా యాచ పునర్భూః ప్రసవా చ యా॥"

"వాచాదత్తాదు లేడుగురును పౌనర్భవకన్యలు కులాధములు వీరిని గ్రహింపగూడదు."

"కులశీలవిహీనస్య షండాది పతితస్యచ।
అపస్మారి వికర్మస్థ రోగిణాం వేషధారిణామ్॥
దత్తా మపి హరేత్కన్యాం సగోత్రోఢాం తథైవచ।
మంత్రసంస్కార రహితా దేయాఽన్యస్మై వరాయతు॥
అన్యథాతు హరన్ దండ్యో వ్యయం దద్యాచ్చ సోదయమ్॥"

"మంత్రసంస్కారమునకుముందు దోషమగపడిన, అన్యుని కీయవలయును." కనుక ననియత ప్రథమ సంబంధముగల వాగ్దత్తాదులు పునర్భువులు కారనియు, మన మెల్ల పౌనర్భవులము కామనియును, సిద్ధాంతము.

మంత్రసంస్కారమునకు ముందు ఈయవచ్చుననుటచే తతఃపర మీయగూడదనియు, ఇచ్చిన పాతక మనియు, పునర్భువు పాపిష్ఠ యనియు, స్పష్టము. కనుకనే పునర్భూ పౌనర్భవాదులయన్నమును భుజింపగూడదని మహర్షులు విధించినారు. బృహత్పరాశరులవారు నిజస్మృతి పంచమాధ్యాయము-శ్రాద్ధగర్హ్యాతులు కాణాః, పౌనర్భవో, రోగీ, పిశునో, వృద్ధిజీవకః; మఱియు వీని తల్లియొక్క యోగ్యతను వీనియోగ్యతను మరల చెప్పుచున్నారు—

"అన్యదత్తా తు యా కన్యా పున రన్యస్యదీయతే।
అస్యా అన్నం న భోక్తవ్యం పునర్భూ స్సా ప్రకీర్తితా॥"

"ఒకని కీయబడి మరలనింకొకనికీయబడిన కన్య పునర్భువు, దానియన్నమును భుజింపగూడదు."

"కౌమారం పతి ముత్సృజ్య యా త్వన్యం పురుషం శ్రితా।
పునః పత్యుర్గృహం యాయా త్సా పునర్భూ ద్వితీయకా॥
అసత్సు దేవరేషు స్త్రీ బాంధవైర్యా ప్రదీయతే।
సవర్ణాయ సపిండాయ పునర్భూ స్సా తృతీయకా।
ఆసు పుత్రాస్తు యే జాతా స్తే వర్జ్యా హవ్యకవ్యయోః॥" అని



నారదులవారు చెప్పినట్లే ముగ్గురు పునర్భువులను నలుగురు స్వైరిణులను చెప్పి వారియందు కలిగిన పుత్రులను హవ్యకవ్యములయందు వర్జింపవలయునని చెప్పినారు. ఆదిలోనే పునర్భువుచేతియన్నమును భుజింపగూడదని చెప్పినారు. ఇందు ప్రథమ పునర్భువుయొక్క లక్షణశ్లోకముగాక తక్కిన శ్లోకములు ఆఱును నారదస్మృతి యందలివే, ప్రథమపునర్భూ లక్షణమును మాత్రము శబ్దభేదముచే అభోజ్యాన్నతనుగూడ చెప్పుటకై, మార్చినారు. సంఖ్య రెండుస్మృతులయందును సమముగానున్నది. కనుక నారదోక్త ప్రథమపునర్భువే, అనగా పునస్సంస్కృతాక్షతయోనియే బృహత్పరాశరులవారిచేతను ప్రథమగా చెప్పబడినది, అనగా అక్షతయోనియే అభోజ్యాన్నగా చెప్పబడినదని సిద్ధాంతము. అది యభోజ్యాన్నయగుటకు సంశయమేమి? దాని పుత్రుని యోగ్యతను ఇప్పుడే లోహితమహర్షి వెల్లడిచేసెనుగదా. కనుక పునర్భువులెల్ల అక్షతలైనను క్షతలైనను అభోజ్యాన్నలనియు, వారియం దయోగ్యతాభేదములేగాని యోగ్యతాభేదములు లేవనియు (పౌనర్భవులెల్లరును, అభోజ్యాన్నలనియు, అధము లనియు, పాపు లనియు) నిశ్చయము.

వీరుమాత్రమేకాక వీరిపతులుకూడ ప్రయత్నపూర్వకముగా శ్రాద్ధసమయమున వర్జింపబడవలసినవా రని, బృహత్పరాశరులవారు చెప్పినారు.

"తథైవపతయస్తాసాం వర్జనీయాః ప్రయత్నతః।"

"పుత్రులనుంబోలె వారి పతులనుగూడ ప్రయత్న పూర్వకముగా వర్జింపవలయును." ఆంగిరస స్మృతియు బృహత్పరాశరులవారి శ్లోకమునే "అన్యదత్తాతు యాకన్యా" అను దానిని ధరించియున్నది. అందువలన నదియును అక్షతాది పునర్భువులు వారిపతులు, పుత్రులు, అభోజ్యాన్నులు హవ్యకవ్యముల కనర్హులు అని చెప్పుచున్నది.

కనుక పునర్భవము పరభార్యను గ్రహించిన పతితునికి పిండము దొరకుటకొఱకు చెప్పబడిన సంస్కారముగాని గృహస్థాశ్రమముకొఱకు గాదనియు, కామముకొఱకు గా దనియును, స్పష్టము. కనుక నీ సంస్కారము బ్రాహ్మాది వివాహములలో చేరినది గాదు. ఎట్లనిన ప్రథమదానమువలన,

"గౌరీం దదన్నాకపృష్ఠం వైకుంఠం రోహిణీం దదత్।
కన్యాం దదద్బ్రహ్మలోకం రౌరవం తు రజస్వలామ్॥" పరాశరః.

అని బ్రహ్మలోకమును, రెండవప్రదానమువలన,

"న దత్త్వా కస్యచి త్కన్యాం పునర్దద్యా ద్విచక్షణః।
దత్త్వా పునః ప్రయచ్ఛన్హి ప్రాప్నోతి పురుషానృతమ్॥" మనుః.

'శతమశ్వానృతే హంతి సహస్రం పురుషానృతే' అను పురుషానృతపాతకము నను పొందును. మఱియు,

''దశ పూర్వాన్ పరాన్ వంశ్యా నాత్మానం చైకవింశతిం।
బ్రాహ్మోఢాజ స్సుకృతకృ న్మోచయే దేనసః పితౄన్॥'' మనుః.

బ్రాహ్మాది వివాహమువలన గలిగిన సుతుడు పూర్వులను పదితరములవారిని పరులను పదితరములవారిని, తనతో ఇరువదియొక్కరిని, సుకృతము చేయువాడైయున నరకమును తరింపజేయును. పౌనర్భవుడు చెడుతెప్ప ఏటిలో ముంచునట్లు నరకమున ముంచు నని మీకు తెలియనేతెలియును. కనుక నిది బ్రాహ్మాది వివాహము గాదు. నారదులవారును ఈ యర్థమునే తెలియజేసినారు.

జాతరజస్కావివాహము లేదు.

౧. ''అతో ఽ ప్రవృత్తే రజసి కన్యాం దద్యాత్పితా సకృత్।
మహా దేనః స్పృశే దేన మన్యథైవం విధి స్సతామ్॥
౨. సకృదంశో నిపతతి సకృత్కన్యా ప్రదీయతే।
సకృ దాహ దదా నీతి త్రీ ణ్యేతాని? సతాం సకృత్॥
3. బ్రాహ్మాదిషు వివాహేషు పంచ స్వేష విధిః స్మృతః।
గుణాపేక్షం భవే ద్దాన మాసురాదిషు చ త్రిషు॥
౪. కన్యాయాం దత్తశుల్కాయాం శ్రేయాన్ శ్చేద్వర ఆవ్రజేత్
ధర్మార్థకామసంయుక్తో వాక్యం తత్రానృతం భవేత్॥
౫. అష్టౌవివాహా వర్ణానాం సంస్కారార్థం ప్రకీర్తితాః।
బ్రాహ్మస్తు ప్రథమ స్తేషాం ప్రాజాపత్య స్తథాపరః॥
౬. ఆర్షశ్చైవ హి దైవ శ్చ గాంధర్వ శ్చాసుర స్తథా।
రాక్షసో నవరస్తస్మా త్పైశాచ శ్చాష్టమో ఽ ధమః॥
౭. ఏషాం తు ధర్మ్యాశ్చత్వారో బ్రాహ్మాద్యా స్సముదాహృతాః।
సాధారణః స్యా ద్గాంధర్వ స్త్రియో ధర్మ్యాస్తతః పరమ్॥
౮. పరపూర్వా స్త్రియస్త్వన్యా స్సప్త ప్రోక్తా యథాక్రమమ్॥'' నారదః.

౧. ''రజోదర్శనమునకు ముందు తండ్రి ఏకవారము కన్య నీయవలసినది. అన్యథాజరిగించిన నతనికి మహాపాతకము గలుగును. ఇది సజ్జనులయొక్కవిధి. అనగా సజ్జనులిట్లు చేయుదురు.'' మహాపాతకము రజస్సు అతిక్రమించుటచేత మాత్రమే యని చెప్పగూడదు. అసకృద్దానమునకును మహాపాతకము గలుగును.



ఈ సంశయము తీఱుటకే ౨. సకృదంశో నిపతతి మొదలయిన శ్లోకమును వెంటనే చెప్పినారు. 3. 'ఈసకృద్దానము అనగా ఒక్కమాఱే ఇచ్చుట. బ్రాహ్మాది పంచవివాహములయందును విధి, ఇందువలన రెండుదానములుగల పునర్భువు బ్రాహ్మాద్యర్థ గామి స్పష్టము. ఆసుర రాక్షస పైశాచముల యందు గుణమును బట్టి జరుగును, ఇదియును సంస్కారమునకు పూర్వమే యని యెఱుగవలయును. ఎట్లనిన వసిష్ఠులవారు—

''బలాచ్చేత్ ప్రహృతా కన్యా మంత్రై ర్యది న సంస్కృతా।
అన్యస్మై విధివ ద్దేయా యథా కన్యా తథైవ సా॥'' అని.

''మంత్రైర్యది న సంస్కృతా'' 'మంత్రసంస్కారము కాకయుండెనా' అని చెప్పినారు. నారదులవారును ఆవిషయమునే పైశ్లోకములో తెలియజేయుచున్నారు. ౪. 'కన్యకొఱకు శుల్క మిచ్చినవెనుక యోగ్యుడు వచ్చినయెడల అనగాధర్మార్థకామసంపన్నుడు వచ్చినయెడల మొదటిప్రతిజ్ఞ అబద్ధమగును.' 'వర్ణములకు సంస్కారముకొఱకు ఎనిమిదివివాహములు చెప్పబడినవి. బ్రాహ్మ, ప్రాజాపత్య, ఆర్ష, దైవ, గాంధర్వ, ఆసుర, రాక్షస, పైశాచములు. వీనియందు నాలుగు ధర్మ్యములు. గాంధర్వము సాధారణము, మూడు అధర్మ్యములు. అటుపైన పరపూర్వలు అనుస్త్రీలువేఱేయున్నారు. వారు ఏడుగురు, ఇచ్చట 'అన్యాః' అనుటచే పరపూర్వలు అనగా అక్షతపునర్భువు మొదలగువారు పైని చెప్పబడిన బ్రాహ్మాది వివాహములలో చేరినవారు కారు, అని స్పష్టము గదా? కనుకనే పౌనర్భవవిధిచే సంస్కరింపవలయునని బోధాయనులవారు చెప్పినారు.

''నిసృష్టా, యా, హతా, వాపి యస్యై భర్తా మ్రియేత వా।
సా చే దక్షతయోనిః స్యాత్ గతప్రత్యాగతాపివా।
పౌనర్భవేన విధినా పునస్సంస్కార మర్హతి॥''

వివాహమంత్రములు ఆవృత్తి సహములు కావు.

ప్రథమః ప్రశ్నః తృతీయః ఖండః.

మం॥ సోమః ప్రథమోవివిదే, గంధర్వో విపిద ఉత్తరః, తృతీయోగ్నిష్టేపతి స్తురీయ స్తే మనుష్యజాః.

హరదత్తభాష్యము.

సోమః ప్రథమః త్వాం వివిదే లబ్ధవాన్, తత ఉత్తరో గంధర్వః విశ్వావసుః వివిదే, తృతీ యో ఽగ్ని స్తే పతిః, తురీయ స్తే మనుష్యజాః అహం

తే చతుర్థః పతిః, "సోముడు నీకు మొదటిపతి, విశ్వావసువు రెండవపతి, అగ్ని మూడవపతి, మనుష్యజాతుడనైన నేను నీకు నాల్గవపతిని."

'మనుష్యజాః' అనుదానిని ప్రతిపక్షులు అదంతమునుగా గ్రహించినారు. అదంతము బహువచనమును ఐనయెడల తురీయః అను ఏకవచనము బాధించును, అది సకారాంతమును ఏకవచనమును. అట్లే హరదత్త భాష్యము ఏకవచనమునుగా వివరించినది.

ఇచ్చట ద్వితీయభర్త 'పంచముడను నేను' అని చెప్ప నొప్పునుగాని 'నాలవభర్తను నేను;' అని యెట్లు చెప్పవచ్చును?

పంచమః ఖండః.

మం॥ "ప్ర త్వా ముంచామి వరుణస్య పాశాద్యేన త్వాబధ్నాత్సవితా సుకేతః।
ధాతుశ్చ యోనౌ సుకృతస్య లోకే స్యోనం మే సహ పత్యా కరోమి॥"

హ॥ భా॥ "ఉత్తరాభ్యాం యోక్త్రం విముంచతి. ప్రత్వాముంచామి త్వాంవరుణస్య పాశాత్ప్రముంచామి. యదిదం యోక్త్రవిమోచనం తదేవ నిరూప్యతే యేనపాశేన త్వా మబధ్నాత్ సవితా సర్వస్య ప్రేరయితా వరుణస్సుకేతః సుచిత్తః ధాతుర్యోనౌ బ్రహ్మణశ్చలోకే కీదృశే సుకృతస్యలోకే పుణ్యకర్మణో లోకే స్యోనం తే తవ మయా పత్యా సహావస్థితిం కరోమి."

"మం॥ ఇమం విష్యామి వరుణస్య పాశం య మబధ్నీత సవితా సువేశః।
ధాతుశ్చ యోనౌ సుకృతస్య లోకే రిష్టాం త్వా సహ పత్యా కృణోమి॥"

హ॥ భా॥ "యోక్త్రవిమోచనేన ఇమం వరుణస్య పాశం విస్రంసయామియం పాశ మబధ్నీత బద్ధవాన్ సువేశః సుసుఖః భక్తానాం సుఖకర్తా ఇత్యర్థః ధాతుశ్చ యోనా విత్యాది సమానం అరిష్టాం అవినాశినీమ్."

వధువునకు చుట్టిన పలుపును విప్పుచు వరుడు చెప్పు మంత్రము లివి. "నిన్ను వరుణపాశమునుండి విడిపించుచున్నాను. ఏపాశముచేత నిన్ను వరుణుడు కట్టివేసెనో ఆపాశమునుండి విడిపించుచున్నాను. పుణ్యకర్మలయొక్క లోకమయిన బ్రహ్మలోకమున, నీకు, పతినైన నాతోగూడ నివాసమును గలుగ జేయుచున్నాను."

ఒక స్త్రీ బ్రహ్మలోకమున ఎందఱితో నివసించును?

"ఏపాశమున వరుణుడు నిన్ను గట్టెనో ఆయీపాశమును విప్పివేయుచున్నాను. బ్రహ్మలోకమున శాశ్వతమయిన ఉనికిని పతినైన నాతోగూడ నీకు గలుగ జేయుచున్నాను."



వరుణపాశమును ప్రథమభర్త విప్పివేసెనుగావున, ద్వితీయభర్త వరుణపాశమును విప్పవింతకు శశములకు శృంగములు మొలవవా!

దశమః ఖండః.

మం॥ "ఉదీర్ష్వాతో విశ్వావసో నమ సేడామహే త్వా।
అన్యా మిచ్ఛ ప్రఫర్వ్యగ్ం సం జాయాం పత్యా సృజ।
ఉదీర్ష్వాతః పతివతీ హ్యేషా విశ్వావసుం నమసా గీర్భిరీట్టే।
అన్యామిచ్ఛపితృషదగ్ం వ్యక్తాగ్ం స తే భాగో జనుషా తస్య విద్ధిమ

హ॥భా॥ "ఉదీర్ష్వ ఉత్తిష్ఠ అత శ్శయనాత్ హేవిశ్వావసో గంధర్వనా॥" తద్బుద్ధ్యా దండః స్థాపితః తత్సంబుద్ధిః, నమసా నమస్కారేణత్వాం ఇడామహే యాచామహే. అన్యా మిచ్ఛ ప్రఫర్వ్యగ్ం ప్రథమవయసం స్త్రియమ్ ఇమాం తు మమ జాయాంపత్యా మయా సహాసంసృజ యోజయ. ఉదీర్ష్వాతః శయనాదుత్తిష్ఠ, పతివతీ హ్యేషా ఛాందసా ధ్రిస్వత్వం ఏషాహిపతివతీమయా పత్యాతద్ధితం విశ్వావసుంనమసానమస్కారేణ గీర్భిః స్తుతిభిః ఈట్టేయాచే అతశ్చ అన్యామిచ్ఛ పితృషదం పితృగేహేస్థితాం వ్యక్తాం అర్థదత్తాం అసమాప్తవివాహాం స హి తే భాగః సర్వస్వభూతో వివాహఃజనుషా జన్మనా తదర్థం త్వం జాత ఇత్యర్థః తస్య విద్ధి తం లభస్వ".

"ఓయి విశ్వావసుడా ఇక్కడనుండి లెమ్ము, నిన్ను నమస్కారముతో యాచించుచున్నాను. ప్రథమవయస్సులోనున్న మఱియొక స్త్రీని గోరుము. ఈనా భార్యను నాతో జేర్పుము. ఇక్కడనుండి లెమ్ము, ఈమె భర్తగలదిగదా. విశ్వావసుడా నిన్ను నమస్కారముతోను స్తుతులతోను యాచించుచున్నాను. కనుక తండ్రియింట నున్న వివాహముగాని యన్యస్త్రీని నీవు గోరుము. అట్టి స్త్రీలకొఱకేగదా నీవు పుట్టినాడవు. అట్టివారినే ఆశ్రయింపుము." ఇందువలన వివాహముకాని స్త్రీలనే అనగా కన్యలనే విశ్వావసువు ఆశ్రయించునుగాన, అనగా వివాహితలను ఆశ్రయింపడుగాన, ద్వితీయవరుడు విశ్వావసువును దిధిషువును వదలిపొమ్మనుట యున్మత్త ప్రలాప మగును 'ప్రథమవయస్సుగలదానిని' 'తండ్రియింటనున్నదానిని' అనువిశేషణములు అవివాహితా వాచకములుకానియెడల స్వభార్యావ్యావర్తకములు కావు.

"సోమకాలే తు సంప్రాప్తే సోమో భుఙ్క్తేఽథ కన్యకాం।
రజో దృష్ట్వా తు గంధర్వః వహ్నిస్తు కుచదర్శనే।
తస్మాదుద్వాహయేత్కన్యాం యావన్నర్తుమతీ భవేత్॥"

అనుప్రమాణముచేత నుద్వాహితను విశ్వావసుడు ఆశ్రయింపడు. ద్వితీయ [illegible]మంత్రముల నెట్లుచ్చరించును.

ప్రథమసంస్కారఫలము నశింపదుగాన, పునస్సంస్కారమున నీ మంత్రములు అన్వయింపవని సిద్ధాంతము.

మఱియు, "పాణిగ్రహణికా మంత్రాః పితృగోత్రాపహారకాః." అని బృహస్పతియు, "స్వగోత్రాద్భ్రశ్యతే నారీ ఉద్వాహాత్సప్తమే పదే," అని లిఖితుడును, "స్వగోత్రాద్భ్రశ్యతే నారీవివాహాత్సప్తమేపదే" అనియముడును, పాణిగ్రహణమంత్రములచేత పితృగోత్రము తొలగును అని చెప్పుచున్నారు. కనుక పితృగోత్రము గలిగియున్న కన్యకు పాణిగ్రహణమంత్రములు చెప్పవచ్చును కాని పితృగోత్రములేనియాధకు ఆమంత్రము లెట్లు చెప్పవచ్చును? కనుక ఈరకకు పాణిగ్రహణమంత్రములు చెప్పగూడదు. ఆమంత్రములు లేక వివాహనిష్పత్తికానేరదు.

"పాణిగ్రహణమంత్రాస్తు నియతం దారలక్షణమ్॥" మనుః.
నోదకేన న వాచా వా కన్యాయాః పతి రుచ్యతే।
పాణిగ్రహణసంస్కారాన్నియతం పతిలక్షణమ్॥" పరాశరః.

కనుక ఆమంత్రములులేక యెవడును వివాహముచేసికొనగూడదు. ఆమంత్రములు వివాహితయందు ప్రవర్తింపవు. కనుక అవివాహితకే వివాహము కలుగునుగాని వివాహితకు పునర్వివాహము సంభవింపదు.

## పౌనర్భవునియధమత.

కనుక పుత్రార్థమగు సంస్కారముగాని యిది భార్యార్థముకాదు. కనుక నే భార్యలనుగూర్చిన యేవచనములును పునర్భువునకు జెందవు. ఎట్లనిన,

"సదృశస్త్రీషు జాతానాం పుత్రాణా మవిశేషతః।
న మాతృతో జ్యైష్ఠ్య మస్తి జన్మతో జ్యైష్ఠ్య ముచ్యతే॥
సమవర్ణాసు యే జాతా స్సర్వే పుత్రా ద్విజన్మనామ్।
ఉద్ధారం జ్యాయసే దత్త్వా భజేర న్నితరే సమమ్॥" మనుః.

"సజాతిస్త్రీలయందు (ఇచట భార్యలే చెప్పబడినారు) పుట్టినవారికి తల్లినిబట్టి జ్యైష్ఠ్యములేదు. జన్మమునలననే జ్యైష్ఠ్యము. అందు జ్యేష్ఠునికి ఉద్ధార మిచ్చి యితరులు సమముగా పంచుకొనవలయును, పౌనర్భవునికి ఏమియును లేదు గదా? కనుకపునర్భువు భార్యలలో చెప్పబడలేదు. ఉత్కృష్టులనుగ్రహించుటచేత క్షత్త్రియా వైశ్యాశూద్రలు ఉత్కృష్టలగుదురు. కనుక నారు ఈ యుంచుకొన్నదానికంటె ఉత్కృష్ట లనియు, తత్పుత్రులు ఈ యుంచుకొనబడినదాని సుతునికన్న శ్రేష్ఠు లనియు చెప్పవలసినది లేదు.



"బ్రాహ్మణ స్యానులోమ్యేన చతస్రస్తు యది స్త్రియః।
తాసాం పుత్రేషు జాతేషు విభాగేఽయం విధిః స్మృతః॥
చతురోఽంశాన్ హరే ద్విప్ర స్త్రీనంశాన్ క్షత్త్రియాసుతః।
వైశ్యాపుత్రో హరే ద్ద్వ్యంశ మంశం శూద్రాసుతో హరేత్॥" మనుః.

"బ్రాహ్మణునికి నాలుగు జాతులయందును భార్యలుండిన, వారియందు పుత్రులుపుట్టిన, అందు విప్రునికి నాలుగుపాళ్లును, క్షత్త్రియా పుత్రునికి మూడును, వైశ్యాసుతునికి రెండును, శూద్రాపుత్రునికి ఒకటియు దాయము." పౌనర్భవునికిలేదు. కనుక నిది వివాహముగాదు. పునర్భువు భార్యగాదు. బ్రాహ్మణుడుగ్రహించిన క్షత్త్రియావైశ్యాశూద్రల కన్న నధమురాలు. ఉంచుకొన్న చెడిపోయినది. దీనికొడుకు ఉంచుకొన్న దానికొడుకు. అది యింతకన్న నెట్లుబుజువు చేయవచ్చును. వీరలచేత భుజింపగూడమి అట్లుండగా వీరిని పంక్తినిపెట్టుకొనియు భోజనము చేయగూడ దని మనువు విధించియున్నాడు.

"పౌనర్భవశ్చ కాణశ్చ యస్య చోపపతిర్గృహే।
ఔరభ్రికో మాహిషికః పరపూర్వా పతి స్తథా।
ప్రేతనిర్యాతక శ్చైవ వర్జనీయాః ప్రయత్నతః।
ఏతాన్ విగర్హితాచారా నపాంక్తేయా న్ద్విజాధమాన్।
ద్విజాతిప్రవరో విద్వా నుభయత్ర వివర్జయేత్॥" మనుః.

"పౌనర్భవుడును, పరపూర్వాపతియు, అనగా పౌనర్భవునినాయనయు, ప్రయత్నపూర్వకముగా వర్జనీయులు, అపాంక్తేయులు, ద్విజాధములు, విగర్హితులు, వీరిని ద్విజవరులు హవ్యకవ్యములయందు జేరనీయగూడదు." ఇట్లు మనువు చెప్పుచుండగా మనువే పునర్వివాహమును ధర్మ్యమును గా విధించె నని పూర్వపక్షులు చెప్పుదురు. యాజ్ఞవల్క్యులవారును,

"రోగీ హీనాతిరిక్తాఙ్గః కాణః పౌనర్భవ స్తథా।
పరపూర్వాపతిః స్తేనః కర్మదుష్టా శ్చ నిందితాః॥"

అని మనువు చెప్పినట్టుగానే చెప్పినారు. మార్కండేయులవారును

"పౌనర్భవస్తథా కాణః కుండోగోళో ధపుత్రకః।
భృతకాధ్యాపకో మైత్రః పరపూర్వా పతి స్తథా॥

అథాన్యే చ వికర్మస్థా వర్జ్యాః పిత్ర్యేషు వై ద్విజాః॥" మార్కండే.

వీర లను అనగా పౌనర్భవ పరపూర్వాపతులను ఎక్కడను బ్రాహ్మణులలో చేరనీయక పోవుటయేగాక వీరు కర్మ బాహ్యులని 'వికర్మస్థాః' అను విశేషణముచేత తెలియజేసినారు. ఈవర్జనీయులెల్లను సమపాపు లనియు, కనుక పునర్భూపుత్రునిదోషము అంధునిదానికన్న నధికముగాదనియు, ప్రతిపక్షుల కుయుక్తి. మఱియు వసిష్ఠులవారు,

"స్వయముత్పాదితః స్వక్షేత్రే సంస్కృతాయాం ప్రథమః। తదలాభే నియుక్తాయాం క్షేత్రజోద్వితీయః। తృతీయః పుత్రికా విజ్ఞాయతే పౌనర్భవశ్చతుర్థః। పునర్భూః కౌమారంభర్తారముత్సృజ్యాన్యైస్సహ చరిత్వా తస్యైవ కుటుంబమాశ్రయతి సా పునర్భూర్భవతి। యా చ క్లీబం పతితం మున్మత్తంవా భర్తార ముత్సృజ్యాన్యం పతిం విందతే మృతే వా సా పునర్భూ ర్భవతి। కానీనః పంచమో। యాపితృగృహే అసంస్కృతా కామా దుత్పాదయేన్మాతామహస్యపుత్రో భవతీ త్యాహుః। గూఢే చ గూఢోత్పన్నః షష్ఠః। ఇత్యేతే దాయాదాః బాంధ వా స్త్రాతారో మహతోభయాదిత్యాహుః॥"

అని పౌనర్భవుడు దాయాదుడు బాంధవుడు భయమునుండి రక్షించువాడు అని చెప్పుటచే పౌనర్భవుడు ఔరసాదితుల్యుడును నిర్దోషుడును అని ప్రతిపక్షులు వాదించుచున్నారు. ఇందుల కుత్తరము, దాయాదులును బాంధవులును నరకభయమునుండి రక్షించువారును అని వసిష్ఠులవారు పౌనర్భవునితో కానీన గూఢోత్పన్నులనుం గూడ చెప్పినారు. నీచులతో చేర్చి గౌరవించుట కన్న ఉత్తములలో చేర్చి తిరస్కరించుట మేలు గాన పౌనర్భవుని కిచ్చిన యోగ్యతను కానీన గూఢోత్పన్నులకును ఇచ్చిరిగాన పౌనర్భవుని ఏపాటి వసిష్ఠులవారు అంగీకరించిరో బుద్ధిమంతులకు తెలియకపోదు. వీనియొక్క అయోగ్యతను ప్రత్యేకించి మహర్షులు చెప్పియున్నారు. అందఱిదోషము సమముగాదు. అందఱిలోను పునర్భూకుటుంబమే మహాపాపిష్ఠము. కూర్మపురాణమున వేదవ్యాసులవారు—

"పౌనర్భవః కుసీదీ చ తథా నక్షత్రదర్శకః।
ద్విజనిందారతశ్చైతే వర్జ్యాః స్యుః శ్రాద్ధసంసది।
సర్వే పున రభోజ్యాన్నా అదానార్హాశ్చ కర్మసు॥"

"పౌనర్భవుడును, ఇంకననేకులును శ్రాద్ధసంఘములయందు చేరబడకూడదనియు, అందఱును అభోజ్యాన్నులు, కర్మలయందు దానార్హులు గారు," అనియు సామాన్యముగా చెప్పి, వీనినిమాత్రము చెప్పియూఱకుండక



"గాంధర్వాలోహ కారాన్నం సూతకాన్నం చ వర్జయేత్।
పునర్భవ శ్చిత్రకస్య హ్యభిశ స్తస్య చైవహి॥"

అని వీనితల్లిచేత భుజింపగూడదని చెప్పి, ఈనిందితులకెల్ల పాపము సమమని పూర్వపక్షులు భ్రమింతురనియే మరల,

"విద్ధప్రజనన స్యాన్నం పరివిత్త్యన్న మేవ చ।
పునర్భువో విశేషేణ తథైవ దిధిషూపతేః॥"

అందఱియన్నముకంటె పునర్భువుయొక్కయన్నము అభోజ్యమని చెప్పినారు. కనుక అందఱిలోను పాపిష్ఠులు ఈపౌనర్భవ పునర్భూవిధవాపతులే గదా. ఇంత మరలమరల పునర్భువువిషయము చెప్ప నేల యనగా-

"దుష్కృతం హి మనుష్యస్య సర్వ మన్నే వ్యవస్థితం।
యో య స్యాన్నం సమశ్నాతి స త స్యాశ్నాతి కిల్బిషమ్॥"

"ప్రతిమనుజునియొక్క సకలపాపమును వానియన్నమం దుండును. ఎవ డెవనియన్నమును తినునో వాడు వానిపాపమునుభక్షించును" అనుటచే పునర్భువుయొక్కపాతకము, కడమయందఱిపాతకమునకన్న నధికము గనుక దానియన్నము భుజించువారు, మహత్తరమయిన పాతకమును భుజింతురని వేదవ్యాసులవారు చెప్పినారు. వారియన్నమును భుజింతుముగాని కిల్బిషమును భుజింపమని ప్రతిపక్షులు చెప్పుచున్నారు. వారిపంక్తిని భుజించినవారికి ప్రాయశ్చిత్తమును మార్కండేయులవారు చెప్పుచున్నారు.

"అపాంక్త్యయస్య యః కశ్చిత్పంక్తౌ భుంక్తే ద్విజోత్తమః।
అహోరాత్రోషితో భూత్వా పంచగవ్యేన శుద్ధ్యతి॥"

"అహోరాత్ర ముపవాసముండి పంచగవ్యము త్రాగవలయును." వారిచేతనే అన్నము తిన్నందునకు ప్రాయశ్చిత్తమును పైఠీనసి చెప్పియున్నాడు.

"పునర్భూపుత్ర శ్చోరః కాండపృష్ఠ స్సేవక శ్చేత్యభోజ్యాన్నాః।
అపాంక్త్యాః అశ్రాద్ధాః ఏతేషాం భుక్త్వాదత్త్వాఽవిజ్ఞానాత్
త్రిరాత్రమ్॥"

"పునర్భూసుతుడు మొదలుగా పైజెప్పిన వారు అభోజ్యాన్నులు, అశ్రాద్ధార్హులు, అపాంక్త్యులు; వీరిచేత అన్నముతిన్నను వీరికిపెట్టినను, అజ్ఞానపూర్వకముగానైన త్రిరాత్రము క్షపణప్రాయశ్చిత్తము." కనుక,

"చరితవ్య మతో నిత్యం ప్రాయశ్చిత్తం విశుద్ధయే
నిన్ద్యైర్హి లక్షణై ర్యుక్తా జాయన్తే ఽ నిష్కృతైనసః॥" మనుః.

"తప్పకుండ ప్రాయశ్చిత్తము చేసికొనవలయును, లేనియెడల పాపము పోదు. ప్రాయశ్చిత్తములు చేసికొనక పాపములను పోగొట్టుకొననివారు, నింద్యలక్షణములతో గూడుకొనినవారై పుట్టుదురు."

"బ్రహ్మహా క్షయరోగీ స్యాచ్ఛ్యావదన్తస్తు మద్యపః॥" గారుడము.

"బ్రాహ్మణుని జంపినవాడు క్షయరోగియై పుట్టును. మద్యపానముచేయువాడు నల్లనిపండ్లుగలవాడగును." (ఈవిషయము నెఱుగక పూర్వపక్షులు 'నిర్దోషు లయినక్షయ్యాదులుగూడ శ్రాద్ధాదులయందు గర్హింపబడి నా' రని చెప్పుచున్నారు.) కనుక,

## పునర్వివాహప్రాయశ్చిత్తము

"అజ్ఞాతం తు ద్విజో యస్తు విధవా ముద్వహేద్యది।
పరిత్యజ్య చ తాం కన్యాం ప్రాయశ్చిత్తం సమాచరేత్" ఆశ్వ.

"విధవను ఎఱుగక పెండ్లిచేసికొనినవాడు దానిని త్యజించి ప్రాయశ్చిత్తము చేసికొనవలయును." ఆద్వితీయ భర్త మొదలగు వారియొక్క ప్రాయశ్చిత్తములు ఆంగిరస స్మృతిలో చెప్పబడియున్నవి. ఎట్లనిన,

"పునర్వివాహితా మూఢైః పితృభ్రాతృముఖైః ఖలైః।
యది సా తే ఖలా స్సర్వే స్స్యుశ్చ నిరయగామినః।
పునర్వివాహితా సా తు మహారౌరవభాగినీ।
తత్పతిః పితృభి స్సాకం కాలసూత్రగతో భవేత్।
దాతా చాంగారశయన నామకం ప్రతిపద్యతే।
తద్దోషశమనా యాథ ప్రాయశ్చిత్త మిదం పరమ్।
దాతా సేతు గత స్సద్యః ధనుష్కోట్యాం సమాహితః।
నిత్యం త్రిషవణస్నాయీ యావకాహార ఏవ వై।
సంవత్సరం ప్రయత్నేన వసే దేవాన్వహం తరామ్।
స్వకృతం యచ్చ తత్పాపం వద న్నిత్య మత న్ద్రితః।
సర్వే ష్వపి చ తీర్థేషు తప్తకృచ్ఛ్రశతం చరేత్।
తత శ్శుద్ధో భవే దేవం వోఢా చాపి తథా పునః।
తద్దోషశమనా యైవ పుణ్యం చాంద్రాయణత్రయమ్।
యత్నా త్కుర్వన్న సేత్తత్ర ఋతుత్రయ మతన్ద్రితః।
ప్రతినిత్యం పంచగవ్యం పిబ న్సద్విధినా రుదన్।



నిర్లజ్జయా లోకపురః కూష్మాండాదీ న్పఠ న్స్తథా।
ద్రుపదాం నామ గాయత్రీం గాయత్రీం వేదమాతరమ్।
సంధ్యాత్రయే సహస్రాణి జప న్స్వస్త్యాఖ్యగం శివమ్।
కృచ్ఛ్రం విధానతః కృత్వా పున స్సంస్కారతః పునః।
పటగర్భ విధానేన శుద్ధో భవతి తత్ర చేత్।
న చే త్తప్తశతం కుర్యాత్పునరుపనయనా త్పరం।
సా చేద్భర్తృద్వయం త్యక్త్వా సేతుస్నాన సహస్రకం।
కృత్వా చ యావకాహారా వర్షమాత్రేణ శుధ్యతి।
యద్యపుత్రా పుత్రిణీ చేత్పతే దేవాశు తైస్సహ।
సా వై పుత్రై స్తదుద్భూతై శ్చండాలత్వం భజేత వై।
వివాహితాం చ విధవాం మహామోహేనవంచకైః।
దత్తాం వివాహ్య తద్జ్ఞాత్వా సద్య శ్చండాలతాం వ్రజేత్।
తద్దోషశమనా యైవం పూర్వవత్తు సమాచరేత్।
ద్విగుణం నిఖిలం కృత్యం సమున్నేయం విచక్షణైః।
ప్రథమోద్వాహక స్యైవ పరం త్వేషా పరా న తు।
కదాచిద్ధర్మకృత్యానాం నతస్యాపి పరస్య వా।
సంభోగ మాత్రయోగ్యాపి వేశ్యా తస్యా విశిష్యతే।
తయా చ తేషు కృత్యేషు సపఙ్క్తిభోజనం తథా।
సహవాభోజనం దుష్టం యదిపాతిత్యకారకం।
తచ్ఛుద్ధ్యర్థం చ సాయాంతం శ్వభ్రే సంఛాద్య ధర్మతః।
ఖనిత్వా యామమాత్రం వా ఘటికాద్వయ మేవ వా।
తస్మా దుద్ధృత్య పశ్చాత్తు జాతకాదిసమాచరేత్।
తప్త కృచ్ఛ్ర సహస్రాణి ధర్మత శ్చ సమాచరేత్।
నియతాత్మా యావకాశీ చాప్యగ్రే తద్భవే చ్ఛుచిః।
తత్ర స్నాన సహస్రాణి స్వయం విప్రముఖేన వా।
సమాచరే త్తత స్స్వాస్య శుద్ధో భవతి కేవలం।
న పరేషా మయం యోగ్యః ఏవ మాహ పురా భృగుః॥

## (పునర్భూ పత్యాదుల నరకాదులు.)

ప్రాయశ్చిత్తము మానిన ఏమగునో, నరకమందు విదేహరాజుతో,

"పునర్భూతయో యే చ యావజ్జీవన్తి యే నరాః।
ఇమే క్రిమిత్వ మాపన్నా భక్ష్యన్తే త్ర పిపీలికైః॥" మార్కండేయః.

అని యమపురుషుడు చెప్పుచున్నాడు. ''వీరుగో పునర్భూపతులును సర్వభక్షకులును, పురుగులై చీమలచే భక్షింపబడుచున్నారు.'' కన్యను రెండుమారు లిచ్చినవారికి మనువు మహాపాతకమును చెప్పినాడు. వారికి నరకమున జరుగు వృత్తాంతమును వినవచ్చును.

''దత్త్వా కన్యాం తు ఏకస్మై ద్వితీయాయ ప్రయచ్ఛతి।
స త్వేవం నైకధా ఛిన్నః క్షారనద్యాం ప్రవాహ్యతే॥'' మార్కండేయః.

''కన్య నొకని కిచ్చి మరల నింకొకని కిచ్చినవాడు నరకములో పెక్కు చీలికలుగా జీల్పబడి, క్షారపునదిలో వేయబడుచున్నాడు.'' వీరు అయాజ్యులని వేఱచెప్పవలయునా. ఉంచుకొనుటకై, పుత్రస్వామ్యముకొఱకు, చెప్పబడిన పౌనర్భవవిధిని ఎఱుగక గార్హస్థ్యముకొఱకు ప్రథమసంస్కారముగా చేయించినవారు పాపిష్ఠులని వేఱచెప్పవలసినది లేదు. నరకమందు,

''పతితప్రగ్రహా ద్దానా దయాజ్యానాం చ యాజనాత్।
పాషాణమధ్యే కీటత్వం నర స్సతతత మశ్నుతే॥'' మార్కండేయః.

''అయాజ్యయాజకుడు ఱాతికడుపులో పురుగై చిరకాలముండును.'' పిమ్మట భూలోకమందు పందియైపుట్టును.

''అయాజ్యయాజకో విప్ర సూకర స్సోఽభిజాయతే॥'' గారుడము.

''న భోజయేత్ స్తేన, పతిత, నాస్తిక, తద్వృత్తి, వీరహాగ్రేదిధిషు దిధిషూపతి, శ్విత్రి, పౌనర్భవ, కితవ, ...పిత్రా చాకామేన విభక్తాన్॥'' గౌతమః.

''అగ్రేదిధిషు పౌనర్భవులను శ్రాద్ధకాలములయందు చేరనీయగూడదు.'' అగ్రేదిధిషు వనగా,

''పునర్భూ ర్దిధిషూ రూఢా ద్వి స్తస్యా దిధిషుః పతిః।
స తు ద్విజోఽగ్రేదిధిషు స్సైవ యస్య కుటుంబినీ॥'' అమరః.

''పునర్భువే భార్యగాగలవాడు అగ్రేదిధిషువు'' వాడు మహాపాపియని వేదము చెప్పుచున్నది.

శ్రు॥ సూర్యాభ్యుదితః సూర్యాభినిర్ముక్తే, సూర్యాభినిర్ముక్తః కునఖిని, కునఖీ శ్యావదతి, శ్యావద న్నగ్రేదిధిషౌ, అగ్రేదిధిషుః పరివిత్తే, పరివిత్తో వీరహణి, వీరహాబ్రహ్మహణి, తం బ్రహ్మహణం నాత్యచ్యవత.'' ఈ చెప్పినవరుసను వీరు ఉత్తరోత్తరము పాపిష్ఠులు. వసిష్ఠులవారును ఇట్లే చెప్పియున్నారు. కూర్మపురాణమున,



''ఏవ ముక్త్వా తు మునయ శ్శౌనకాద్యా మహేశ్వరం।
ప్రణేము శ్శాశ్వతం స్థాణుం కృష్ణద్వైపాయనం ప్రభుమ్।
అబ్రువన్ హృష్టమనసో వ్యాసం సత్యవతీసుతం।
కథయస్వ మునిశ్రేష్ఠ కర్మయోగ మనుత్తమమ్॥''

శ్రీవ్యాసః॥ ''శృణుధ్వం ఋషయ స్సర్వే వక్ష్యమాణం సనాతనమ్।
ఆమ్నాయసిద్ధ మఖిలం బ్రహ్మణా తు ప్రదర్శితమ్।
ఋషీణాం శృణ్వతాం పూర్వం మను రాహ ప్రజాపతిః।
సర్వపాపహరం పుణ్యమృషిసంఘై ర్నిషేవితమ్॥''

అని మనువు ఋషులకు జెప్పి ఋషిసంఘములాచరించిన ధర్మములను శౌనకాదులకు జెప్పుచు, వేదవ్యాసులవారు,

''జ్ఞాత్వా తు వేదాన్ వృత్త్యర్థం పతితా న్మను రబ్రవీత్।
వేదవిక్రయిణో హ్యేతే శ్రాద్ధాదిషు విగర్హితాః॥
శ్రుతవిక్రయిణో యత్ర పరపూర్వా సముద్భవాః।
అసమానా న్యాయజాతి పతితా స్తే ప్రకీర్తితాః॥
అసంస్కృతాధ్యాపకా యే భృతే నాధ్యాపయన్తి యే।
అధీయతే తథా వేదాన్ పతితా స్తే ప్రకీర్తితాః॥''

''జీవనముకొఱకు వేదపాఠములు చెప్పువారు, పతితులని మనువు చెప్పినాడు, ఈ వేదవర్తకులును శ్రాద్ధాదులయందు విగర్హితులు. వేదవిక్రయులును, పరపూర్వాసుతులు అనగా పౌనర్భవులును, సజాతివారుకారు. అనగా తల్లిదండ్రులజాతివారుకారు. న్యాయ జాతినుండి వీరు పడిపోయినవారని చెప్పబడినారు.'' వీరికి జాతిలేదని మనువు స్మృతియందే చెప్పెనుగదా. ఇక్కడ వీరు జాతిపతితులని చెప్పెనని వ్యాసులవారు చెప్పినారు. వీరికి ఉపనయన సంస్కారములేదని దేవలాదులు అందుచేతనే గదా చెప్పిరి. కనుక వీరికి అధ్యాపనము చేయువారు పతితులగుదురని వేఱచెప్ప నేల? అయినను స్పష్టార్థము ''అసంస్కృతాధ్యాపకా'' ఇత్యాది.

''సంస్కార రహితులకు వేదము చెప్పువారును, జీతము పుచ్చుకొని వేదము చెప్పువారును, అట్లు జీతమిచ్చి అధ్యయనము చేయువారును, పతితులని చెప్పబడినారు.'' అని మనూక్త ధర్మమును వేదవ్యాసులవారు చెప్పినారు. వీరికి ద్విజాధికారము లేవియును లేవు, వేదాధికారము లేదు, కనుకనే 'శూద్రధర్మా సజాతితః' అని దేవల మహర్షి చెప్పెను, కనుకనే వీనికి మనుస్మృతి

యందు శూద్రుని సన్నిధిని నిర్దేశముగాని ఔరసుని సన్నిధిని లేదు కను కనే కాశ్యపులవారు,

"శ్రద్దధానః శుభాం విద్యా మాదదీ తావరా దపి।
అంత్యా దపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులా దపి॥"

అని మనువు చెప్పుటచే పునర్భువుయొక్క కూతును ఎవరైనను గ్రహింతురో యను సందేహముచేత, దానికి అపవాదమును చెప్పినారు.

''సప్త పౌనర్భవాః కన్యాః వర్జనీయాః కులాధమాః।
ఇత్యేతాః కాశ్యపే నోక్తా దహ న్తి కుల మగ్నివత్॥
ప్రరోహ త్యగ్నినా దగ్ధః పాదప స్సుచిరా దపి।
న చ పౌనర్భవా దగ్ధం కులం క్వాపి ప్రరోహతి॥" కాశ్యపః.

''కులాధమలయిన పౌనర్భవకన్యలను ఏడుగురను వర్జింపవలయును,' అని కాశ్యపులవారు చెప్పిన వీరును పునర్భూసుతయు, కులమును అగ్నివలె దహింతురు. అగ్నిచే కాల్పబడిన వృక్షము చిరకాలమునకైనను చిగుర్చుము. పౌనర్భవకన్యచే దహింపబడిన కులముమాత్రము మరల నెన్నటికి నంకురింపదు."

మార్కండేయ పురాణము

ప్రసూత్యాం చ తథా దక్ష శ్చతస్రో వింశతీ స్తథా।
ససర్జ కన్యా స్తా సాంచ స్యమ్య జ్నామాని మే శృణు।
శ్రద్ధా లక్ష్మీ ర్ధృతి స్తుష్టిః పుష్టి ర్మేధా తథా క్రియా।
బుద్ధి ర్లజ్జా వపు శ్శాన్తి స్సిద్ధిః కీర్తి స్త్రయోదశీ।
పత్న్యర్థం ప్రతిజగ్రాహ ధర్మో దాక్షాయణీః ప్రభుః।
తాభ్య శ్శిష్టా యవీయస్యః ఏకాదశ సులోచనాః।
ఖ్యాతి స్స త్యాథ సంభూతిః స్మృతిః ప్రీతి స్తథా క్షమా।
సంతతి శ్చానసూయాచ లజ్జా స్వాహా స్వధా తథా।
భృగు ర్భవో మరీచి స్తు తథైవాంగిరసో మునిః।
పులస్త్యః పులహ శ్చైవ క్రతు శ్చర్షివర స్తథా।
అత్రి ర్వసిష్ఠో వహ్ని శ్చ పితర శ్చ యథాక్రమం।
ఖ్యాత్యాద్యా జగృహుః కన్యా మునయో మునిసత్తమ।
హింసా భార్యా త్వధర్మస్య తస్యాం జజ్ఞే తథా నృతం।
కన్యా చ నిర్‌ఋతి స్తస్యాం సుతౌ ద్వౌ నరకం భయం;



నిర్‌ఋతి శ్చ తథా చాన్యా మృత్యో ర్భార్యా భవ స్మృనే।
అలక్ష్మీ ర్నామ తస్యాం చ మృత్యోః పుత్రా చతుర్దశ।
అలక్ష్మీపుత్రకా హ్యేతే మృత్యో రాదేశ కారిణః।
వినాశకాలేషు నరాన్ భజ న్త్యేతే శృణుష్వ తాన్।
వినాశాయ నృణాం స్త్రీణాం యత న్తే మోహసంశ్రితాః।
తథైవాన్యో గృహే పుంసాం దుస్సహో నామ సంస్థితః।
క్షుత్క్షామో౽ధోముఖో నగ్న చీరీ కాకసమస్వనః।
స సర్వాన్ ఖాదితుం సృష్టో బ్రహ్మణా తమసాం నిధిః।
దంష్ట్రాకరాళ మత్యన్తం వివృతాస్యం సుభైరవం।
త మత్తు కామ మా హేదం బ్రహ్మ లోకపితామహః।
నా త్తవ్యం తే జగదిదం జహి కోపం శమం వ్రజ।
త్య జైతాం తామసీం వృత్తి మపాః స్య రజసః కలాం।
క్షుత్క్షామో౽స్మి జగన్నాథ పిపాసు శ్చాపి దుర్బలః।
కథం తృప్తి మియాం నాథ భవేయం బలవాన్ కథం।
కశ్చాశ్రయో మ మాఖ్యాహి వసేయం కుత్ర నిర్వృతః॥"

బ్రహ్మ॥ "త వాశ్రయో గృహం పుంసాం జన శ్చాధార్మికో బలం।
పుష్టిం నిత్య క్రియాహాన్యా భవా న్వత్స గమిష్యతి।
లూతాపట శ్చ తే వస్త్ర మహారాం శ్చ దదామి తే।
క్షుతం కీటావపన్నం చ తథా శ్వభి రవేక్షితం।
ఉదక్యోపహతం భుక్త ముదక్యా స్పృష్ట మేవ చ।
ఏతాని తవ పుష్ట్యర్థ మన్న మన్య ద్దదామి తే।
అశ్రద్ధయా హుతం భుక్త మస్నాతైర్య దవజ్ఞయా।
దుష్టం క్రుద్ధార్త దత్తం చ యక్ష త్వద్భాగి తత్ఫలం।
యచ్చ పౌనర్భవః కించి త్కరో త్యాముష్మికం క్రమం।
యచ్చ పౌనర్భవా యోషి త్తద్యక్షతవ తృప్తయే।
అసచ్ఛాస్త్ర క్రియాలాప దూషి తేషు చ దుస్సహ।
త వాభిభవసామర్థ్యం భవిష్యతి సదా నృషు।
నిత్యం సకలహే గేహే భవితా వసతి స్తవ।
త్యక్తానృతకథా గేహే యక్ష త త్పరి వర్జయ।
భర్తృశుశ్రూషణే యుక్తా మసతీ సంగవర్జితాం।
కుటుంబభర్తృ శేషాన్న పుష్టాం వై త్యజ యోషితం।
యుజనాధ్యయనాభ్యాస దానాసక్తమతిం సదా।

యాజనాధ్యాపనాదాన కృతవృత్తిం ద్విజం త్యజ।
శ్రుతిస్మృత్యవిరోధేన కృతివృత్తిర్గృహే గృహీ।
యత్ర తత్ర చ తత్పత్నీ తస్యైవానుగతాత్మికా।
యత్రపిత్రోర్గురోః పూజా దేవతానాం తథా నరః।
పత్నీ చ కురుతే భర్తుః తత్రాలక్ష్మీ భయం కుతః॥
సదానులిప్తం సంధ్యాసు గృహమంబు సముక్షితం।
కృతపుష్ప బలిం యత్ర న త్వం శక్నోషి వీక్షితుమ్॥
భాస్కరా దృష్టశయ్యాని నిత్యాగ్ని సలిలాని చ।
సూర్యావలోకదీపాని లక్ష్మ్యాగేహాని భాజనం।
యత్ర కంటకినో వృక్షా యత్ర నిష్పావవల్లరీ।
భార్యా పునర్భూ ర్వల్మీక స్తద్యక్ష తవ మన్దిరం।
దేశాచారాన్ సమయాన్ జాతిధర్మాన్।
జపం హోమం మంగళం దేవతేజ్యాః।
సమ్యక్శౌచం వివిధాన్ లోకవాదాన్।
పుంస స్త్వయా కుర్వతో మాస్తుసంగః॥"

మార్కండేయః॥ "దుస్సహ స్యాభవ ద్భార్యా నిర్మార్ష్టి ర్నామ నామతః।
జాతా కలే స్తు భార్యాయాం ఋతౌ చండాలదర్శనాత్॥"

"దక్షునికి ప్రసూతయందు ఎనుబదిమంది కన్యలు గలిగిరి. అందుశ్రద్ధాలక్ష్మ్యాదులను ధర్ముడుగ్రహించెను. ఖ్యాతిసత్యాదులను భృగుమరీచాదులుగ్రహించిరి. హింస యధర్మునిభార్య. దానికొడుకు అనృతము. అలక్ష్మియనునది మృత్యుదేవునిభార్య, (ఆమెయే జ్యేష్ఠాదేవి, ఆమెయే పెద్దమ్మవారు, ఆమె పే ఇనుపగజ్జెలతల్లి). ఆయిరువురపుత్రులు పదునలుగురు, వారు మృత్యుదేవుని యాజ్ఞను చరించుచుందురు. వినాశకాలము సంప్రాప్తించిననరులనుఆశ్రయింతురు. స్త్రీపురుషులయొక్క వినాశమునకు ప్రయత్నము చేయుచుందురు. అందుదుస్సహుడనువాడు గృహములయందు చేరియుండును. వాడు ఆకటిచే కృశించినవాడు, అధోముఖుడు, దిగంబరుడు. కాకిస్వరముకలవాడు, శోకములకు పుట్టువు. వాడు సకలమయినవారిని భక్షించుటకు బ్రహ్మచే సృజింపబడినవాడు కోరలు వెడలబెట్టుకొని నోరు దెఱచి, భయంకరముగా మ్రింగవచ్చినవానితో బ్రహ్మ యిట్లనియె. 'ఓహోయి ఈలోకమును భక్షింపకుము. కోపమును మానుము, శాంతిపొందుము. ఈతామసవృత్తిని వదలుము.' దుస్సహుడు- 'జగన్నాథుడా, ఆకటిచేత ఎండియున్నాను. దప్పికొనియున్నాను. సత్తువలేదు. నాకు బలమెట్లుకలుగును? తృప్తియెట్లుకలుగును? నే నెక్కడనుందును. బ్రహ్మ 'నీవు మనుష్యులయిండ్లలో నుండుము. అధార్మికజనులు నీబలము.



నిత్యక్రియాలోపముచే నీకు పుష్టికలుగునుగాక. అబ్బాయి. సాలెపట్టు నీకు వస్త్రము. శ్రద్ధారహితములైన దానహోమములును, క్రోధముతోను విసుగుతోను చేసినదానమును, వీనిఫలము, ఓరియక్షుడా నీకు జెందునుగాక. పౌనర్భవుడుగాని, వానితల్లిగాని, పరలోకసాధకమగు కార్యము నేమైన జేసిన దానిఫలమునీది. దానివలన తృప్తి నీకుగలుగును. శాస్త్రమున కపార్థములుచేసినవారిని ఓయక్షుడా నీవు నాశము చేయుదువు. నిత్యమును కలహముజరుగునట్టియింట నీవు నివసింతువు. అసత్యమెఱుగనియింట నీవు ప్రవేశింపకు. భర్తృశుశ్రూషాసక్తయయినయుత్తమురాలిని నీవువిడిచిపెట్టుము. శ్రుతిస్మృత్యవిరోధమగు నాచారమును పితృగురుపూజయు భర్తృపూజయు కలయింట అలక్ష్మిభయమెక్కడిది? (ఇందువలన దుస్సహుడు వానిబలగముతో నివసించునని తెలియజేయబడినది.) సూర్యుడు ఏగృహమున శయ్యలను చూడడో, దీపములనుచూచునో, ఆగృహములు లక్ష్మికి నివాసములు. ఏగృహమందు ముండ్లచెట్లు, అనుపతీగయు, పునర్భువును, వల్మీకమును ఉండునో, ఓయక్షుడాఅదినీమందిరము. దేశాచారములను, జపహోమములను సరిగా చేయువారితో నీకు సంగముకూడదు.' దుస్సహునిభార్య పేరునిర్మార్ష్టి (తుడుచుకొనిపోవునది.) ఆమె కలిపురుషుని భార్యయందు ఋతుకాలమున చండాలసంగమముచేతబుట్టినది." అని మార్కండేయులవారు చెప్పినారు. ఇందువలన పునర్భూ తత్పుత్రాదులకు ఏసత్కర్మకును అధికారము లేదనియు, ఉపనయనాధ్యయనాదులు లేవనియు, పునర్భవము శ్రుతి స్మృతివిరుద్ధమనియు, అది వినాశకాలమున సంప్రాప్తించు ననియు శాస్త్రమున, కపార్థములు కల్పించి అది ధర్మమనుటయు క్షేమకరము గాదనియు, స్పష్టము.

## కొన్ని కలివర్జ్యావర్జ్యములు.

మహర్షులు అధర్మమునుండి ధర్మమును గ్రహింప సమర్థులుగాన ఈ పునర్భవసంకరమునుండి సర్వాభావమున పౌనర్భవదత్తపిండోదకములను గ్రహించినారు. ప్రతిపక్షులు ఈపునర్భవసంకరమును, ఈపశుధర్మమును, ధర్మ్యవివాహమునుగా గ్రహించినారు. వీరిట్టి యధర్మమును కల్పింతురని అనగాపిండార్థమగు పౌనర్భవవిధిని, ధర్మార్థ వివాహమునుగా మార్తురని యెఱుగుదురు కనుకనే మన్వాదులు ఈయుగమునకు దీనిని నిషేధించిరి. మనువే నిషేధించెనని బృహస్పతిమహర్షి చెప్పియున్నాడు.

"ఉక్తో నియోగో మనునా నిషిద్ధః స్వయమేవ తు।
యుగహ్రాసా దశక్యోఽయం కర్తు మన్యైర్విధానతః।
తపోజ్ఞానసమాయుక్తాః కృతేతాయుగే నరాః।

ద్వాపరే చ కలౌ నృణాం శక్తిహాని ర్హి నిర్మితా।
అనేకధా కృతాః పుత్రా ఋషిభి శ్చ పురాతనైః।
న శక్యంతే ధునా కర్తుం శక్తి హీనై రిదంతనైః॥"

"మనువు నియోగమును స్వయముగానే విధించి నిషేధించెను. యుగములయందు క్రమక్రమముగా ధర్మము తగ్గుటచే నియోగము అన్యులచే విధిప్రకారమాచరింపబడ నేరదు. కృతత్రేతా ద్వాపరములయందు జనులుతపోజ్ఞాన సంపన్నులు. కలియుగమున శక్తి యల్పము. పూర్వమహర్షులచేత అనేకవిధములుగా పుత్రులు చేయబడినారు. ఇప్పటి జనులు శక్తిహీనులుగాన వీరిచే అనేకవిధములుగా పుత్రులు చేయబడజాలరు." ఇందువలనధర్మమును మాని కామముచే ప్రవర్తింతు రని నియోగమును కలియుగమునకు నిషేధించినారు. దీని నొకదానినిమాత్రమేకాక, అనేకధాయను శబ్దముచే, ఇంక ననేకపుత్రులను నిషేధించినారని బృహస్పతిమహర్షి తెలియజేసినాడు.

అందు ప్రత్యేకముగా పౌనర్భవుని నిషేధించినవైనమును 'యాపత్యావా' శ్లోకవాఖ్యానావసరమందు, బ్రహ్మ తనపురాణములో తెలియజేసినాడు.

"స్త్రీణాం పునర్వివాహ శ్చ దేవరా త్పుత్రసంతతిః।
స్వాతంత్ర్యం వా కలియుగే న కర్తవ్యం కదాచన॥"

"స్త్రీపునర్వివాహమును, నియోగమును, కలియుగమున కూడవు." ఈపునర్వివాహనిషేధము మనుశ్లోకముల యభిప్రాయమును వెల్లడిచేయు శ్లోకముల వెంబడి నేయుండుటచే కలియుగమునకు ఈధర్మమును మనువు నిషేధించెనని సిద్ధాంతము. అనేకధాయనుటచే బహుపుత్రులను నిషేధించెనని తెలియుచున్నదిగదా. వారెల్లనెవ్వరోయనిన ఆవిషయమును కలియుగైకప్రధానములగు స్మృతిపురాణములు విశదపఱుచుచున్నవి. పరాశరులవారు

"ఔరసః క్షేత్రజ శ్చైవ దత్తః కృత్రిమక స్సుతః॥"

అని పౌనర్భవుని,కడమ ఏడుగురను, ఈయుగమునకు నిషేధించినారు.

పూ॥అట్లైన క్షేత్రజు నేల చెప్పినారు?

ఉ॥ ద్వాపరసమీపమున, కొలదికాలమువఱకు, తపోజ్ఞానము లుండును గాన, జరుగవచ్చు ననుతాత్పర్యముచే చెప్పినారు.



"క్షేమధన్వాతు తత్పుత్రః క్షేత్రజః క్షత్త్రధర్మజః।"

"క్షేమధన్వుడు వానిసుతుడు, క్షేత్రజుడు, క్షత్త్రధర్మమున బుట్టినవాడు." అని కలియుగాది రాజవర్ణనములో భాగవతమున చెప్పబడియున్నది. ఉత్తమమయిన యీధర్మముకూడ, పూర్వయుగములయందుగూడ, కాదాచిత్కముగా నాచరింపబడినది.

దేవీభాగవతము,—

"గంగాతీరే స్థితః పాండు ర్మునీనా మాశ్రమేషు చ।
శృణ్వానో ధర్మశాస్త్రాణి చచార దుశ్చరం తపః।
కథాయాం వర్తమానాయాం కదాచి ద్ధర్మసంశ్రితమ్।
అశృణో ద్వచనం రాజా సుపుష్టం మునిభాషితమ్।
అపుత్రస్య గతి ర్నాస్తి స్వర్గే గంతుం పరంతప।
యేనకే నాప్యుపాయేన పుత్రస్యజననం చరేత్।
అంశజః పుత్రికాపుత్రః క్షేత్రజో గోళక స్తథా।
కుండ స్సహోఢః కానీనః క్రీతః ప్రాప్త స్తథావనే।
దత్తః కేనాపిచాశక్తౌ ధనగ్రాహీసుతాః స్మృతాః।
ఉత్తరోత్తరతః పుత్రా నికృష్టా ఇతి నిశ్చయః।
ఇత్యాకర్ణ్యతదాప్రాహ కు న్తీంకమలలోచనాం।
సుతముత్పాదయాశు త్వం మునిం గత్వా తపోన్వితం।
మమాజ్ఞయా న దోష స్తే పురారాజ్ఞా మహాత్మనా।
వసిష్ఠా జ్జనితః పుత్రః సౌదాసే నేతి మే శ్రుతమ్॥"

ఇందువలన, అపుత్రునికి స్వర్గమునకు బోవుయోగ్యత లేదుగాన ఏపాపినైనను, కుండగోళకులనైనను, ("అమృతేజారజఃకుండః మృతేభర్తరిగోళకః" భర్త బ్రతికియుండగా జారునివలన గలిగినవాడు కుండుడు. భర్త గతించిన పిమ్మట జారునివలనగలిగినవాడుగోళకుడు.) అట్టిపాపిష్ఠులనైనను, సహోఢకానీనా ద్యధములనైనను ఎట్టిపాపినైనను ఒకపుత్రుని పడయవలయును అనుట స్పష్టము. అందులో ఉత్తమమయిన నియోగమే, పూర్వకాలమున జరిగిన నియోగముల యుదాహరణములును, ఇది ధర్మమా అధర్మమాయని సంశయములును తద్విచ్ఛేదములును నియోగప్రసక్తియందు పురాణములయందు తఱుచుగనుండుటచే కాదాచిత్కమని తెలియుచుండగా, ఋతుకాలమందు చండాలుడు సంగమించినందున కలిపురుషునిభార్యయందుపుట్టిన నిర్మాష్టి (తుడుచుకొనిపోవునది) అను దాని భర్తయు అలక్ష్మీపుత్రుడును, తనస్వజనము

తో కూడ నివసించువాడును, అయినదుస్సహునియొక్క నివాసమును, వాని వలనినాశమును ఎవ తెవలనగలుగునో అట్టిపునర్భువును గైకొనుటయను పాతకము ఎన్నడును ఉత్తములయందు జరిగియుండ దనివేఱచెప్పవలయునా? శాస్త్రమున నియోగవిధానమున్నను, ఆచారమున అరుదైయుండెను. పునర్భవమునకు సకలశాస్త్రములయందునిషేధములేగాని ఒకదానియందైనను విధియగపడదు, ఇట్టియధర్మము ఎన్నడైనను జరిగెనని యెట్లుచెప్పవచ్చును? సకలమహర్షులును మనువుచెప్పినదానినే చెప్పిరిగావున, ఆదిత్యపురాణమునను

"ఊఢాయాః పునరుద్వాహం జ్యేష్ఠాంశం గోవధం తథా।
కలౌ పంచ న కుర్వీత భ్రాతృజాయాం కమండలుమ్॥"

కలియుగమున నియోగపునర్భవములు కూడవని చెప్పబడినది. దేవలస్మృతియందును,

"దత్తాక్షతాయాః కన్యాయాః పునర్దానం పరస్య చ।
దీర్ఘకాలం బ్రహ్మచర్యం వర్జితవ్యాః కలౌ యుగే।
ఏతాన్ ధర్మాన్ పరిత్యజ్య యో విప్రో దోషభాగ్భవేత్।
తన్యేహ నిష్కృతి ర్నాస్తి తప్తకృచ్ఛ్రశతాదపి॥"

అని యీవిషయమే చెప్పబడినది. క్రతుస్మృతియందును అట్లే చెప్పబడినది.

"దేవరేణ సుతోత్పత్తి ర్దత్తా కన్యా న దీయతే।
న యజ్ఞే గోవధః కార్యః కలౌ న చ కమండలుః॥"

ఇట్లు సకలశ్రుతిస్మృతి పురాణములును, కఠినతరముగా నిషేధించుచుండగా పురాణములయందు ఈయధర్మముయొక్క యాచార మగపడుచున్న దని పూర్వపక్షులు చెప్పుదురు. అర్జునుడు ఉలూపియను విధవను వివాహముచేసికొనెనని చెప్పుచున్నారు. అది నాగకన్యక, కామరూపిణి, మనుష్యులకు పుట్టిన విధినిషేధములు దానికిచెల్లవు. కనుక వివాహమయినను, ఉలూపియొక్కయుదాహరణము విధవావివాహ సాధకము గాదు.

ఉలూపికథ.

అనుష్ఠితం తు య ద్దేవై ర్మునిభి ర్య దనుష్ఠితం।
నానుష్ఠేయం మనుష్యై స్తదుక్తం కర్మ సమాచరేత్॥

"దేవతలును మునులును చెప్పినదే మనుష్యులు చేయవలయునుగాని, వారు చేసినదెల్ల వీరుచేయగూడదు." అట్లే ఆపస్తంబమహర్షియు చెప్పియున్నాడు.



"దృష్టో ధర్మవ్యతిక్రమః। సాహసం చ పూర్వేషాం। తేషాం తేజోవిశేష
త్ప్రత్యవాయో న విద్యతే। తదన్వీక్ష్య ప్రయుంజానః సీదత్యవరః॥"

"పూర్వులు ధర్మము నతిక్రమించి నట్లగపడుచున్నది. అది వారిసాహసము." వారికి ప్రత్యవాయము లేదా యనిన, 'వారికి తేజోవిశేషము కలిగినందున ప్రత్యవాయము లేదు.' ఇతరు లట్లుచేసిన నేమి? యనిన 'అది చూచి ఆప్రకారము ఇతరులు చేసిన నశింతురు.' కనుక అర్జునోదాహరణము వివాహమయినను విధవావివాహసాధకము గాదు. మనకు ఆచరణీయము గాదు అర్జునుని తేజోవిశేషమున సంశయమయినను, తనకు తత్సమతేజము కల దని యహంకారమయినను ఒకపర్యాయము ఒక నాగకన్యకను ముద్దాడిన నదితీఱును. మఱియు అది వివాహము కాదు.

ఇరావంతునికథ—ఔరసశబ్దార్థవిచారము.

"అర్జునస్యాత్మజః శ్రీమా నిరావా న్నామ వీర్యవాన్।
సుతాయాం నాగరాజస్య జాతః పార్థేన ధీమతా।
ఐరావతేన సా దత్తా హ్యనపత్యా మహాత్మనా।
పత్యౌ హతే సుపర్ణేన కృపణా దీనచేతనా।
భార్యార్థం తాం చ జగ్రాహ పార్థః కామవశానుగామ్।
ఏవ మేష సముత్పన్నః పరక్షేత్రే ర్జునాత్మజః।
స నాగలోకే సంవృద్ధో మాత్రా చ పరిరక్షితః।
పితృవ్యేణ పరిత్యక్తః పార్థద్వేషా ద్దురాత్మనా॥" భీష్మపర్వము.

"ఇరావంతు డర్జునుని కుమారుడు. అర్జునునివలన నాగరాజుకుమార్తెయందు బుట్టినవాడు. ఆమెయొక్క భర్తను సుపర్ణుడు చంపగా ఆమెకు సంతానము లేకపోగా, ఆమె తండ్రిచేత అర్జునునియొద్దకు పంపబడెను. కామాతురయైన దానిని అర్జునుడు సంగమముకొఱకు గ్రహించెను. ఈప్రకారము వీడుపరక్షేత్రమందు పుట్టిన యర్జునపుత్రుడు. వానిని నాగలోకమందే తల్లిపెంచెను. వానిపినతండ్రి అర్జునునికి ద్వేషి యగుటచే వానిని వదలెను. పౌనర్భవపుత్రుని చేసికొనవలసిన గ్రహచారము అర్జునునికి లేదు. వీడు ఔరసపుత్రుడే అయిన,—

'పరక్షేత్రే'యనునది బాధించును. ఔరసలక్షణము 'స్వేక్షేత్రే'యని యారంభింపబడియున్నది. పూర్వదశానువాద మయిన, "పత్యౌహతే" ముందు చెప్పియుండుటచే వృథాపునరుక్తి. నాగుడు వీనికి పితృవ్యుడు అనుటయు బాధించును. ఔరసుడైన, భీమాదులు పితృవ్యులుగాని, నాగుడుగాడు. 'అనపత్యా' అను విశేషణముచే అపత్యార్థము అనగా సంతానము

కొఱకు దానిని తండ్రి యర్జునుని యొద్దకు పంపె నని నిశ్చయము. దత్తా యనుపదము 'పంపబడెను' అనునర్థమున ప్రయోగింపబడుచున్నదని ఇంతకు ముందేచూపబడినది. ఆత్మజశబ్దము నియోగజులయందు వ్యహరింపబడుచున్నది. 'ఏవం తే పాండవాః పంచ క్షేత్రోత్పనాన్సు రాత్మజాః।' అని దేవీభాగవతము. నియోగమును—

''అజాన న్నర్జున శ్చాపి నిహతం పుత్ర మౌరసం।
జఘాన సమరేశూరాన్ రాజ్ఞస్తాన్ భీష్మరక్షిణః॥'' భీష్మపర్వము.

"యుద్ధమున తనయౌరసపుత్రుడు చచ్చెననియెఱుగక అర్జునుడు భీష్ముని పార్శ్వరక్షకులను గొట్టెను.'' అని ఇరావంతునికిగా ప్రయోగింపబడిన ఔరసశబ్దము బాధించు నని పూర్వపక్షులు వాదించినారు. తనభార్యయందు తనవలన బుట్టినకుమారుడు ఔరసుడు అనువిశేషణము లేకయే పుత్రశబ్ద మాత్రముచేతనె వ్యవహరింప బడుచున్నాడు. భాషాశైలి యట్లుండగా నిచ్చట ఔరసశబ్దమును ప్రయోగించుటయే, వీడు ధర్మశాస్త్రమందు నిర్వచింపబడిన యౌరసుడు గాడనియు, ఇట ఔరస శబ్దమునకు అర్థమువేఱనియు తెలుపుచున్నది. పరక్షేత్రజుడు క్షేత్రికి క్షేత్రజుడనియు బీజి కౌరసుడనియు, వ్యవహరింపబడును. రామాయణమునందు హనుమంతునిగూర్చి జాంబవాదులు ఔరసశబ్దమును ప్రయోగించినారు.

''స త్వం కేసరిణః పుత్రః క్షేత్రజో భీమవిక్రమః।
మారుత స్యౌరసః పుత్ర స్తేజసా చాపి తత్సమః।''
''మారుత స్యౌరసః పుత్ర స్తథా సంప్రతి జృంభతే।''
''మారుత స్యౌరసః పుత్రః ప్లవనే నాస్తి మత్సమః॥''

కనుక ఔరసశబ్దము నియోగమును బాధింపదు. కనుక ఇరావంతుడు ధర్మశాస్త్రములో చెప్పబడినద్వాదశపుత్రులలోనియౌరసుడు గాడు. భారతము ఆదిపర్వమును పరిశీలించిన, ఉలూపి కామాధీన మానసయై యర్జునుని ప్రార్థింపగా, అర్జునుడు అంగీకరింపకపోగా, ఆమె ప్రాణత్యాగము చేసెద నని చెప్పగా, ఆమెయొక్క ప్రాణసంరక్షణకొఱకు, అధర్మమునకు భయపడి, అర్జునుడు ఆమెతో సంగమించె ననియు, ఆమెతో ఒక రాత్రిమాత్రము నివసించి మరునాడు ఉదయమున గంగయొద్దనున్న తనశిబిరము ప్రవేశించె ననియును, తెలియును. అంతయే గాని వివాహప్రసంగ మచ్చట నేమియును లేదు.

''స నాగభవనే రాత్రిం తా ముషిత్వా ప్రతాపవాన్।
ఉదితేఽభ్యుత్థితః సూర్యే కౌరవ్యస్య నివేశనాత్॥''ఆదిపర్వము.



సంతానముకొఱకు ఐరావతుడును, కామాతురతచేత ఉలూపియు, తననిమిత్తమై యులూపి ప్రాణత్యాగము చేయునను భీతిచేత అర్జునుడును, ఈ కార్యమున బ్రవర్తించి ఇరావంతునింబుట్టించి రని యిందువలన స్పష్టము.

పూ॥ నాగకన్యక కేమి నియోగమేమి?

ఉ॥ నాగకన్యకకేమి వివాహమేమి?

## కృత్స్న పాండవవంశ జననము.

వీడు శాస్త్రమున చెప్పబడిన ఔరసు డయినను, పౌనర్భవు డయినను, ఎవడైనను ఉత్పాదకునికి అనగా అర్జునునికిచెందును. ఇరావంతుడు అర్జునునికి చెందలేదు. ఎట్లనిన,—

''శృణు రాజ న్మయా సమ్యక్పరాద్వైపాయనా చ్ఛ్రితం।
ప్రోచ్యమాన మిదం కృత్స్నం స్వవంశజననం శుభమ్॥''

అని జనమేజయునితో 'మీయొక్కవంశజననమును సమస్తమును చెప్పెదను' అనిప్రతిజ్ఞ చేసి వైశంపాయనులవారు,

"తత్ర ద్రౌపదీం భార్యా మవిన్దన్। స్వవిషయం చాభిజగ్ముః। కుశలినః పుత్రాం శ్చోత్పాదయామాసుః। ప్రతివింధ్యం యుధిష్ఠిరః। సుతసోమం వృకోదరః। శ్రుతకీర్తి మర్జునః। శతానీకం నకులః। శ్రుతకర్మాణం సహదేవ ఇతి। యుధిష్ఠిర స్తు గోవాసనస్య శైబ్యస్య దేవికాం నామ కన్యాంస్వయంవరాం లేభే। తస్యాం పుత్రం జనయామాస యౌధేయం నామ। భీమసేన స్తు కాశ్యాం బలం ధరాం నా మోపయేమే వీర్యశుల్కాం తస్యాం పుత్రం సర్వగం నామోత్పాదయామాస। అర్జునః ఖలు ద్వారావతీం గత్వా భగినీంవాసుదేవస్య సుభద్రాం నామ భద్రభాషిణీం భార్యాముదావహత్ స్వవిషయం చాభ్యాజగామ। కుశలీ తస్యా మభిమన్యు మతీవగుణ సంపన్నం దయితం వాసుదేవస్య అజనయత్। సహదేవస్తు మాద్రీ మేవస్వయంవరే విజయాం నామోపయేమే మద్రరాజస్య ద్యుతిమతో దుహితరం। తస్యాం పుత్ర మజనయత్ సుహోత్రం నామ। నకులస్తుచైద్యాం కరేణుమతీం నామ కన్యాముదావహత్ తస్యాం పుత్రం నిరమిత్రం నా మాజనయత్। భీమసేనస్తు పూర్వమేవ రాక్షసం ఘటోత్కచం నామ హిడింబాయాం పుత్ర ముత్పాదయామాస। ఇ త్యేతే ఏకాదశ పాండవానాం పుత్రాః। తేషాం వంశకరోఽభిమన్యుః॥''

"అయిదుగురును ద్రౌపదియందు ప్రతివింధ్య సుతసోమ సుతకీర్తి శతానీక శ్రుతకర్మలను పడసిరి. దేవికయందు ధర్మరాజు యౌధేయుని, బలంధరయందు భీముడు సర్వగుని, సుభద్రయందు అర్జునుడు అభిమన్యుని, కరేణుమతియందు నకులుడు నిరమిత్రుని, విజయయందు సహదేవుడు సుహోత్రుని

భీముడు హిండింబయందు ఘటోత్కచుని పుట్టించిరి. ఈసదునొకండ్రు పాండవుల పుత్రులు వారికి వంశకరు డభిమన్యుడు.'' అని సమస్తమయిన మీ వంశజననమును చెప్పెద నని ఘటోత్కచుని గూడ చెప్పి ఇరావంతుని చెప్ప లేదు. కృత్స్న మనుటచే 'ఏకాదశ' యనునది పరిసంఖ్య. కనుక ఇరావంతుడు అర్జునునికి చెందడు, కనుక ఔరసుడు గాడు, పౌనర్భవుడును గాడు. బభ్రువాహనుడు పుత్రికాపుత్రుడుగాన నిచట చెప్పబడలేదు. చిత్రాంగద తండ్రి యర్జునునితో చెప్పుచున్నాడు.

''ఏకైకః ప్రసవస్తస్మా ద్భవత్యస్మి న్కులే సదా।
తస్మా దేక స్సుతో యోస్యాం జాయతే భరత త్వయా।
ఏత చ్ఛుల్కం భవ త్వస్యాః కులకృ జ్జాయతా మిహ।
ఏతేన సమయే నేమాం ప్రతిగృహ్ణీష్వ పాండవ।
స తథేతి ప్రతిజ్ఞాయ తాం కన్యాం ప్రతిగృహ్య చ।
ఉవాస నగరే తస్మి న్త్రిస్సః కుంతీసుతః సమాః।
తస్యాం సుతే సముత్పన్నే పరిష్వజ్య వరాంగనామ్।
ఆమంత్ర్య నృపతిం తం తు జగామ పరివర్తితుమ్॥''ఆదిపర్వము.

''మావంశమున మహేశ్వరునివరముచే ఒక్కొకనికి ఒక్కొకడే సంతానము కలుగును. కనుక ఈకన్యయందు నీకు కలుగునట్టిపుత్రుని మాకు వంశకరునిగా ఇచ్చెదవేని ఈకన్యను నీ కిచ్చెదను. అని ఆరాజు చెప్పగా అందుల కర్జునుడు ఒప్పుకొని, ఆమెను గ్రహించి, పుత్రుడు పుట్టగానే ఆరాజునొద్ద వీడుకోలు వడసి, వెడలిపోయెను.'' ఇందువలన అర్జునునికి బభ్రువాహనుడు చెందడని విశదము గదా.

పూ॥ సంస్కారమును శుల్కమును లేవు గాన అర్జునునికి ఇరావంతుడు చెందలేదు.

ఉ॥ అట్టి పౌనర్భవపుత్రత్వము లేదు.

సంస్కారమును, శుల్కమును, స్వగృహానయనమును, పుత్రస్వామ్యమును, లేనిదానిని నియోగమని యేల యనరాదు. పునర్భవసంకరమనియే యేల చెప్పవలయును.

కనుక ఉలూప్యుపాఖ్యానమందు పూర్వపక్షుల యుపయోగముకొఅను డబ్బెత్తు సత్తు వయినను లేదు.

దమయంత్యుపాఖ్యానమువలన నీయాచార మగపడుచున్న దని పూర్వపక్షులు వాదము చేయుచున్నారు.



## దమయంతికథ.

పూ॥ ఇది ధర్మ్యము గానియెడల దమయంతీ ద్వితీయస్వయంవరమున కని ఋతుపర్ణు డేలవచ్చెను?

ఉ॥ ''ఆస్థాస్యతి పున ర్భైమీ దమయంతీ స్వయంవరం।
తత్ర గచ్ఛంతి రాజానో రాజపుత్రా శ్చ సర్వశః॥''

సకలరాజులును రాజపుత్రులును పోవుచున్నారు అని నమ్మదగిన దూత చెప్పుటచే అందఱును పోవుచున్నా రని నమ్మి తానును వచ్చెనని చెప్పవచ్చును.

మఱియు,

''దూతా శ్చరంతి పృథివీం కృత్స్నాం నృపతిశాసనాత్।
భైమీ కిలస్మ భర్తారం ద్వితీయం వరయిష్యతి॥''

భీమరాజుయొక్క యాజ్ఞచే వచ్చితిమని దూతలు చెప్పుటచే భీముడు ఋతుపర్ణునికి పూజ్యుడుగాన ఋతుపర్ణుడు వచ్చెనని తలపవచ్చును. భీముడు రావించె ననితలచియే వచ్చెనని గ్రంథమందే చెప్పబడియున్నది.

ఏల వచ్చితి వని భీమ రాజడుగగా ''ఆగతోస్మి త్వ్యావాచైనం భవంత మభివాదుకః'' ''మీకునమస్కారముచేసి పోవుటకు వచ్చితి నని చెప్పెను.''

''అకస్మాత్సహసా ప్రాప్తం స్త్రీమంత్రం నస్మ విందతి.''

''హఠాత్తుగా సాహసముచే స్త్రీలు పంపిన సమాచార మని యెఱుగకపోయెను.'' అని ఆయనరాకకు హేతువు గ్రంథమందే చెప్పబడియున్నది. ఇందువలన భీమరాజు రావించె నని తలచినందున వచ్చె నని స్పష్టముగదా. తాము పంపిన సమాచార మనిన రాడనియేగదా దమయంతియు, ఆమెతల్లియును, భీమునియాజ్ఞచేత నని పునః స్వయంవరమును ప్రకటించిరి. తల్లి ప్రియము గోరునుగనుక ఈయుపాయమున కొప్పుకొనునుగాని, తండ్రి హితము గోరునుగాన, అయశస్సున కొర్వడుగాన, ఆయన సమ్మతింపడనియేకదా, దమయంతి, యీవృత్తాంతమును తండ్రికి తెలియజేయ వల దని, తల్లిని ప్రార్థించెను. తల్లికి తెలియదా భీమునితో చెప్పగూడ దని యనిన,దమయంతి ఆతురగాన ''ప్రేమపశ్యతిభయా న్యపదేషు'' అనున్యాయముచేత వేడుకొనె నని సమాధానము.

''దమయంతీరహోభ్యేత్య మాతరం ప్రత్యభాషత।
అయమర్థో న సంవేద్యో భీమే మాతః కథంచన।
త్వత్సన్నిధౌ నియోక్ష్యేఽహం సుదేవం ద్విజసత్తమం।
యథా న నృపతి ర్భీమః ప్రతిపద్యేత మే మతిం।
తథా త్వయా ప్రకర్తవ్యం మమ చే దిచ్ఛసి ప్రియమ్॥''

''అమ్మా, ఈవృత్తాంతమును ఎంతమాత్రము భీమునికి తెలియనీకుము. నీయెదుట బ్రాహ్మణోత్తముడైన సుదేవుని నియమించెదను, నీవు నామేలు గోరుదువేని ఈవిషయము భీమునికైనను తెలియకుండునో అట్లుచేయుము.''

ఇందువలననే దురాచారమని విశదముగదా. సదాచారమయిన తండ్రికేల తెలియచేయరు. మఱియు నలమహారాజు దమయంతిని నిందించుచున్నాడు. ఏమనిన,

''కథం ను నారీ భర్తార మనురక్త మనువ్రతమ్।
ఉత్సృజ్య వరయే దన్యం యథా త్వం భీరు కర్హిచిత్॥''

''ఓభయస్థులారా, నీవలె నెప్పుడయినను స్త్రీయయినది అనురక్తుడు అనువ్రతుడును అగు, భర్తను విడిచిపెట్టి ఏవిధముగా నన్యుని వరించును.''

ఈనిందకు ఉత్తరమందు, నేను పాపము చేయలేదని దమయంతియు, ఈమె పాపముచేయలేదని వాయుదేవుడును చెప్పినారు. ఆపాపమేది?

పూ॥ పునర్భవము పాపముగాదని యభిప్రాయము.

ఉ॥ ఆనిర్ణయము వేదశాస్త్రములుచేయును. వాయువు ఉపన్యసింపనేల, కనుక పునర్భవము పాపము కాదని యభిప్రాయముగాదు.

పూ॥ అనురక్తత్యాగము పాపమని యభిప్రాయము.

ఉ॥ అప్పుడును వాయుభాషణము ఆయుక్తమే. మఱియు అనురక్తత్యాగమును పాపమే. అట్టిదియును పునర్భవుగాన.

పూ॥ అనురక్తిత్యాగము పాపమని యభిప్రాయము.

ఉ॥ అట్లయిన తొంటియజమానుని త్యాగము ఎంతపాపమో చెప్పవలయును. అట్లయినను వాయువు అధికభాషణమే చేసెను. కనుక పునర్భవనప్రయత్న పాపమును చేయలేదని యభిప్రాయము. అనువ్రతుడుగాని భర్త లేనేలేడు ఎందుచేతననగా భార్యకు వేఱుగా వ్రతములేదు.

''నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో నవ్రతం నాప్యుపోషణం।
పతిం శుశ్రూషతే యత్తు తేన స్వర్గే మహీయతే॥'' విష్ణుః.

కనుక భార్యాభర్తలు పరస్పరము అనువ్రతులుగానివారులేరు. కనుక అనువ్రతమ్మనునది యెట్లుఅనువాదమో అట్లేఅనురక్తమ్మనునదియు అనువా



దమే. కావున పునర్భవప్రయత్నపాతకమే యచ్చట చెప్పబడినది. దమయంతి యొక్క యుత్తరమును వాయుదేవుని సంభాషణమును వినవచ్చును.

''ప్రాంజలి ర్వేపమానా సా ఇదం వచన మబ్రవీత్।
న మా మర్హసి కల్యాణ దోషేణ పరిశంకితుం।
మయా హి దేవా నుత్సృజ్య వృత స్త్వం నిషధాధిప।
తవాభిగమనార్థం తు సర్వతో బ్రాహ్మణా గతాః।
వాక్యాని మమ గాథాభి ర్గాయమానా దిశో దశ।
తత స్త్వాం బ్రాహ్మణో విద్వాన్ పర్ణాదో నామ పార్థివ।
అభ్యగచ్ఛ త్కోసలాయాం ఋతుపర్ణనివేశనే।
తేన వాక్యే కృతే సమ్య క్ప్రతివాక్యే తథా హృతే।
ఉపాయోఽయం మయా దృష్టో నైషధానయనే తవ।
త్వా మృతే న హి లోకేఽన్య ఏకాహ్నా పృథివీపతే।
సమర్థో యోజనశతం గంతు మశ్వై ర్నరాధిప।
స్పృశేయం తేన సత్యేన పాదా వేతౌ మహీపతే।
యథా నాసత్కృతం కించి న్మనసాపి చరామ్యహం।
అయం చరతి లోకేఽస్మిన్ భూతసాక్షీ సదాగతిః।
ఏష మే ముంచతు ప్రాణాన్ యది పాపం చరా మ్యహం।
చంద్రమా స్సర్వభూతానా మంత శ్చరతి సాక్షివత్।
స ముంచతు మమ ప్రాణాన్ యది పాపం చరా మ్యహం।
తథా చరతి తిగ్మాంశుః పరేణ భువనం సదా।
స ముంచతు మమ ప్రాణాన్ యది పాపం చరా మ్యహం।
ఏతే దేవా స్త్రయః కృత్స్నం త్రైలోక్యం ధారయంతి వై।
విబ్రువంతు యథా సత్యం ఏతేవాద్య త్యజంతు మామ్।
ఏవ ముక్త స్తయా వాయు రంతరిక్షా దభాషత।
నైషా కృతవతీ పాపం నల సత్యం బ్రవీమి తే।
రాజన్ శీలనిధిః స్ఫీతో దమయన్త్యా స్సురక్షితః।
సాక్షిణో రక్షిణ శ్చాస్యాః వయం త్రీ న్పరివత్సరాన్।
ఉపాయో విహిత శ్చాయం త్వదర్థ మతులోఽనయా।
న హ్యేకాహ్నా శతం గంతుం త్వా మృతేఽన్యః పుమా నిహ।
ఉపపన్నా త్వయా భైమీ త్వంచ భైమ్యా మహీపతే।
నాత్ర శంకా త్వయా కార్యా సంగచ్ఛ సహభార్యయా।
తథా బ్రువతి వాయౌ తు పుష్పవృష్టిః పపాత హ।
దేవదుందుభయో నేదు ర్వవౌ వాయు ర్మనోరమః।

తదద్భుతతమం దృష్ట్వా నలో రాజాథ భారత।
దమయంత్యాం విశంకాం తా మపాకర్ష దరిందమః॥"

"ఓకల్యాణుడా, నాయందు దోషము లేదు. దేవతలను మాని నిన్ను వరించితిని గదా. నిన్ను రప్పించుటకయి చేసినయుపాయ మిది. నీవు తప్ప మతి యెవరు ఒకదినములో నూఱుయోజనములు రథముతోలగలరు. మనస్సుచేతనైనను లేశమయినను పాపము చేయలేదని నీపాదములు స్పృశించి ప్రమాణము చేయుచున్నాను. నేను పాపము చేసినయెడల ఈవాయుదేవుడు నా ప్రాణములను హరించునుగాక, ఈసూర్యుడు నాప్రాణములను హరించునుగాక, ఈ చంద్రుడు నాప్రాణములు హరించునుగాక, ఈత్రైలోక్యమును నిలిపియున్న యీముగ్గురు దేవతలును యథార్థమును పలుకుదురుగాక, లేక నన్ను హరింతురుగాక." ఇందువలన దమయంతి రచించిన యుపాయమును గూర్చియే అనగా పునస్స్వయంవరమును గూర్చియే నలుడు ప్రశ్నచేసెననియు, ఆ పునస్స్వయంవరము ఉపాయముగాని యథార్థముగాదనియు, పునస్స్వయంవర పాతకము తాను చేయలేదని ఆమె మొఱయిడుచున్నదనియు, పునస్స్వయంవరము పాతక మనియును, స్పష్టము. అది యుపాయమో యథార్థమో మనుష్య వేద్యము కాదు గాన వాయువుత్తరము చెప్పెను. "నలమహారాజా ఈమె పాపము చేయలేదు. సత్యము చెప్పుచున్నాను. ఈవిధమున నిన్ను రప్పించుట నీ కొఱకు చేసినయుపాయముగాని, ఈమెశీలమును మూడుసంవత్సరములు మేము కాపాడితిమి. మీరు మరల కలసికొంటిరి. ఈమెయందు నీవు సంశయింపవలదు. ఈమెను గ్రహింపుము. ఇట్లువాయువు చెప్పుచుండగా పువ్వులవానగురిసెను. దేవదుందుభులు మ్రోగెను. మనోహరమయిన గాలి వీచెను. ఆయద్భుతమును చూచి నలుడు దమయంతియందలి సంశయమును మానెను." ఇందువలన యథార్థమైన పునస్స్వయంవరము అనగా పునర్భవము పాపమనియు, ఉపాయమాత్ర మయినందున పాపముగాక పోయెనని వాయువు చెప్పె ననియు స్పష్టము. ఇంతకన్న పునర్వివాహమును నిషేధించుట యెట్లు.

ఇంతస్పష్టమయిన నిషేధమును దాచి దమయంత్యుపాఖ్యానమున ఆయాచార మగుపడుచున్నదనుట మిక్కిలి యాశ్చర్య కరముగానున్నది.

పునర్వివాహ బాధక మయినదెల్ల పునర్వివాహసాధకముగా పూర్వపక్షులచే నుదాహరింపబడుచున్న దని యిప్పటికే చెప్పితిని. మరల నొక నిదర్శనము చూపుచున్నాను. పూర్వపక్షులు శాయనభాష్యమునుండి యీ క్రిందియితిహాసము నుదాహరించి యిది పునర్వివాహోపయోగి యని చెప్పుచున్నారు.



జు హు ప్ర క థ.

"అత్రేతిహాస మాచక్షతే। జుహూ రితి వాగ్నామా సా బ్రహ్మణో జాయాచ। బృహస్పతే రపి వాచస్పతిత్వాత్ బృహస్పతే ర్జుహూ ర్నామ భార్యాబభూవ। కదాచి దస్యాః కిల్బిష మస్యాః దౌర్భాగ్య రూపే ణాసాం చక్రే। అత ఏవ స ఏనాం పర్యత్యాక్షీత్। అనంతర మాదిత్యాదయో దేవాః మిథో విచార్యైనా మకిల్బిషాం కృత్వా పునర్బృహస్పతయే ప్రాదు రితి॥"

"ఈవిషయమున నొకయితిహాసము కలదు, జుహు వనగా వాక్కు. ఆమె బ్రహ్మయొక్క భార్య. బృహస్పతియు వాక్పతి గావున, ఆమె అతనికిని భార్యయయినది. ఒకానొకప్పుడు ఆమెయొక్క పాపము ఆమెయొక్క దౌర్భాగ్యరూపమున ఆవిర్భవించినది. అందుచేతనే ఆమెను బృహస్పతి పరిత్యజించెను. తరువాత ఆదిత్యుడు మొదలయిన దేవతలు ఒకరితోనొకరు ఆలోచించి ఆమెను కిల్బిషరహితనుగా చేసి-అనగా ఆమెయందలి పాపమును పోగొట్టి, మరల బృహస్పతికే యిచ్చినారు, అని." ఇచ్చట పూర్వపక్షులు 'వాగ్నామా' యను పదమునకు అర్థము వ్రాయక, 'బ్రహ్మణః' అనుదానికి ఒకబ్రాహ్మణునికి అనియర్థమును వ్రాసినారు. అందువలన వాగ్దేవతయని ఎవరో ఒకస్త్రీ యని వ్రాయుటయైనది. ఆమె యిట్లని వాదము చేసిన దట.

"పూర్వం యథా సోమే నానీతాం 'సోమోఽదద ద్గంధర్వా యే'త్యాది క్రమేణానీతాం జుహూం యథాలబ్ధవాన్ తద్వదిదానీమపి.

"నన్నుపూర్వము సోముడు గ్రహించినాడు. తరువాత గంధర్వుడు గ్రహించినాడు. ఆవరుసను ఇప్పటికి ఇతని దగ్గఱకు వచ్చితిని. ఇత డొకడుమాత్రమా? ఓ ఇతనియట్టివారిదివఱకు నా కెందఱో!" అని వాదించినదట. కనుక పునర్వివాహము యోగ్యమట. అయినను ఆమెయొక్క మొండివాదము గెలువలేదని 'దేవతలు ఆమెయొక్క పాపమును పోగొట్టి' రనుటచేతనే తెలియుచున్నది. మొండివాదమే గెలిచినయెడల పాప మెక్కడిది? పాపములేనియెడల దానిని పోగొట్టుట యెక్కడిది? కుంతిని సూర్యుడు గూడి ఆమెకు మరల కన్యాత్వము నిచ్చెను. అంజనను వాయువు గూడి ఆమెకు ఆదోషము లేకుండ చేసెను. ద్రౌపదికి ద్వితీయాది వివాహములయందు అవివాహితాత్వమును సాంబమూర్తి యొసంగెను. అట్లే వాక్కునకు దేవతలు పరపూర్వాత్వపాతకమును పోగొట్టినారు. ఈయితిహాసమువలన ఒకడు గ్రహించినది రెండవవానికి పనికిరాదనియు, అనగా స్త్రీపునర్వివాహము కూడదనియు, నిశ్చయముగదా. ఇట్టిబాధకప్రమాణముల నెల్లసాధకములనుగా పూర్వపక్షులు వ్రాసికొనుటయు ఆశ్చర్యముగదా. భారతము.

ద్రౌపదీవివాహము, ద్రౌపది భగవంతునిగూర్చి,—

## ద్రౌపది వృత్తాంతము

"సహధర్మచరీ భర్తురేకా వైకస్య చైవహి।
ధర్మ్య ఏకః పతిః స్త్రీణాం కౌమార ఇతి కౌశికః।
ఏవం గతే ధర్మపథే న వృణే బహుపుంస్కతామ్।
అలోకాచరితా దస్మాత్కథం ముచ్యే హ సంకరాత్॥"

"ఒక్కతె యే ఒకభర్తకేధర్మపత్ని. స్త్రీలకుప్రథమపతి యొక్కడే ధర్మ్యుడు. అని కౌశికులవారు చెప్పినారు. ధర్మమార్గ మిట్లుండగా బహుపురుషులను కోరను. లోకవిరుద్ధమయిన ఈసంకరము నాకెట్లు తప్పును?" అని వేడుకొనెను. అందునకు సాంబమూర్తి నీకు ఐదుగురు భర్తలు తప్పరని చెప్పెను. అంతట ద్రౌపది అవివాహితకు వివాహము కూడును గాని వివాహితకు కూడదుగాన,

"యది మే పతయః పంచ వర మిచ్ఛామి త్ర్యైమ్బకః।
కౌమారం చ భవే త్సర్వై స్సంగ మే సంగమేచ మే॥"

"నాకు ఐదుగురుభర్తలు తప్పకేని వారిలో ప్రతివానితోను వివాహమున అవివాహితాత్వమును గలుగజేయ వలయును." అని వేడుకొనెను. ఇచ్చట సంగమశబ్దము 'సంగచ్ఛ సహ భార్యయా' అన్నచోనెట్లో అట్లే కూటమిని చెప్పునదిగా ప్రయోగింపబడినది. మైథునపర్యాయము గాదు. అట్లయిన కౌమారప్రార్థనవ్యర్థము. పూర్వశ్లోకములయందును వివాహములేనిషేధింపబడినవి. కనుక అవివాహితాత్వము కోఱకు ప్రార్థన, కౌమారమనగా అవివాహితాత్వము. కౌమారపతి యనుపదముచే స్పష్టము. 'న మే త్వయా కౌమారబంధక్యా కిమపిప్రయోజనం,' 'అవివాహిత దశయందే రంకులాడివైన నీతో నాకేమియుప్రయోజనము లేదు,' అని మాయామాలతిని నందనుడు దూషించుచున్నాడు. దేవీభాగవతమందు మందోదరి చెప్పుచున్నది.—

"నాహం పతిం కరిష్యామి నేచ్ఛా మేస్తి పరిగ్రహే।
కౌమారం వ్రత మాస్థాయ కాలం నేష్యామి సర్వదా॥"

"నేను భర్తను గ్రహింపను, నాకు వివాహమం దిచ్ఛ లేదు, కౌమార వ్రతమును ధరించి కాలమును సదా గడిపెదను." ఇందువలన కౌమార మనగా అవివాహితాత్వ మని స్పష్టము. కనుక నే కౌమారపతి యనగా ప్రథమపతి. అట్లే నారదాదిప్రయోగములు. "ధర్మ్య ఏకపతిః స్త్రీణాం కౌమార ఇతి కౌశికః" "కౌమారంపతి ముత్సృజ్య యా త్వన్యం పురుషం శ్రితా। పునః పత్యుర్గృహం యాయా త్సాద్వితీయా ప్రకీర్తితా'. వసిష్ఠస్మృతియందు "కౌమారంభర్తార ముత్సృజ్య అన్యైస్సహ చరిత్వా అస్యైవ కుటుంబ మాశ్రయతి సా పునర్భూర్భవతి" కనుక అవివాహితాత్వమును ప్రార్థించెను. భగవంతుడును,



"సకృ దుక్తం త్వయా నైత న్నా ధర్మ స్తే భవిష్యతి।
పంచభిః ప్రాప్య కౌమారం మహాభాగా భవిష్యసి॥"

"నీవు పలుమాఱు వేడుకొంటివి గాన నీకు అధర్మము కలుగదు. అయిదుగురతోను కౌమారమును పొంది యదృష్టవంతురాల వగుదువు." అని వరమిచ్చెను. కనుక నే ద్రౌపది వివాహములయందు దినదినము మరల కన్యయే యగుచుండెను. ఇచ్చట బ్రహ్మచర్య క్షారలవణవర్జనాది వ్రతము లుండుటచే కన్యాత్వము అసంస్పృష్టమైథునాత్వ మని చెప్పగూడదు.

"ఇదం చ త త్రాద్భుతరూప ముత్తమం జగాద దేవర్షి రతీతమానుషం।
మహానుభావా కిల సా సుమధ్యమా బభూవ కన్యైవ గతేగతేఽహని॥"

ఇందువలన వివాహితావివాహము పాతక మని స్పష్టము.

## దివ్యాదేవి కథ.

దివోదాసుడు తనకూతును రెండవ భర్తకిచ్చె ననియు, అదికలియుగమున ననియు, పూర్వపక్షులు వ్రాసినారు. ఆ కథాభాగమును పద్మపురాణము నుండి యెత్తి వ్రాసినారు. ఇచ్చటను ముఖ్యమయినమాటలకు అపార్థములు చెప్పినారు.

"స తాం దృష్ట్వా దివోదాసో దివ్యాదేవీం సుతాం తదా।
కస్మై చ దీయతాం కన్యా సువరాయ మహాత్మనే।
చిత్రసేనం మహాత్మానం సమాహూయ తతో నృపః।
కన్యాం దదౌ దివోదాస శ్చిత్ర సేనాయ ధీమతే।
తస్యా వివాహ కాలస్య సంప్రాప్తే సమయే నృప।
మృతోఽసౌ చిత్రసేన స్తు కాలధర్మేణ వై కిల।
దివోదాస స్తు ధర్మాత్మా బ్రాహ్మణై స్సంప్రణోదితః।
వివాహార్థం మహారాజో మానసం కృతవా న్నృపః।
పున ర్దత్తా తదా తేన దివ్యాదేదీ ద్విజోత్తమ।
పుణ్యసేనాయ పుణ్యాయ తస్మై రాజ్ఞే మహాత్మనే॥"

"తస్యావివాహకాలస్య సంప్రాప్తే సమయే" అనగా 'ఆమెయొక్క వివాహకాలముయొక్క సమయము సంప్రాప్తింపగా,' అనగా 'వివాహకాలమాసన్నముకాగా,' అని యర్థము. కనుక, వివాహమునకు ముందే చిత్రసేనుడు మృతుడాయెను. పూర్వపక్షులు ఈకథను సవిస్తరముగా వ్రాసి ఆమెకు ఇరువదియునొక వివాహము లాయె నని తెలియజేసినారు. యీపత్తు కథయం

దును ఈపతులెల్ల వివాహము గాకముందే, మృతిబొందిరి. వివాహ మయిన తరువాత మృతిబొందిన వాడెవడును లేడు. ఈయర్థము సంస్కృతభాష యెఱిగినవారికి ఆకథను చదివిన స్పష్టమగును. మాలతీ మాధవమున,

"ప్రేమ్ణామదగ్ధిభి తేతి యా ప్రియసఖీహస్తోపనీతానయా।
విస్తారిస్తనకుంభకుట్మలభరోత్సంగేన సంభావితా।
సంప్రాప్తేత్వథపాణి పీడనవిధౌ మాం ప్రత్యపేతాశయా।
యా మయ్యేవ లవంగికే త్వపగతే సర్వస్వదాయీకృతా॥"

"సంప్రాప్తే పాణిపీడనవిధౌ" అనగా పాణిగ్రహణము అనగా వివాహము సంప్రాప్తింపగా, అనగా సమీపింపగా అనియర్థము. ఈరూపకమున సంప్రాప్తమని చెప్పబడిన వివాహము జరుగనే లేదు. కనుక వివాహమునకు ముందు చిత్రసేనుడు అనగా వరుడు మృతిబొందె నని స్పష్టము. ఇట్లే ఈకథ పొడుగునను, వివాహమునకుముందే వరులు మృతిబొందుచుండిరనియే చెప్పబడియున్నది. దివ్యాదేవిని, మంత్రసంస్కృత కానందున, కలియుగ మయినందున, సంస్కారమునకుముందే వరులు చచ్చినందున, మరల మరల దివోదాసుడు ఇచ్చుచుండె నని సిద్ధాంతము. పూర్వపక్షు లుదాహరించిన దేవతాచరిత్రములయందును పునర్వివాహము నిషిద్ధ మనియే సిద్ధాంతింపబడినది. మతియొక్క యుదాహరణము.

## దేవీభాగవతమున నహుషుని యక్రమము.

"తే గత్వాంగిరసః పుత్రం ప్రోచుః ప్రాంజలయస్సురాః।
జానీమః శరణం ప్రాప్తామింద్రాణీం తవ వేశ్మని।
సా దేయానహుషాయాద్య వాసవోసౌకృతోయతః।
వృణోత్వియం వరారోహా పతిత్వేవరవర్ణినీ।
బృహస్పతిస్సురానాహ తచ్ఛ్రుత్వా దారుణం వచః।
నాహంత్యక్ష్యేతు పౌలోమీంసతీంచ శరణాగతామ్॥"

"దేవతలు బృహస్పతి యింటికిపోయి అతనితో నిట్లనిరి. శచీదేవి నీయింట శరణు జొచ్చియున్నది. ఇప్పుడు నహుషుడే యింద్రుడు గాన అతనికి ఈమెను ఈయవలసినది. అతనిని ఈమె పతినిగా వరింపవలయును. ఈమాటవిని బృహస్పతి దారుణమైన యుత్తరము చెప్పెను. శరణుజొచ్చిన పతివ్రతయైన శచిని నేను విడిచిపెట్టను." అంతట శచి దేవినిగూర్చి తపస్సుచేసి దేవియొక్క వరముచేత ఇంద్రునిజూచి అతనితో తన ఆపదను చెప్పుకొనెను.



"నహుషో నామ రాజర్షి స్థాపితో భవదాసనే।
త్రిదశైరృషిభిశ్చైవ స మాం బాధేత నిత్యశః।
పతిం మాం కురు చార్వంగి తురాసాహం సురాధిపమ్।
ఏవం వదతి మాం పాప్మా కిం కరోమి బలార్దన॥" అని.

"అతడు కోరినప్రకారము చేయుము, ఇప్పుడు నే నేమియు చేయజాలను" అని యింద్రుడు పలికెను. (ఈకాలమందు ఇంద్రుడు స్వారాజ్యచ్యుతుడై దాగి యుండెను.) అందునకు శచీదేవి,

"నార్యస్మ్యహం న కులటా త్వచ్చిత్తాతిపతివ్రతా।
నాస్తి మే శరణం తత్ర యో మాం రక్షతి దుఃఖితామ్॥"

"నేను స్త్రీనిగాని, రంకులాడినిగాను, నన్నక్కడ రక్షింపగల దిక్కెవ్వరును లేరు." అని యుత్తరము చెప్పెను. అందులకు దేవేంద్రుడు,

"శీల మేవ హి నారీణాం సదా రక్షతి పాప్మతః।
తస్మాత్త్వం శీల మాస్థాయ స్థిరాభవ శుచిస్మితే॥" అని,

శీలమును కాపాడుకొమ్మని చెప్పెను. పిమ్మట మునిరథ మెక్కిరమ్మని నహుషునితో శచి యొక పన్నాగము పన్నెను. అట్లు వచ్చునప్పుడు అగస్తి శాపముచే వాడు సర్పమై భూలోకమున బడెను. ఈయితిహాసమువలన,ద్వితీయపతిని వరించుట రంకుతనమనియు, శీలభంగ మనియు, సిద్ధాంతము గదా.

## స్త్రీలకై ధర్మోపదేశము.

"కలావస్మిన్యుగే పాపే నరకం యాంతి మానవాః।
తావత్తిష్ఠంతి తే తత్ర యావత్స్యాద్యుగపర్యయః।
పునశ్చ మానుషే లోకేభవంతి భువి మానవాః।
యదా సత్యయుగస్యాదిః కలేరన్తశ్చ పార్థివ।
తదా స్వర్గాత్త్వాన్యాకృతో జాయన్తే కిల మానవాః।
యదా కలియుగస్యాది ర్ద్వాపరస్య క్షయస్తదా।
నరకాత్పాపిన స్సర్వే భవన్తి భువి మానవాః।
ఏవం కాల సమాచారో నాన్యథా భూత్కదాచన।
కదాచి ద్దైవయోగాత్తు ప్రాణినాం వ్యత్యయో భవేత్।
కలా యే సాధవః కేచి ద్ద్వాపరే సంభవంతి తే।
తథా త్రేతాయుగే కేచిత్కేచి త్సత్యయుగే తథా।
దుష్టాస్సత్యయుగే యే తు తే భవన్తి కలావపి॥" దేవీభాగవతము.

పుణ్యపాపులు అనేకయుగములు స్వర్గ నరకములయందుందురని శాస్త్రములు చెప్పుచున్నవి. యజ్ఞాదికమెల్ల నెట్లు స్వర్గముకొఱకో అట్లే పురుషునికి ఉపనయనమును, స్త్రీకి వివాహరూపమగు నుపనయనమును ఏర్పడినవి. అట్టి యనేకయుగభర్తతోడి స్వర్గమును కోల్పోయి, అనేకయుగములు నరకమున గూల్చునట్టిరంకును ధర్మమని పేర్కొని యాచరించుట కెట్లు మనసొప్పును. నాలుగురోజుల రంకులోని సౌఖ్యమె యగపడినదిగాని అనేకయుగముల నరకమును, రంకుమానిన అనేకయుగములు భర్తతోడి స్వర్గమును అగపడినవి కావు. ఓపుణ్యవతులారా,

"ఋతుస్నాతా తు యా నారీ భర్తారం నోపసర్పతి।
సా మృతా నరకం యాతి వైధవ్యం చ పునఃపునః॥" పరాశరః.

ఋతుస్నాతవై భర్తనుపసర్పింపక యుండుట మొదలగు పాతకములచే మీకు నరకము గలిగినది. ఆనరకము ముగిసి మరల జన్మము కలిగినది. ఆపాతకముచేతనే ఈజన్మమందు వైధవ్యము కలిగినది. మరల నరకమునకు ప్రయత్నము చేయక ఓర్పుగలిగి భర్తతోడి స్వర్గమును ఈమాటైనను పొందుడు. మీదుశ్శీలతచేతను అనగా పునర్వివాహాదిపాతకములచేతను అతనిని నరకమున గూల్పకుడు. మీకు వివాహమనెడి యుపనయన సంస్కారముచేసి అనశ్వరమైన ద్విజాతిత్వమును కలుగజేసిన మహోపకారియయినభర్తను శీలభంగముచేత నరకమున గూల్చుటకు మీకు మనస్సు ఒప్పునా! అట్లు చేసిన మీకుమాత్రము నరకము తప్పునా!

"అనుయాతి న భర్తారం యది దైవాత్కథంచన।
తత్రాపి శీలం సంరక్షేత్ శీలభంగాత్ప తత్యధః।
తద్వ్యాగుణ్యాదపి స్వర్గాత్ పతిః పతతి నాన్యథా।
తస్యాః పితా చ మాతా చ భ్రాతృవర్గస్తథైవ చ॥" స్కాందపు.

"దైవికముగా సహగమనము చేయక నిలిచిపోయినయెడల, శీలమును కాపాడుకొనవలయును. కాపాడుకొననియెడల భర్త స్వర్గమునుండి నరకమున గూలును. ఇది తప్పదు. దానితండ్రియు, తల్లియు, భ్రాతలును, నరకమున గూలుదురు." శీలరక్షణమనగా అన్యపతిని వరింపకుండుటయని నహుషుని కథయందు శచినిగూర్చిన యింద్రవచనమువలన ఈగ్రంథమందే నిశ్చయింపబడినది.

"మృతే భర్తరి సాధ్వీ స్త్రీ బ్రహ్మచర్యే వ్యవస్థితా।
స్వర్గం గచ్ఛత్యపుత్రాపి యథా తే బ్రహ్మచారిణః॥" మనుః.



పతివ్రతయగు విధవ, బిడ్డలు లేనిదియైనను స్వర్గముబొందును.

"మృతేభర్తరి యా నారీ భర్తారం కరణైస్త్రిభిః।
ధ్యాయంతీ దేవతాబుద్ధ్యా కాషాయాంబరధారిణీ।
హతస్పృహేంద్రియార్థేషు దేవోపాసనతత్పరా।
తిష్ఠేత్సా ప్రాప్నుయాదేవ తం భర్తారం పతివ్రతా॥" స్కాందము.

పతివ్రతయైన విధవ తప్పకుండ ఆభర్తనే మరల పొందును.

"పత్యౌ మృతేపి యా యోషి ద్వైధవ్యం పాలయేత్క్వచిత్।
సా పునః ప్రాప్య భర్తారం స్వర్గలోకం సమశ్నుతే॥" స్కాందము.

వైధవ్యమును పాలించినస్త్రీ మరల ఆభర్తను పొంది స్వర్గము ననుభవించును.

"పునశ్చిరాయుః సా భూత్వా జాయతే విమలే కులే।
పతివ్రతా తు యా నారీ తమేవ లభతే పతిమ్॥" గారుడము.

"ఆపతివ్రత మరల చిరాయువై పవిత్రమయినకులమందు జన్మించును. మరల వానినే పతినిగాపొందును." ఇట్లు సకలశాస్త్రములును పునర్వివాహము నరకమున గూల్చుననియు బ్రహ్మచర్యము స్వర్గము బొందించుననియు చెప్పుచుండగా జ్ఞానవంతురాలగు స్త్రీ యాపునర్వివాహ పాతకమున కొడిగట్టునా! ధర్మపరులు ఈపాతకమును ధర్మమని లోకమున కెట్లుపదేశింపుదురు?

ఇది శ్రీ కౌశికగోత్రాపస్తంబసూత్ర శ్రీయజుశ్శాఖాధ్యాయి వేదాన్వయోద్భూత శ్రీమద్వేంకటరాయశాస్త్రిపౌత్త్రి బ్రహ్మవాది శ్రీమద్వేంకటరమణశాస్త్రిపుత్త్రి వేంకటరాయశాస్త్రివిరచితం బయిన

స్త్రీపునర్వివాహ దుర్వాద నిర్వాపణము.

సమాప్తము.

---

ఈ వాదమున ప్రథమధర్మమైన యాచారముయొక్క ప్రామాణ్యమును ప్రతిపక్షులు పాటింపనందునను వారు చెప్పుచున్నట్లు శ్రుతిస్మృత్యాదులు ఈ పునర్వివాహమును విధించునెడల ఆచారము తద్విరుద్ధమయినను వారి సిద్ధాంతము కొంత యాదరణీయ మగును గనుకను వారు గ్రహించిన శ్రుత్యాది ప్రమాణములనుమాత్రమే గ్రహించి యీగ్రంథము వ్రాయబడినది.

"శ్రుతి స్తు వేదో విజ్ఞేయో ధర్మశాస్త్రం తు వై స్మృతిః।
తే సర్వార్థే ష్వమీమాంస్యే తాభ్యో ధర్మో హి నిర్బభౌ॥"
"యోఽవమన్యేత తే మూలే హేతుశాస్త్రాశ్రయా ద్ద్విజః।
స సాధుభి ర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః॥" మనుః.

"శ్రుతిస్మృతులు ధర్మమునకు మూలము. వానిని కుయుక్తులచే నిరసించువారు నాస్తికులు, వారిని బహిష్కరింపవలయును."

"శ్రుతిస్మృతి పురాణేషు విరుద్ధేషు పరస్పరం।
పూర్వం పూర్వం బలీయ స్స్యా దితి న్యాయవిదో విదుః॥
శ్రుతిస్మృతి పురాణానాం విరోధో యత్ర దృశ్యతే।
తత్ర శౌతం ప్రమాణం తు తయో ర్ద్వైధే స్మృతి ర్వరా॥" వ్యాసః.

"శ్రుతిస్మృతిపురాణములలో విరోధ మగపడినప్పుడు పూర్వపూర్వము బలీయము." ఇందువలన శ్రుతిస్మృతి పురాణములు ప్రమాణమని తెలియుచున్నది. అయినను పూర్వపక్షులు సకలస్మృతులను తాము యథేచ్ఛముగా ప్రమాణీకరించుచు పూర్వోత్తర వచనముల నడగద్రొక్కి అందువలన తమ వాదమున కుపయోగించునట్లగపడు వచనములనుమాత్ర ముదాహరించుకొనుచు, తమ ప్రమాణవచనములకు తాము వచించిన యపార్థములను ఖండించుటకుగాను నిషేధకోటివారు ఆయాస్మృతులనుండియే వచనాంతరముల నుదాహరించిన, ఆ స్మృతి యీ యుగమునకు పనికిరాదు, ఈ స్మృతి ఆ యుగమునకు పనికిరాదు అని బెదరగొట్టుచున్నారు. మను నారదగౌతమాది స్మృతులనుండి తాము వచనములు వ్రాసికొని నిషేధపక్షమువారు ఆ స్మృతులనుండియే అన్యవచనముల నుదాహరించునప్పుడు,



నారదసంహితా.

పూ॥ "భగవాన్ మనుః ప్రజాపతిః సర్వభూతానుగ్రహార్థ మాచారస్థితి హేతుభూతం శాస్త్రం చకార-తదేత చ్ఛ్లోకశత సహస్ర మాసీత్-తేన అధ్యాయసహస్రేణ మనుః ప్రజాపతి రుపనిబధ్య దేవర్షయే నారదాయ ప్రాయచ్ఛత్-స చ తస్మా దధీత్య మహత్త్వా న్నాయం గ్రంథః సుకరో మనుష్యాణాం ధారయితు మితి ద్వాదశభి స్సహస్రైస్సంచిక్షేప-తచ్చ సుమతయే భార్గవాయప్రాయచ్ఛత్-సచ తస్మా దధీత్య తథైవ ఆయుర్హ్రాసా దల్పీయసీ మనుష్యాణాం శక్తి రితిజ్ఞాత్వా చతుర్భి స్సహస్రైః సంచిక్షేప-తదేతత్సుమతికృతం మనుష్యా అధీయతే-విస్తరేణ శతసహస్రం దేవగంధర్వాదయః।"

"భగవంతు డయిన మనువు ధర్మశాస్త్రమును చేసి నారదులవారి కిచ్చెను. నారదులవారు దానిని సంగ్రహించి సుమతి కిచ్చిరి. దానిని సంగ్రహించి సుమతి యీ గ్రంథమును చేసెను." అని నారదసంహితయందు గలదు. కనుక నారదోక్తములెల్ల మనుధర్మములే-కావున,

"కృతే తు మానవా ధర్మాః త్రేతాయాం గౌతమాః స్మృతాః।
ద్వాపరే శాంఖలిఖితాః కలౌ పారాశరాః స్మృతాః॥" బృహస్పతిః.

కృతయుగమున మనుధర్మములు, త్రేతయందు గౌతమములు, స్మరింపబడెను. ద్వాపరమందు శాంఖలిఖితములు. కలియుగమున పారాశరములు స్మరింపబడెను." అను ప్రమాణమువలన కలియుగమున మానవగౌతమ శాంఖలిఖిత ధర్మములను గ్రహింపదగదు. కనుక "శేషం ముని విభాషి" తమ్మను వచనమువలన తదితరధర్మములను గ్రహింపవలయును. మను నారదాది ధర్మములను ఈ యుగమున గ్రహింపరాదు అనియు, పారాశరములనుమాత్రమే గ్రహింపవలయుననియు ఆక్షేపింతురు. ఇందునకు సమాధానము ఇచ్చుట "స్మృతాః"(స్మరింపబడెను.)అనుపదము స్మరణముయొక్క కాలమును చెప్పును. ఇతరయుగముల నగ్రాహ్యము లని యీవచనము చెప్పదు. యుగమున కొక స్మృతిగా క్రమముగా వచించినందున, ఆయాస్మృతి ఆయాయుగమున ప్రధానమను నభిప్రాయముగపడుచున్నది. మను విరోధమున త్రేతయందు గౌతమములును, తద్విరోధమున ద్వాపరమున శాంఖలిఖితములును, తద్విరోధమున కలియుగమున పారాశరములును, గ్రాహ్యము లని భావము. సాధారణధర్మములనుంగూడ పరాశరులవారు స్మరించిరని విశదమేకదా. కనుక అవిరోధమునను ఇతరయుగముల నగ్రాహ్యము లని భావము గాదు.

పరాశరులవారు.—

౧. "మార్జారమక్షికాకీట పతంగ క్రిమి దర్దురా।
మేధ్యామేధ్యం స్పృశంతోపి నోచ్ఛిష్టం మను రబ్రవీత్॥"

౨. మహీం స్పృష్ట్వాగతం తోయం యాశ్చాన్యోన్యస్య విప్రుషః।
భుక్తోచ్ఛిష్టం తథాస్నేహం నోచ్ఛిష్టం మను రబ్రవీత్॥

౩. ప్రమాపణే ప్రాణభృతాం దద్యాత్త త్ప్రతిరూపకం।
తస్యానురూపం మూల్యం వా దద్యా దిత్యబ్రవీ న్మనుః॥

౪. శుష్కాన్నం గోరసంస్నేహం శూద్రవేశ్మన ఆగతం।
పక్వం విప్రగృహే భుక్తం భోజ్యం త న్మను రబ్రవీత్॥"

అని వచించిరి. ఇందువలన అసాధారణ ధర్మములనే చెప్పి రనగూడదు.

మఱియు,

"మృతసూతిక పుష్టాంగం ద్విజం శూద్రాన్న భోజినం।
అహం త న్న విజానామి కాం వా యోనిం గమిష్యతి॥

గృధ్రో ద్వాదశ జన్మాని దశ జన్మాని సూకరః।
శ్వయోనా సప్త జన్మాని ఇత్యేవం మను రబ్రవీత్॥"

"మృతసూతిక శూద్రాన్నములను భుజించుద్విజుడు ఏపాడుయోనియం దుద్భవించునో నే నెఱుంగను. పంద్రెండు జన్మములు గద్దయనియు, పది జన్మములు పందియనియు, ఏడు జన్మములు కుక్కయనియు మనువు వచించెను." అనియు మనుధర్మములను స్మరించియున్నారు.

మఱియు,

"మనునా చైవ మేకేన సర్వశాస్త్రాణి జానతా।
ప్రాయశ్చిత్తం హి తే నోక్తం గోఘ్న శ్చాంద్రాయణం చరేత్॥

"సకలశాస్త్రవేత్తయు నద్వితీయుండు నగు మనువును ఇట్లే అనగా నావలె అనగా పరాశరులవలె గోఘ్నునికి చాంద్రాయణము ప్రాయశ్చిత్తము విధించెను." అనిరి.

మఱియు,

అతః పరం ప్రవక్ష్యామి ప్రాణిహత్యాసు నిష్కృతిం।
పరాశరేణ పూర్వోక్తాం మన్వర్థేఽపి చ విస్తృతామ్॥"



"ఇకను, వృద్ధపరాశరులవారు పూర్వము చెప్పినదియు మనువు గ్రంథమున విస్తరించినదియు నగు ప్రాణిహింసా ప్రాయశ్చిత్తమును చెప్పబోవుచున్నాను." అనిరి.

పరాశరులవారు ప్రాయశ్చిత్తములనుమాత్రమే 'పరాశరేణ చాప్యుక్తం ప్రాశ్చిత్తం విధీయతే।' అని ప్రాయికముగా స్మరించిరి. అందు పలుమాఱు నామగ్రహణము లేక మనుధర్మములను చెప్పిరి. 'మనురబ్రవీ' త్తని పలుమారు వచించిరి. సర్వజ్ఞుఁడయిన మనువు చెప్పినదే చెప్పితినని సంవాదము చెప్పుకొనిరి. మనువు చెప్పినదానిని చెప్పబోవుచున్నానని ప్రతిజ్ఞచేసిరి. ఇట్లుండగా మనుధర్మములకు యుగనియమ మెట్లు సంభవించును ?

మఱియు "కృతేతు మానవాధర్మా" అనిన బృహస్పతియే,

"ఉక్తో నియోగో మనునా నిషిద్ధ స్స్వయ మేవ తు।
యుగహ్రాసా దశక్యోఽయం కర్తు మన్యై ర్విధానతః॥
తపోజ్ఞాన సమాయుక్తాః కృతత్రేతా యుగే నరాః।
ద్వాపరేచ కలౌ నృణాం శక్తిహాని ర్హి నిర్మితా॥
అనేకధా కృతాః పుత్రా ఋషిభి శ్చ పురాతనైః।
న శక్యంతే ధునాకర్తుం శక్తిహీనై రిదంతనైః॥" అని

కలియుగమునకు నియోగమును మనువు నిషేధించెనని వచించెను.

మఱియు బృహస్పతి,

"తావ చ్ఛాస్త్రాణి శోభన్తే తర్కవ్యాకరణానిచ।
ధర్మార్థమోక్షోపదేష్టా మను ర్యావ న్న దృశ్యతే॥"

"ధర్మార్థమోక్షముల నుపదేశించు మనువు ఎంతకాలము చూడబడడో అంతకాలము తర్కవ్యాకరణాది శాస్త్రములు శోభించును." అని మనుపతనమును విధించెను. ఈపతనవిధి కృతమునకుమాత్ర మనుటకు ప్రమాణములేదు. ఇతరయుగములకు "త్రేతాయాంగౌతమాః స్మృతాః" ఇత్యాది వచనముల వలన గౌతమాదిపతనమును విధించె ననిన కృతమునకుమాత్రము "కృతేతు మానవా ధర్మాః" అనువచనమును చెప్పలేదా? మఱియు పరాశరులవారు ప్రాయశ్చిత్తమునే చెప్పిరిగాని మోక్షమును చెప్పలేదు. కనుక యుగనియమము శ్లోకభావము గాదు.

మఱియు భారతమున,

"ఉత్తమార్ధే వరాత్పుంసః కాంక్షంతే పుత్ర మాపది।
అపత్యం ధర్మఫలదం శ్రేష్ఠం విందంతి మానవాః॥
ఆత్మశుక్రాద పిపృథే మనుస్స్వాయంభువోఽబ్రవీత్ ।" అని పాండు రాజు తనభార్యను ద్వాపరమున మనుధర్మము ప్రకారము నియోగించెను.

మఱియు భారతము,

"పురాణం మానవోధర్మః సాంగోవేదశ్చికిత్సితమ్।
ఆజ్ఞాసిద్ధాని చత్వారి న హంతవ్యాని హేతుభిః॥"

"పురాణమును,మనుధర్మములును,సాంగమగు వేదమును,ఆయుర్వేదమును ఈ నాలుగును ఆజ్ఞాసిద్ధములు తర్కముచే ఖండింపదగవు." అని మనుధర్మముల నుత్కర్షించెను. భారతము కలియుగమున బుట్టినది. కనుక కలియుగముకొఱకు ధర్మములను చెప్పునది. మనుధర్మములను చెప్పినది. ఇచ్చట శ్రుతి స్మృతి పురాణములు చెప్పబడినవి. అందఱు చెప్పినవి మనువుచెప్పిన ధర్మములే అని స్మృతిశబ్దమునకు బదులుగా మనుధర్మ శబ్దప్రయోగము సూచించుచున్నది. కనుక నే కలియుగముకొఱకైన యీవచనమందు "పారాశరో ధర్మః" అని ప్రయోగములేదు. సకల ఋషులును మనూక్తధర్మములనే చెప్పిరని పరాశరులవారు,

"న కశ్చి ద్వేదకర్తా చ వేదం శ్రుత్వా చతుర్ముఖః।
తథైవధర్మాన్ స్మరతి మనుః కల్పాంతరేంతరే॥"

"వేదమునకు గర్త లేదు. వేదమును వినువాడు బ్రహ్మదేవుడు. అట్లే మనువు ప్రతికల్పాంతరమునను ధర్మములను స్మరించును." అనువచనము వలన విశదపఱచియున్నారు. కనుక మన్వాదయము నే యితరులు ప్రపంచించిరనియు అవిరోధమున సకలస్మృతులను గ్రహింపవచ్చుననియు శ్రుతిస్మృతి పురాణములు ప్రమాణమనియు సిద్ధాంతము. ఇది వేదము వేంకటరాయశాస్త్రి విరచిత ధర్మప్రమాణ నిర్ణయము.

సమాప్తము.

---

Printed at the India Printing Works, 1 to 64 pages.
Printed at the K. V. Krishna Press, 65 to 122 pages.

